

శ్రీ ఉమామహేశ్వరాయ నమః

# సానందోపాఖ్యానము

---

## పీఠిక



కాళీరమణీమణీపరిణయశ్రీవేళకౌతూహలా
స్తోకుండై తుహినాచలేంద్రుఁడు భవద్గోత్రాన్వయాధిక్యము
ల్లోకుం దెల్పుమటన్న నొండనక లీలామందహాసాంకుర
వ్యాకోచాననుఁ డైనధూర్జటి మదీయాభీష్టము ల్సల్పెడున్. 1

శా. భావజ్ఞుం డగుకాళహస్తిపతిశుంభత్కుంభికుంభోపమ
శ్రీవిద్యోతకుచాగ్రసీమమకరీచిత్రోఘము ల్వ్రాయుప్ర
జ్ఞావిజ్ఞప్తికి మెచ్చి ముద్దొసఁగు మాజ్ఞానప్రసూనాంబికా
దేవీరత్నము భోగభాగ్యబలబుద్ధిశ్రీలు మా కీవుతన్. 2

సీ. తపనీయతాటంకధగధగద్యుతిపాళిచెక్కుటద్దంబులఁ జెలువుగులుక
దరకంధరాస్ఫుటతారహారప్రభ ల్మిత్యాలఱవికెపై మురువుసూపఁ
గల్యాణరత్నకంకణనిక్వణచ్ఛట లంగుళీయకముల ననఁగి పెనఁగ
హాటకచిత్రచీనాంబరరోచులు మేఖలాఘృణులతో మొందుకొనఁగ
తే. ఘర్మమంజీరమంజులార్భటులు సెలఁగఁ, జారుశృంగారమోహనాకారలీల
లెసఁగ సాక్షాత్కరించి మదీప్సితంబు, లిచ్చు శ్రీకాళికాదేవి నిచ్చఁ గొలుతు. 3

చ. కలిమిచెలందిగుబ్బకవగంధపుఁగ్రొంజిగిచిక్కె లక్కునన్
సెలకొని తారహారరుచి నింపఁగఁ జక్కిహుమాయి నెక్కి వే
ల్పులు గొలువంగ సేవకులఁ బ్రోచుటకై భువనత్రయంబున
న్మెలఁగురమామనోహరుఁడు మిక్కిలి మా కొనఁగూర్చు కోరికల్. 4

చ. పలుకువెలందిసెన్నొసలిపట్టున నెట్టనఁ బచ్చకస్తురిం
దిలకము దిద్ది క్రొన్నెలను నిల్పి కళంకముఁ జూడు మంచు న
య్యలరులఁబోఁడితోఁ బలికి హాస్యము నెమ్మదికెక్కఁ జెక్కిలిం
పలరఁగ ముద్దుగొన్నకమలాసనుఁ డీవుత మా కభీష్టముల్. 5

సీ. సర్వమునర్వులు సంకల్పసిద్ధిగా నేమహాత్ముని గొల్తు రెల్లప్రొద్దు
నీలకంఠునకు మానితమూర్తి యై పుట్టి నీలకంఠము నెక్కనిపుణుఁ డెవఁడు
పెటపెట బ్రహ్మాండభాండము ల్పగులంగ శరభమై నరసింహుఁ దరమె నెవఁడు
ప్రళయకాలమునాఁడు పదునాల్గులోకము ల్చక్కాడె నెవ్వాఁడు ధక్కవాసి
తే. నట్టిశాంతుని ఘనుని మహాప్రతాపు, ఘోరతరకోటివిస్తారసారమతిని
గంధసింధురవక్త్రుని గార్తికేయు, వీరభద్రుని భైరవుఁ గోరి కొలుతు. 6

తే. శారదాదేవిపదపంకజముల కెఱఁగి, యాదిసాహిత్యకల్పనాహ్లాదభావ
భద్రు సుశ్లోకి వాల్మీకిఁ బ్రస్తుతించి, యప్పరాశరనందను నభినుతించి. 7

మ. తలఁతుం దండిమయూరభారవులవాగ్ధాటీవిలాసంబుచో
రలసచ్చిత్రకవిత్వవాఙ్మధురధారాశుద్ధి వర్ణింతు మి
క్కిలిఁ గీర్తించెదఁ గాళిదాసకవితాక్రీడావినోదంబుఁ బెం
పలర న్దిక్కనముఖ్యసత్కవుల విద్యావైఖరు ల్మెచ్చెదన్. 8

చ. తలఁపరు వాక్సుధామధురధాటివిశేషవిచిత్రకల్పనా
కలన నుతింపలేరు పదగౌరవము ల్గొనియాడ నేర రా
సొలయక తప్పులే వెదకఁ జూతురు రాజసభాంతరాళసు
స్థలముల నట్టిదుష్టకవిసంఘముల న్మది మెచ్చ నెమ్మెయిన్. 9

వ. ఇవ్విధంబున నిష్టదేవతాభివందనంబును శిష్టకవినందనంబును దుష్టకవినిందనంబునుం
గావించి యొకమహాపుణ్యకృతి సేయం దలంచి యున్నసమయంబున. 10

సీ. ఏమహాత్ముఁడు దక్షిణామూర్తిగతి శిష్యతతికి బోధించు నద్వైతబోధ
మేరాజమాన్యుండు సారచిత్రకవిత్వగరిమ ప్రబంధసంఘములు చేసె
నేరమ్యగుణశాలి శ్రీరాజయోగసంయోగవిజ్ఞానైకయుక్తి వెలసె
నేసంతతానందుఁ డీశ్వరచరణాబ్జసేవామహాద్భుతసిద్ధిఁ గాంచె
తే. నట్టియభినవధూర్జటి యస్మదీయ, దేశికస్వామికరుణావిధేయుఁ డగుచు
వచ్చి నేఁ జేయుపూజల కిచ్చమెచ్చి, పలికె నిట్లని మధురవాక్పటిమ మెఱయ. 11

క. కృతిసేయఁ దలఁచితివిగా, సతతము శివభక్తిసారసంగ్రహలీలా
ద్భుతలోకోత్తర మగునొక, యితిహాసము గలదు దాని నెఱిఁగింతుఁ దగన్. 12

క. సానందోపాఖ్యానముఁ, బూని వచింపంగఁ గల్గు పురుషార్థము ప్రు

ణ్యామానకీర్తిశుభములు, మానితముగ వెలసె దీవు మహిలో ననిసన్. 13

చ. గురుచరణాంబుజాతములు గొల్చి తదీయకటాక్షవీక్షణాం
చరితవిభూతి పెంపెసఁగి కోరి వచింపఁగఁ బూనినట్టిసుం
దరతరకావ్యసుందరికి నాథుఁ డెవండని చింతసేయ న
ప్పరమశివుండు నాహృదయపంకజమందు వెలింగె నర్తలిన్. 14

శా. శ్రీకాళద్వీపనాథుఁ డీశ్వరుఁడు మచ్చేతోంబుజాతంబునం
దాఁ గల్యాణము గాఁగఁ దోఁచె నని భద్రానందయుక్తుండ నై
యీకావ్యాధిపుఁ డమ్మహాత్ముఁడు నిజం బిట్లౌట మద్భాగ్యరే
ఖాకౌశల్యవిశాలభూతికవిలోకం బర్థిఁ గీర్తింపదే. 15

తే. కళుకు లీనెడితళుకుబంగారుమీఁద, దివ్యరత్నంబు నిల్పిన తెఱఁగుగా నా
యిమ్మహాకావ్య మఖిలలోకేశు పేర, నంకితము సేయఁబూను టేమనఁగవచ్చు. 16

సీ. తత్క్షణంబున సర్వధర్మస్వభావుండు సమయవిశేషవాచాప్రవీణుఁ
డుత్తమగుణశాలి యోగైకవిజ్ఞాని యాగమతత్త్వరహస్యవేది
శివపాదపంకజసేవానురక్తుండు చిన్మయాత్ముఁడు సదాశివగురుండు
వేదాచలస్థానవిహారణోన్నిద్రుండు కరుణాకటాక్షసంకలితుఁ డగుచు

తే. రమ్ము శివరామ నీకు యశమ్ము గలుగు, నిమ్మహాకృతి కాళహస్తీశు పేర
నంకితముసేయుమన్న దేహాంబు వొంగి, యటులఁ జేసెద లెస్సాయెనని ప్రియమున.

క. శ్రీకాళహస్తినాయకుఁ, డీకవితాకన్యకకు నధీశ్వరుఁ డంచుం
జేకొని మద్వంశక్రమ, మే కొంత నుతింతుఁ జిత్త మిగురొత్తంగన్. 18

సీ. గాధిరాడ్దర్భాబ్ధికౌస్తుభశ్రీఁ గాంచి మునిసమూహములోన ఘనతకెక్కి
పట్టినపట్టు చేపట్టి దిట్టయనంగ నఖిలలోకములఁ బ్రఖ్యాతి వడసి
రంభను శపియించి రాయిగమ్మని యజ్ఞపశువుశునశ్శేపు బ్రతుకఁజేసి
వేల్పులదొరయైన వేయిగన్నులవానిసరి గద్దెపై హరిశ్చంద్రు నునిచి

తే. సకలభూపాలమూర్ధన్యసముదయములు, భూరిసద్భక్తి విశ్వాసపూర్వకముగఁ
బూజఁ గావింప వెలసినపుణ్యశాలి, మహితగుణశాలి కౌశికమౌనిమౌళి. 19

ఉ. మేనకమోవితేనెలకు మిక్కిలి చొక్కి వసిష్ఠుతోఁ జలం
బూని యెదిర్చి బ్రహ్మఋషి యౌ ననిపించుకొనె న్త్రిశంకుభూ
జాని కొసంగెఁ దా బదులు స్వర్గము స్రష్ట సృజించుసృష్టికిన్
బూని సృజించె సృష్టి మునిపుంగవుఁ డౌశికు నెన్న శక్యమే. 20

క. ఆకౌశికగోత్రాబ్ధికు, ధాకరుఁ డఖిలైకదానధర్మకళాను
ష్ఠాకుఁడు చెంగన్నయనం, గాఁ గీర్తి వహించెఁ గోటకరణం బగుచున్. 21

తే. ఆతఁడు కాళమవలనఁ గృతార్థుఁడైన, పొట్టినాయనిఁ బడసె నప్పుణ్యశాలి
రూపరేఖాగుణశ్రీల రూఢిఁ గన్న, పరమసాధ్విని సూరమాంబను వరించె. 22

సీ. ఆవధూవరులకుఁ బావనచారిత్రుఁ డగువేంకటాద్రి నిత్యాన్నదాన
పరుఁ డైనయణ్ణాచ్చి పద్మయ గురువయ యన గుణవంతు లైనట్టిసుతులు
పొడమిరి నలువురు పోలుపొంద వారిలో నారీజనైకకందర్పమూర్తి
మహితాత్ముఁ డణ్ణాచ్చి మానవేంద్రులసభాస్థలిఁ బ్రసిద్ధి వహించె ధన్యుఁ డనఁగఁ
తే. గోటసీమకుఁ గరణమై గురువిలాస, పరమసద్గుణమణిగణాభరణబంధు
భరణశరణాగతత్రాణకరుణ యగుచుఁ, జెలఁగుఁ గామాక్షమాంబనుఁ జెట్టవట్టి. 23

క. కామాక్షమాంబయందు మహామహుఁ డణ్ణాచ్చి గాంచె నతులితతేజో
ధాముల వినయోద్దాముల, భూమానితనాము లైనపుత్త్రాగ్రణులన్. 24

క. ఆం దగ్రజుఁ డై విభవము, లందెన్బెదబాఁపనయ్య యాతని గారా
పుందమ్ములు మనిరి కళా, విందులు చినబాఁపనయ్య వేంకటపతియున్. 25

ఉ. వారలలో మహాగణికవర్యుఁడు శాంతుఁడు దానవైభవో
ద్దారుఁడు బాఁపనయ్య వసుధాస్థలిలో వెలసె న్సమస్తధా
త్రీరమణాగ్రగణ్యులు సుధీమణు లార్యులు బంధువర్యులుం
గూరిమి సన్నుతింప ననుకూలనిజస్థిరధర్మమార్గుఁ డై. 26

క. కులజుం డని నిజబాంధవ, కుల మభినుతిసేయ నతనిగురుకీర్తిరుచుల్
తళతళమనువజ్రంబులఁ, దలతలమనఁగాను బొగడ దర మెవ్వరికిన్. 27

ఆ. బాఁపనయ్య యొసఁగు బాఁపనయ్యల కగ్ర, హారమార్తికాగ్రహారవార
సారభూరిగంధసారరత్నాంబర, మాన్యమాన్యతతులు మహిని వెలయు. 28

తే. ఆతనియర్ధాంగలక్ష్మియై యతిశయిల్లు, చెలువుగలబొమ్మ పతిభక్తి కలుగుకొమ్మ
భాగ్యములకీవి సకలసంపదలదీవి, మహితగుణపేటి యలమేలమావధూటి. 29

క. కలుములచెలిచందమున, న్గలుములు గల్పించుబంధుగణముల కెపుడా
యలమేలమాంబ బళిరా, యలమేలు నుతింపఁ దరమె యజునికి నైనన్. 30

క. ఆదంపతులపురాసం, పాదితపుణ్యప్రభూతభాగ్యం బనఁగా
నాదిజనించెన్ గురవయ, యాదట పాపన్న రామనాఖ్యులు వొడమన్. 31

క. ఆం దగ్రజుఁ డగుగురవయ, మందారశతారతారమహనీయయశ
స్సుందరుఁ డయి పుణ్యకళా, బృందమ్ముల వెలసెఁ బ్రజలు బ్రీతి నుతింపన్. 32

క. ఆతనిసహోదరవరుఁ డా, శ్రితజనపరిపాలనైకశీలుఁడు నిరత
క్షితిధరకార్ముకపూజో, న్నతుఁ డతని నుతింపఁ దరమె నరమాత్రునకున్. 33

సీ. ఏధన్యుఁ డఖిలరాజాధిరాజులమహిమఘటనాఘటనసామర్థ్య మెనసె
నేధీరుఁ డుద్యద్విరోధిసంఘంబుల మెదలఁగనీయక మద మడంచె
నేమహాచతురుఁ డుద్దామమేధాశక్తి వరుస లెక్కలుగూడి వ్రాయఁ దొడఁగె
నేఘనుం డీశజూటీఘుమఘుమితదివ్యారవోక్తులభావ లాడ నేర్చె
తే. నతఁడు సామాన్యుఁడే సమస్తావనీప, మంత్రతంత్రకళాశ్రీసమంజసైక
మూలభావక్రియాలోలశీలశాలి, కవనవాక్కేలిపాపయగణకమాళి. 34

చ. అతనికిఁ దమ్ముఁడన్ మధురసాధికసవ్యవిచిత్రసాహితీ
కృతరచనాచమత్క్రియల కీర్తివహించినరామయాఖ్యుఁడన్
సతతముఁ గాళికాంబపదసారసయుగ్మముఁ గొల్చి తత్కృపా
ప్రతిభ వహించి దివ్యతరభవ్యచిదాత్మగురుప్రసాదినై. 35

వ. కృతిపతి యగుశ్రీకాళహస్తిపతికిఁ బునఃపునః ప్రణామంబులు గావించి యమ్మహా
దేవుఁ డవాఙ్మానసగోచరుం డయ్యును భక్తజనసంరక్షణవిచక్షణేక్షణదీక్షాదక్ష
సగుణస్వభావుం డగుట నానేర్చువిధంబునఁ దదీయమహిమం బభివర్ణించెద. 36

సీ. అజ్ఞానతిమిరసూర్యమహామయూఖంబు పాతకప్రస్ఫుటవాతభోగి
యీషణత్రయనీరసేంధనాగ్నిజ్వాల షట్సత్త్వపావకజలధరంబు
సంపూర్ణమోహసంసారాబ్ధిబడబాగ్ని యమకింకరభటమదేభాంకుశంబు
దుర్భరోద్భటవిపద్ధూళీసమీరంబు దారిద్ర్యపుంజలతాలవిత్ర
తే. మంబుజోత్పలసౌరభాడంబరస్ఫు, రత్సువర్ణముఖీశంబరప్రభార
మావిలోకనమాత్రసంపాదితాధ్వ, గవ్రజసముజ్జ్వలస్వస్తి కాళహస్తి. 37

మ. ఘనసౌధాగ్రమహాశివధ్వజమణీకల్యాణలీలాకన
ద్ఘనఖద్యోతనటత్పటీపటపటాత్కారంబు వీరద్విపా
శ్వనవస్యందనభాస్వరంబు సతతజ్ఞానప్రసూనాంబికా
వనసద్వర్ణచతుష్క మెంచఁగఁ దరం బా కాళహస్తి న్మహిన్. 38

క. ఆపురమున మణిగణఘృణి, గోపురలీలావిలాసగుణదివ్యశ్రీ
దీపికసౌధాంతరమునఁ, గాఁపురముగ వెలయు నీలకంధరుఁ డెలమిన్. 39

క. ఆతనిమహానుభావము, లీతఱి మద్వాక్సుధారసేద్ధకవిత్వ
శ్రీతోషణభాషణముల, సాతతమతి సంస్తుతింతు నది యెట్లనినన్. 40

సీ. ప్రాణులఁ బుట్టింపఁ బాలింపఁ దూలింపఁ గర్తయై త్రిగుణసంకలితుఁ డగుచు
నిగమవిజ్ఞానమై నిరుపమాకారుఁడై నిర్వికల్పుండయి నిఖిల మగుచు
బ్రహ్మాదివంద్యుఁడై బ్రహ్మాభిమానియై బ్రహ్మాండమై పరబ్రహ్మ మగుచు
సచ్చిదానందుఁడై సంసారదూరుఁడై సర్వసంపూర్ణుఁడై సాక్షి యగుచు

తే. సౌఖ్యసంభూతిదై సదాశాంతుఁ డగుచు, భూతములకెల్ల నాధారభూత మగుచు
వెలయుదక్షిణకైలాసనిలయుఁ డీశ్వ, రేశ్వరుం డైనకాళహస్తీశ్వరుండు. 41

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణలీలా, పావనపుణ్యప్రభావబంధురమతికిన్
దేవప్రదత్తవాగ్రే, ఖావిశ్రుతకృతికి దక్షకన్యాపతికిన్. 42

క. ధీరునకున్ దీనజనా, ధారునకు న్నిశితశూలదారితరక్షో
వీరునకున్ దురితోత్కర, దూరునకున్ దారువనవధూజారునకున్. 43

క. సోమునకున్ సేవకసు, త్రామునకుం దారతారధవళమహీభృ
ద్ధామునకున్ మారుతభు, గ్దామునకున్ మౌళిధృతసుధాధామునకున్. 44

క. శంభునకున్ దీర్ఘభుజా, స్తంభునకున్ గజనిశాటసంరంభకళా
సంభేదనరణవిద్యా, శుంభత్తేజునకు మోనిసురభూజునకున్. 45

క. రుద్రునకున్ సకలకళా, భద్రునకుం ఖుషితవీరభద్రునకు న్ని
క్షిద్రదయాసౌభాగ్యస, ముద్రునకుం జిన్మయైకసముద్రునకున్. 46

క. ఈశునకున్ భూషితభుజ, గేశునకున్ వదనతామరేశునకు నభః
కేశునకున్ హృతయోగీం, ద్రాశాపాశునకుఁ గాళహస్తీశునకున్. 47

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన సానందోపాఖ్యానంబునకుఁ గథాసంవిధా
నం బెట్టిదనిన.



# ప్రథమాశ్వాసము



మ. జటిరాణ్మాన్యము పుష్పపల్లవసమిత్సంపాదనార్థాచర
త్పటువాగ్జన్యము ముక్తిసౌఖ్యమహిమావాల్లభ్యమేధావిధా
నటనాపుణ్యము సాలనింబగణికానారంగరంగాజపా
కుటలావణ్య మనంగ నైమిశ మెసంగున్ భూరితారుణ్యమై. 49

వ. అది మఱియును జందనస్యందనమందార మాకందపిచుమంద తాలరసాలక్రకోల తమాల హింతాల మాతులుంగ లవంగ లుంగ నారంగ కదంబ జంబూ జంబీర ప్రముఖ నిఖిలశాఖిశాఖాశ్లాఘనీయంబై చక్రచక్రాంగ బకపికశుక మయూర చకోరసారస దార్వాఘాటాది పతంగకులకలరవాకీర్ణంబై యన్యోన్యవైరత్యక్త సుహృద్భావ సమాచరశరభకంఠీరవశార్దూల శుండాలగండక వరహావాహాహిత చమరీకురంగప్లవంగగోలాంగూల భల్లూక వృక నకుల సారమేయ సృగాల మార్జాలాది సమస్త మృగసంకులంబై పదాదిజటివటుపటల వాక్పటుఋగ్యజుస్సామాథర్వణాది జటాంతస్వాధ్యాయ కోలాహలంబై తపోవనస్థిత జనతర్కిత కావ్యనాటకాలంకార తర్కభాష్య భాట్టప్రాభాకర ప్రభృతి శాస్త్రోపన్యాస విన్యాసంబై సప్తతంతు క్రియా ప్రజ్వలితానల హోమధూమలీలాభిరామంబై యితస్తతః పరిత స్తత్తదాశ్రమ యజ్ఞవేదీ ప్రత్యగ్రముక్తా రంగవల్లీయుతంబై సమంజసమంజరీనికుంజగుంజద్భృంగ సంగీతసంగతంబై పుండరీకనీలోత్పలకుముద సరసీరుహ పరిమళమిళితకాసార సమీరకిశోరసంచారంబై గిరివరశిఖాగ్రస్యందిమందాకినీ తరంగరంగన్మృదంగ ధింధీమ్యాదిధ్వానాను సంధానంబై మరుచ్చలత్కుటీర బహిస్తరుపటల నిబద్ధ పరివ్రాట్కాషాయశాటీ పటపటాత్కారకారణంబై సకలధర్మాకరంబై సమస్తమునిజన సేవ్యమానంబై కిన్నరగరుడోరగ సిద్ధసాధ్య విద్యాధరాకీర్ణంబై రంభాముఖ్యాప్సరః క్రీడామందిరంబై యొప్పు నమ్మహారణ్యంబున. 50

ఉ. శౌనకుఁ డాదిగాఁ గలుగు సంయములెల్ల నిరంతరం బుమా
జానికథాసుధారసము సారెకుఁ గ్రోలుచు సర్వశాస్త్రవి
జ్ఞానసమేతు సూతుఁ గని సద్వినయంబునఁ బల్కి రిట్లు భా
షానళినాక్షీపాదజలజస్ఫుటనూపురమంజుళార్భటిన్. 51

సీ. అనఘ చారిత్రపావనమైన శంభుపురాణరాజికి మహారాజమైన
స్కాందపురాణసత్కథ లన్ని వీనుల విందుగా వింటిమి డెంద మలర
నందు సానందసంయమిదా ట్పవిత్రభావంబు వినఁగోరి మోద మావిర్భవించె
నమ్మునిపుంగవుం డర్కజుపురి కేల విచ్చేసి పాపులవెతలు వాపె
తే. గరుణ మానసవీథిలోఁ గడలుకొనఁగ, శంభులోకానుగతుల నేసరణిఁ జేసె
నింతమాహాత్మ్య మతనికి నెట్లువచ్చెఁ, దెలియ వినిపింపవయ్య సుధీవరేణ్య. 52

చ. అన విని సూతుఁ డిట్లనియె నమ్మునినాథులవైపు జూచి య
య్యనఘుమహత్త్వ మెన్నఁ బులకాంకుర మయ్యెడి మేనఁ గంపమున్
బెనఁగొనుచున్న దంధకవిభేదిసమున్నతభక్తకోటిలో
ఘనత వహించె నమ్ముని జగన్నుతగౌరవ మెంచ శక్యమే. 53

సీ. శివు నపేక్షించినచిత్తంబు చిత్తంబు భవుకథ లాలించుచెవులు చెవులు
కరకంఠుఁ బూజించుకరములు కరములు శ్రీశంభు వర్ణించుజిహ్వ జిహ్వ
గౌరీశుఁ బొడగనుకన్నులు కన్నులు మదనవైరికి మ్రొక్కునుదురు నుదురు
హరుమందిరము మెట్టునడుగులు నడుగులు సర్వేశు జపియించుజపము జపము
తే. భర్గుఁ గొనియాడనేర్చినభక్తి భక్తి, చిన్మయాత్ముని సేవించు సేవ సేవ
నీలకంధరుఁ దలపోయు నేర్పు నేర్పు, శర్వుమహిమంబు లెన్నినచదువు చదువు. 54

క. కావున శివుకథ నొడివినఁ, బావనమగు నామజిహ్వ ప్రజ్ఞాన్వితులై
ధీవర్యులార వినుఁ డని, యావిప్రుల కతఁడు చెప్పె నార్షం బెసఁగన్. 55

సీ. సంసారనీరదఘోరఝంఝాప్రభంజనం బాశాచలేంద్రవజ్రాయుధంబు
పంచేంద్రియద్విపపంచాస్యశాబకం బరివర్గదవకీలికాంబుదంబు
కలుషమండూకభీకరపంచశూకంబు పటుదుఃఖవారాశిబాడబంబు
రాగానురక్తసారంగశార్దూలంబు భేదాంధకారసూర్యోదయంబు
తే. సచ్చిదానందమహిమాతిశయవిభూతి, మానితానూనహంసోక్తిమార్గపూర్ణ
భావయోగిప్రకాశసంపద్ఘనంబు, బదరికావన మత్యంతపావనంబు. 56

ఉ. ఆవనమధ్యసీమ సుగుణాకరుఁడై మను పూర్ణచిత్సుధా
శ్రీవిబుధాగ్రగణ్యుఁడు ప్రదీపితవేదకళారహస్యసం
భావితమూర్తియై యపరపద్మజుఁడో యన శంభుపాదసే
వావినుతాంతరంగుఁ డయి వర్తిలుఁ దత్త్వవివేకసంపదన్. 57

సీ. ప్రజ్ఞాకళాప్రౌఢిఁ బ్రతిభుజంగస్వామి శాంతలీలాగతి జగతి సాటి
సారస్వతఖ్యాతి సముఁడు శుక్రుం డుద్ది ధాత వేదాంతవిద్యానిరూఢి
పరిపూర్ణవైరాగ్యపటిమ దీటుశుకుండు సనకుండు సవతు సుజ్ఞానలీల

తులవసిష్ఠుఁడు శిష్టకలనాతపశ్శక్తి సరిగౌతముఁడు మహైశ్వర్యమహిమ

తే. సతతగౌరీమనోహరచరణకమల, సంగతధ్యానభక్తివిశ్వాసభాగ్య
గౌరవశ్రీల నుపమ మృకండుసూతి, పూర్ణచిత్తునిగుణములు వొగడఁ దరమె 58

మ. వడిగా వేకువ శంకరస్తుతివచోవ్యావృత్తి మేల్కాంచి న
ల్గడ శిష్యప్రకరంబు గొల్వఁ జని గంగాస్నానముం జేసి ని
ల్కడతో నిత్యవిధు ల్ఘటించి కడు వేడ్కన్ వచ్చుఫాలంబునం
దొడలం భస్మరజోరుచుల్ వెలుఁగఁ బూర్ణోత్సాహియై యింటికిన్. 59

మ. విలసద్భక్తికలాసమంచితమనోవిశ్వాససంకల్పితో
జ్జ్వలసద్యోఘృతపాయసేంధను మనువ్యాహారహోమానలా
తులకాలత్రయపూజల న్సుజనసంతుష్టాన్నదానక్రియా
కలనం దద్విజుఁ డొప్పు శంభుపదయుగ్మధ్యాననిష్ఠాప్తితోన్. 60

తే. తరళలోచన మదమత్తదంతిగమన, పీనవక్షోజహారిమధ్య సూనగంధి
రూపయౌవనగుణకళారుచిర యగుచుఁ, దగు నతనిపద్మముఖి భద్రదంతి యనఁగ. 61

క. ఆభద్రదంతి గుణగుణ, శోభా మేధావిలాసశోభనమహిమం
బాభారతీశ్వరుండై, నా భావింపఁగ సమర్థుఁడా మునులారా. 62

సీ. జలజలోచన మోము సరిపోలఁజాలక పంకజవైరి కళంకియయ్యె
నింతిలేనడుముతో నీడువూనఁగనోడి కొదమసింగంబులు గుట్టలెక్కెఁ
జానపెన్నెఱులతో సాటిరాకకలంగి చిద్రుపలై మేఘము ల్సొరె గిరుల
నలివబాహువులతోఁ బ్రతిగాక సిగ్గున నెగ్గి మృణాళము ల్నీటఁ బడియె

తే. వనితతొడలకు దీటుగా కనఁటులెల్ల, మ్రానుపడి నిల్చె గుంపులై మదముదక్కి
లలన సౌందర్యలీలావిలాసగరిమ, లభినుతింపంగఁదరమె శేషాహికైన. 63

తే. చాననఖముల కెనగాక సత్కుదంబ, మదరి నిలిచినచో నిల్వ కంబరమునఁ
బఱవఁ జొచ్చె వధూదంతపంక్తి కెదురఁ, గడఁగి కుందంబు లొండొంటఁ గట్టువడియె. 64

సీ. మగనిశరీరంబు సగము సేయకయున్న గట్టుపట్టిని దోడు పెట్టవచ్చుఁ
దొడరి నాథునిబొమ్మ ద్రొక్కి నిల్వకయున్న క్షీరాబ్ధిసతి నీడు సేయవచ్చుఁ
బలుమాఱుఁ బ్రజనోటఁ బడక మూరకుండిన భాషాసతిని సాటి పల్కవచ్చుఁ
బతులఁ బెక్కండ్ర సంపాదింపకుండిన భూమిదేవిని దీటు పూన్పవచ్చు

తే. నివ్వధూమణి కని జనులెల్లఁ దనదు, మహిమ వినుతింపఁ జెలఁగు నమ్మధురవాణి
సైకతశ్రోణి నీలభుజంగవేణి, వికసితాంబుజపాణి యువ్విప్రురాణి. 65

సీ మెలఁతికన్నులసంచు మీనులీలల మించుఁ గనుబొమల్మరునిసింగాణివంచు
శేమునిద్దఁపుమోము సోముఁ గెల్వఁగనోపుఁ దళుకు లెనగపు వెన్నెలలగీము

పచ్చఁటిపెన్నెఱఁగుంపుభ్రమరపఙ్క్తుల నొంపుఁ బలుకులు కప్పురా ల్పలుకునింపు
చెలికావిమోవి కెంజిగురాకుఁ గలికివి కళుకమైఁడిఁగె చెంగలువతావి

తే. నాసనంపంగివిరులకు నాపిగొల్పు, పలుమెఱుంగులముత్యంబు పలువహారంగు
ఘనకరశ్రీలు పీఁచులఁ దనదుశ్రీలు, చెక్కులు కడానిజాళువాచెక్కు లరయ. 66

ఉ. కామనధామణీకరవికస్వరహేమగుళుచ్ఛదేవతా
సామజకుంభచక్రయుగసారసకోరకతాళలీలల
న్వేమఱు నెల్చి క్రమ్మఱఁగ వేమరుచక్రము నాక్రమించు నా
భామినిచన్నుదోయిఁ జిగిఁ బోటిలు బంగరుబొంగరా లనన్. 62

తే. వనిత లేఁగౌను నభముతో వాదుగొనును, నారనూఁగారు మరువింటినారిఁ గేరుఁ
గలికివళులు సుధాతరంగములగములు, నెలఁతపాలిండ్లు బంగారునిమ్మపండ్లు. 68

తే. ఇట్టిసౌందర్యనిధియైన యిందువదన, తను భజింపంగ వెలసె నద్ధరణిసురుఁడు
చతురసంభోగవైభవసరణి దనర, శైలసుతసేవ నలరెడుశంభుఁ డనఁగ. 69

క. ఈరీతి వార లిరువుర, కారూఢవిలాసయౌవనారంభకళా
శ్రీరాజితేష్టభోగవి హారమతిం గొంతకాల మరిగినపిదపన్. 70

మ. పతిశుశ్రూషలు సల్పుచున్ వినయ మాపాదించి తా నొక్కనాఁ
డతులాహ్లాదవికాసభాసురమనీషాయత్తయై మంగళా
న్వితయై నందనవాంఛితోత్సవకళ ల్నిండారియుండంగఁ ద
త్పతిపాదంబులమీఁద వ్రాలి పలికెం బద్మాక్షి లేనవ్వునన్. 71

సీ. సంతానహీనసంసారంబు కుముదినీరమణచంద్రిక లేనిరాత్రి గాదె
నందనాభావ సానందవైభవము దీపంబు లేనట్టిగృహంబు గాదె
సుతశూన్యమంగళాయతభాగ్యరేఖ సింగంబు లేనిమహావనంబు గాదె
తనుజాతరహిత సంతతయశస్స్ఫూర్తి హంసంబు లేనిసరోవరంబు గాదె

తే. గాన సత్పుత్రరత్నంబు గలుగకున్న, దుర్గశమనంబు గాదు బంధురకటాక్ష
మెనయ సర్వంబు సర్వేశుఁడిచ్చి మనకు,నొక్కకొడుకును దయసేయకున్నవాఁడు.

ఉ. చక్కనిముద్దుబాలకుని జక్కిలిగింతలుపెట్టి యేడ్పురాఁ
జెక్కిలిగొట్టి యెత్తికొని చక్కనిమక్కువ మాటిమాటికిం
బక్కున నవ్వఁజేసి పయి ప్రక్కఁ బడంగ వినోదవైఖరిం
జక్కగ ముద్దులాడవలదా కలదా యిటువంటిసౌఖ్యమున్. 73

ఉ. కొడుకులు లేనిమానవులకూటము లేటికి భోగ మేటికిం
గడువిభవంబు లేమిటికి గౌరవ మేటికి భాగ్య మేటికిన్

జెడనివిలాస మేమిటికిఁ జిత్రవిలాసగృహంబు లేటికిం
గడపట నిన్నియుం గని వనికిఁ గాచినవెన్నెలలట్ల వల్లభా. 74

తే. ప్రొద్దుప్రొద్దున మేల్కాంచి పుత్రరహిత, పంకజాక్షిని జూడఁ బాపం బటంచు
బుధులు సెప్పంగ వింటి నోపురుషవర్య,యిట్టిదుఃఖంబు భరియింప నెట్లువచ్చు. 75

వ. అదియునుంగాక యపుత్రకులకు సద్గతులులేవని వేదంబులవలన వినంబడుం గావున మీవంటిమహానుభావులకుఁ దనూభవుండు లేకుండుట యనుచితంబుగాదె భక్తజన రక్షణదక్షుం డయిన విరూపాక్షునిం బ్రార్థించి పావనచరిత్రుం డగుపుత్త్రుం డుద్భవిల్లునట్లుగా వరంబు గొను మనిన నవ్వరారోహామధురప్రియవాక్యంబుల కియ్యకొని హర్షపులకితాంతరంగుం డయి యవ్విప్రపుంగవుం డిట్లనియె. 76

సీ. తరళాక్షి శివుఁడు దాతలసార్వభౌముండు వరభోగములు సురవరున కిచ్చె
నవనిధానములు గిన్నరనాయకుని కిచ్చె నసురారి కిచ్చెఁ జక్రాయుధంబు
బంగారుగుబ్బలి బర్హిర్ముఖుల కిచ్చె బ్రహ్మకు నిచ్చె నిర్మాణశక్తిఁ
దనయున కిచ్చె విద్యాగురుపట్టంబుఁ దనుభాగ మచలేంద్రతనయ కిచ్చె

తే. జడలపై నుండనిచ్చె నక్షత్రభువిని, నమ్మహాదేవుఁ డీనిపుణ్యంబు లెవ్వి
గాన శంకరదానరేఖావిలాస, మభినుతింపంగలేరు బ్రహ్మాదులయిన. 77

చ. శివుఁడు మహానుభావుఁడు విశిష్టజనప్రియుఁ డవ్యయుండు మా
ధవుఁ డఖిలైకమంగళుఁ డుదారకృపామహిమాన్వితుండు కే
శవవిధిముఖ్యవంద్యుఁడు భుజంగవిభూషణుఁ డీశుఁ డీశ్వరుం
డవిరళభోగమోక్షముల నాశ్రితకోటికి నిచ్చు నిచ్చలున్. 78

క. కావున శంకరపదరా, జీవప్రార్థన మొనర్చి శివకారుణ్యా
ప్రావీణ్యుఁడనై గొల్చినఁ, బావనుఁ డగునొక్కకొడుకుఁ బడసెద నబలా. 79

సీ. అని గృహాంతరసీమ నబ్జాక్షి నునిచి యయ్యనఘుండు చేరి పుణ్యాశ్రమంబు
చందనమందారజంబీరమాకంద పనసనింబకదంబపారిజాత
నారికేళాశోకనారంగచంపక శాండిల్యవకుళరసాలముఖ్య
భూరుహచ్ఛాయలఁ బొలుపొంది శతపత్ర కైరవకహ్లారకలితసురభి

తే. రాజితం బగుపద్మాకరంబుచెంత, గాంత శశికాంతవేదికాభ్యంతరమున
సిద్ధపంకేరుహాసనాసీనుఁ డగుచు, శంకరాత్మకమంత్రరాజంబు నొడివి. 80

తే. విమలభస్మంబు సర్వాంగకముల నలఁది, భద్రరుద్రాక్షమాలికాభరణుఁ డగుచు
భావశుద్ధియు భూశుద్ధి భావపురుష, దహన మొనరించి యత్యంతధైర్యమహిమ. 81

క. గురుపదసరసీజాతము, లరుదారం గొలిచి యతఁడు ప్రాణాయామ
స్ఫురణం బొనర్చి చిన్మయ, పరమశివధ్యానమానపరవశుఁ డయ్యెన్. 82

సీ. పంచేంద్రియంబులఁ బటుబుద్ధి బంధించి దేహాభిమానసందేహ ముడిపి
శత్రుషట్కంబుల సాధించి తాపత్రయంబులఁ బరిమార్చి యష్టపాశ
ములఁ గోసి భ్రాంతి నిర్మూలంబు గావించి పంచకోశంబులఁ బాఱఁద్రోలి
చాంచల్యసక్తవ్యసనముల నిర్జించి కారణకార్యసంగతుల నాపి
తే. చిత్త మొండొకచోటికిఁ జేరనీక, దర్పకారాతిపాదపద్మములఁ జేర్చి
రమ్యభావంబుఁ దాల్చి వైరాగ్యగరిమ, రాజయోగంబుఁ జల్పి సర్వంబు మఱచి.

సీ. తలక్రిందు వై యున్నతమ్ముల నాఱెంటి నొగి నూర్ధ్వముఖములై యుండఁజేసి
కడఁగి మూలాధారకమలంబుచెంగట నిద్రించుపాఁపకన్నియను లేపి
షట్చక్రసితవస్తుసంపర్శనానందసరణిచే రోమహర్షణ మెసంగి
ప్రాణవాయువులను బంధించి చేతస్సమేతంబుగాఁ గ్రోలి మీఁద వెలుఁగు
తే. భద్రమైయుండు సాహస్రపంకజాత, మందుఁ బరమేశునిలిపి దేహంబు వ్రాంగి
మఱచి తృష్ణాక్షుధాబాధసరణి గలఁగ, కమ్మనీంద్రుండు సల్పె నత్యంతతపము. 84

శా. చండాశీవిషవృశ్చికాదులకుఁ గీశక్రోడభల్లాకవే
దండవ్యాఘ్రమృగేంద్రనామముల కత్యుష్ణతీవ్రాతపా
ఖండస్ఫూర్తికి మేఘఘోషణసమాక్రాంతాంబుధారాళి క
ద్దండోద్భూత హిమానిలంబులకు సంతాపింపఁ డెంతేనియున్. 85

ఉ. ఇంద్రుఁడు సేయువిఘ్నముల కెంతయుఁ గొంకక సాదనందుని
స్తంద్రకళావినోదములఁ దక్కక చొక్కక విరాళవైఖరిన్
సాంద్రతపఃప్రభావ మిటు సల్పుచు నుండఁగఁ గొన్నినాళ్లకా
చంద్రకళావతంసుఁడు ప్రసన్నతఁ జూపె దయార్ద్రచిత్తుఁడై. 86

సీ. నిర్మలస్ఫటికసన్నిభశరీరంబుతోఁ బల్లవారుణజటాభరముతోడ
ఫణిఫణామణిగతభవ్యవతంసంబుతోఁ దపనేందువహ్నినేత్రములతోడఁ
గటిభాగయుతగంధకరటిచర్మంబుతో డమరుత్రిశూలహస్తములతోడఁ
గాలకూటాంకితకంబుకంఠంబుతో భసితాంగరాగవిభ్రమముతోడ
తే. మంచుగుబ్బలిరాజుకుమారితోడ, వనజగర్భాదినిఖిలదేవతలతోడ
జలదబాంధవకోటితేజంబుతోడ, హరుఁడు వృషభేంద్రు నెక్కి ప్రత్యక్షమయ్యె.

వ. ఇట్లు సాక్షాత్కరించిన భవానీవల్లభునకు భద్రదంతీవల్లభుండు సర్వాంగాలింగిత
సర్వంసహాతలుండయి యనేక నమస్కారంబు లొనరించి తదీయ కారుణ్యకటాక్ష
వీక్షామృతధారాప్రవాహంబుల నోలలాడి దృక్కోణంబులం దొరఁగు సానంద
జలబిందువుల నొడలెల్లం దడిసి గడగడవడంకుచు మేనం బులకలుపొడమ నిటలతట
ఘటితకరకమలపుటుండై యిట్లని స్తుతియించె. 88

దండకము. శ్రీమన్మహాదేవ దివ్యస్వభావా జగన్మోహినీభావ రాజీవసారంగచర్మాంబ
రాడంబరా శంబరాంకస్ఫురచ్చారు కోటీరకోటీ గ్రహాధీశ తేజస్సమాజప్రకాశా
గిరీశా రమేశా మహేశాజముఖ్యామరాత్మీయకళ్యాణ చంచత్కిరీటస్ఫుటానేక
దేదీప్యమానాగ్రమాణిక్య నీరాజితాంఘ్రిద్వయాంబోరుహా మోహనాకార
నిర్మోహ నిస్సంగ నిర్దోషనిర్నిద్ర నిర్లేపనిర్ధూత పాపాజగద్దీప నిత్యానుకంప ప్రథా
నా ధనేశామసంచార దారిద్ర్యరోగాదిదుర్గాటవీ ఘోర లీలాకుఠారా వియద్వాహి
నీలోల కల్లోల జటాస్పదా భంగశృంగారసంగోత్తమాంగా మదేభాసురాధ్యక్ష
భంగా హిరణ్యాద్రిచాపా మృడానీప కందర్పగర్వాపహారా భుజంగేంద్రహారా
పయోరాశితూణీర నీవాదిదేవుండవై సర్వమిథ్యాప్రపంచంబుఁ గల్పింపఁ మన్నింప
మాయింపఁగాఁ గర్తవై భోక్తవై సచ్చిదానందకందంబవై బ్రహ్మవైకుంఠ భర్గాది
నామంబులం బ్రౌఢివర్తించుచున్ సత్యమై నిత్యమైయున్న నిన్నాత్మభావింపఁగా
లేక లోకంబు నిస్సారసంసారపాశంబులం జిక్కుచుం బంచభూతాత్మకంబైన
దేహంబుపై మోహవిభ్రాంతి రెట్టింపఁ బంచేంద్రియాసక్తులై మత్తులై శత్రు
వర్గంబు లొండొంటిబాధింపఁగా బాల్యకౌమారవార్ధక్యరూపంబులం బ్రాయ
మెల్లన్ వృథాప్రాయముంజేసి యాశానురక్తిన్ మహాఘోరకర్మంబు లిచ్ఛా
విహారంబులం జేయఁగా డాయుదుర్, రోయ కేప్రొద్దు భామాకుచాలింగనాలో
లురై కొంతకాలంబు సంసారతాపత్రయాభీలదావాగ్ని సంతప్తులై తృప్తులుం
గాక నానావిధోపాయకాపట్యసంయుక్తులై కోరికల్ మీఱఁగాఁ గోరుచుం
బుత్రపుత్రీకళత్రాదిసంఘంబులన్ సంపదల్ జూచి కాయంబు లుప్పొంగఁగాఁ
గొన్నిసంవత్సరంబుల్ జనంగా జరాభ్రాంతసంక్రాంతులై గంతులు న్మాని చింతించు
చున్ శ్లేష్మవాతాదిరోగంబు లొక్కుమ్మడిం దొమ్మిఁగా జుట్టుముట్టన్ భయాపన్ను
లై దగ్గుచున్ మ్రొగ్గుచున్ సిగ్గొకింతైననున్ లేక దుఃఖంబులంగుంది ప్రాణావ
సానంబునన్ దండిదూతల్ మహారోషజాజ్వల్యమానాత్ములం జూచి శిక్షిం
పఁగా రౌరవానేక దుష్కూపతాపంబులం బొందుచుం గుందుచుం గర్మశేషంబు
నన్ మర్త్యలోకంబునం బుట్టుచు గిట్టుచున్ సౌఖ్యలేశంబునుంగాక కిట్టున్న
నీమాయదాఁటన్ వశంబే భవత్పాద పంకేరుహధ్యానసంపత్తి సామాన్యమే భస్మ
రుద్రాక్షదామాది చిహ్నంబులన్ వేదవేదాంతమానోజ్జ్వలంబైన పంచాక్షరీ
మంత్రరాజంబునం బాపనిర్ముక్తులై ముక్తులైయున్న భక్తుల్ విరక్తుల్ భవన్నామ
సంకీర్తనాసక్తియుక్తుల్ గదా వారు నీమాఱుగారా వ్రతాసక్తి సద్ధర్మముల్
పుణ్యకర్మంబులున్ యజ్ఞముల్ యోగముల్ దానముల్ ధ్యానముల్ మౌనముల్
మంత్రముల్ యంత్రముల్ తంత్రముల్ పూజలు న్నియమముల్ సర్వముంగూడ

నీసేవకుల్ సాత్త్వికాదులుచు సర్వజ్ఞులై యెంచఁగ నాలించి వించుల్ సదాచంచలస్వాంతులై యన్యదైవంబులంగోరి ప్రార్థించినన్ భుక్తిముక్తుల్ ప్రసాదింపఁగా నేర్తురే నీవలెన్ లోకమెల్లన్ భవద్దివ్యతేజోమయంబంచు నూహింతు నెల్లప్పుడుం బూర్వపుణ్యప్రభావంబునం గన్నులారన్ మిముంజూడఁ గంటిం దగన్ మోక్షసామ్రాజ్య మేఁ గొల్ల నైకొంటి ధన్యుండనైతిం గృతార్థుండనైతిన్ మదీయంబులై యున్న నేరంబు లూహింపఁగా నేల నన్నుం గృపాదృష్టులంజూచి రక్షింపురక్షింపవే సర్వలోకప్రశస్తా మహాశూలహస్తా నిశానాథమస్తా నమస్తే నమస్తే నమః. 89

క. అని వినయసంభ్రమంబులు, పెనఁగొని వినుతించి పూర్ణచిత్తాఖ్యుఁడు చి
ద్ఘననిధిదివ్యాకారముఁ, గని మఱి యిట్లనియెఁ గౌతుకం బలరారన్. 90

వ. దేవా నీవు పరంజ్యోతిస్వరూపుండవు ప్రకృతి కవ్వల వెలింగెడి పురాణపురుషుండవు విశ్వమయుండవు విశ్వవ్యాపకుండవు విశ్వాకారుండవు విశ్వాధికుండవు మూలకారణుండవు సచ్చిదానందబ్రహ్మంబ విట్టినీవు జగన్నాథుండవైన మహాదేవుండవు భవదీయ మహామాయామోహితంబైన పంచభూతమయ ప్రపంచంబునం జరాచరాది సమస్తభూతంబులును బ్రజాపతులును రుద్రులును మహేంద్రాది దివిజులును భాస్కరప్రభృతి గ్రహంబులును గరుడగంధర్వసిద్ధ విద్యాధరాదిదివ్యయోనులును యక్షరాక్షసగణంబులును శేషవాసుకితక్షకాది మహానాగంబులును నైరావతసార్వభౌమాది దిఙ్మాతంగంబులు నుచ్చైశ్శ్రవోముఖ్యతురంగంబులును బారిజాతాది ధరణీరుహంబులును నారద వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులును రంభాది దివ్యసుందరులును బృథివ్యప్తేజోవాయురాకాశంబులు సమస్తకులపర్వతంబులు సప్తసముద్రంబులును సప్తద్వీపంబులును గంగాదిపుణ్యనదులును మహారణ్యంబులును జతుర్వేదంబులును వేదాంగంబులును బురాణంబులును సకలధర్మంబులును మాసాయనర్తు సంవత్సరంబులు నహోరాత్రంబులును మొదలుగాఁగల సర్వజగంబులంతయు "శివాత్పరతరం నాస్తి" యని తోఁచుచున్నయది యిట్టిబ్రహ్మాండకోట్లు నీయుదరంబునం గలవు విశ్వరక్షకుండవు చంద్రబింబం బొక్కటియు ననేకజలప్రపూర్ణఘటంబులం బ్రతిఫలించుచందంబున సర్వరూపంబులును నీవయై కాష్ఠగతాగ్నిప్రకారంబున నంతర్యామివై తెలియంబడకుండ మణిగ్రథిత సూత్రంబు కైవడి నీలో భువనంబులును భువనంబుల నీవు నొక్కరుండవై ప్రకాశింతు విట్టి నీమహిమ హరి బ్రహ్మాదులుం దెలియలేరు మిమ్ముఁ గొనియాడ నేనెంత వాఁడ గొంద అధ్యాత్మవేదులు పంచభూతాత్మకదేహంబుల మోహంబు దిగనాడి జ్ఞానేంద్రియపంచకంబును దద్విషయపంచకంబును గర్మేంద్రియపంచకంబును నంతఃకరణచతుష్టయంబు నవ్వలితత్త్వంబునుం దెలిసి సోహంభావకులై పిపీలికాదిబ్రహ్మ

పర్యంతంబుఁ బరబ్రహ్మరూపంబుగా భావింతురు కొందఱు సగుణస్వభావుం డని చంద్రకిరీటంబును డమరు త్రిశూల భుజంగ హార కేయూర ప్రముఖ చిహ్నంబుల నిర్మలస్ఫటికవర్ణంబుగల దేవుండవని నీయందు భక్తిభజనధ్యానంబులును గలిగి వర్తింతురు కొందఱు కనకమణికుండల గ్రైవేయకిరీట శంఖచక్ర కౌస్తుభాది లక్షణంబుల నీలమేఘాభిరాముండవని కొనియాడుదురు కొందఱు మంత్రరహస్యంబవని పంచాక్షరీమహామంత్రరాజంబున నిన్ను జపియింతురు కొందఱు హఠయోగ రాజయోగంబుల నాదబిందుకళాతీతుండవని యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధినిష్ఠాగరిష్ఠులై యోగం బభ్యసింపుదురు సర్వనదీ ప్రవాహంబు లెన్నివంకలం బోయినం దుది సముద్రంబునం జేరుచందంబున నెన్ని మార్గంబులం దవిలి వసియించినం దుది నందఱకుం బొందఁదగిన మహాపురుషుండవు నిర్వికారుండవు నిరంజనుండవు నిర్వికల్పుండ వనాథనాథుండ వకారణసుకృతి వార్తత్రాణుండ వనంతబ్రహ్మాండనాయకుండ వని యిట్లనేకభంగులం బ్రస్తుతింపం బ్రసాదభావంబున మందస్మిత సుందరవదనారవిందుండై యిందుశేఖరుం డిట్లనియె.

శా. ఓవిప్రోత్తమ నీతపంబునకుఁ బూర్ణోత్సాహినై నీస్తవ
ప్రావీణ్యంబున కిచ్చమెచ్చితిని శుంభత్ప్రౌఢిమం గోరుమా
నీవాంఛ ల్సమకూర్తు నేనన భవానీనాథ పుత్రార్థినై
భావస్ఫూర్తిఁ దపం బొనర్చితి దయాపాథోధిసర్వేశ్వరా. 92

మత్తకోకిల. ఓకృపాంబుధి విన్నవించెద నొక్కపుత్రుని సద్గుణా
నీకయుక్తుని నీదుభక్తుని నీచభోగవిరక్తుని
న్నాకు నిచ్చితివేని దాన మనఃపయోజము రంజిలున్
లోకనాయక భక్తసన్మునిలోకవార్ధిసుధాకరా. 93

సీ. అన విని శంకరుం డాపూర్ణచిత్తుని గని యానతిచ్చె సంకల్పసిద్ధిఁ
గా వరం బిచ్చెదఁ గల్యాణగాత్రుని సద్గుణస్తోముని శాంతనిధిని
బరహితకార్యబంధురనిశ్చలస్వాంతు నగణితశక్తి నేమైనఁగాని
తలఁచిన వచ్చి ముందఱనిల్చుమహిమంబుగలవాని గారుణ్యకలితమూర్తి
తే. మత్పదాంబుజభక్తి నెమ్మనములోన, మానకుండెడువాని నిర్మలచరిత్రుఁ
డైనసత్పుత్రు నిచ్చితి నరుగు మనుచు, బ్రమథనాథుఁడు వేంచేసె రజతగిరికి. 94

ఉ. అంతటఁ బూర్ణచిత్తుఁడు గృహాంతరసీమకు నేగుదెంచి యా
ద్యంతముఁ జెప్పె శంభుఁడు దయామతి నిచ్చినవాక్యపద్ధతుల్
కాంతకు నవ్వధూమణియుఁ గౌతుక మావహిలన్ వసింపఁగాఁ
గంతుమదాపహారి వరగౌరవలీలలఁ గొన్నినాళ్లకున్. 95

క. నెలమసలె భద్రదంతికి, వెలనెం జెట్టుములు మోము వెలవెలఁబాఱెన్
నలువెక్కెఁ జన్నుముక్కులు, నలసట బడలికలు దోఁచె నబ్జాననకున్. 96

తే. ఘసితకరాగాంక శుభ్రవిభ్రమముతోడ, మహితకంధరవిమతకాళిమంబుతోడఁ
సాటియనవచ్చు జెలిమోము చన్నుమొనలు, జఠరగతపుత్రుఁడీశ్వరసముఁడుగాఁడె.

సీ. సకలధర్మాధర్మసరణిసంయమిజనంబులఁ గూడి వినఁగోరుఁ బుష్పగంధి
శంకరుదివ్యపుష్పక మర్థి రప్పించి యేణాక్షి దానిపై నెక్కఁ దివురు
నరకవాసుల నెల్ల నాకలోకవాసులఁ జేయఁగాఁ దలఁచు రాజీవవదన
భూరితపశ్శక్తిఁ బుష్పబాణారిని జేరియుండంగ వాంఛించునబల
తే. కుక్షిలో నున్నపుత్రునిగుణములెల్లఁ దోఁచుచుండుఁ జనని కస్తోకలీల
నిటులు నిజగర్భ మానాఁట నిండుచుండఁ, జిరతరానంద మొందె నప్పరమసాధ్వి. 98

క. మునికన్నెలతోఁ గూడుక, వనజాక్షి వసించు నిజనివాసమునందున్
మనమునఁ గోరినకోరికె, లనుదిన మీడేర్చు నాథుఁ డతిమోదమునన్. 99

క. తొమ్మిదినెలలుం జెల్లిన, నమ్మగువకు బిడ్డపుట్టు లతిశయమయ్యెన్
దొమ్మిం గూడిరి మగువలు, నెమ్మనముల సంతసంబు నిండారంగన్. 100

సీ. శుభముహూర్తంబున సుస్థిరయోగాది భార్గవగీష్పతి పద్మబాంధ
వాదిగ్రహంబు లేకాదశస్థానకేంద్ర యుతసంయుక్తులై తనరుచుండ
సుతుఁ డుద్భవిల్లిన సూతికాగృహవాసులైనవామాక్షులు హర్షమంది
రవ్వార్త పూర్ణవిత్తాఖ్యుఁడు విని మహాసంతోషభరితుఁడై స్నానదాన
తే. విధులు గావించె నప్పు డవ్విప్రసూతి, బొడ్డు గోసిరి సంసారభూరిమోహ
పాశము హరించుగతిఁ బాపపంక మెడపు, రీతి బిడ్డని జలకమార్చిరి కడంగి. 101

ఉ. పెన్నిధిఁ గన్నదీనజనబృందముకైవడి నాత్మతత్త్వసం
పన్నుని గన్నసజ్జనునిభాతి విభాకరదర్శనంబునం
జెన్ను వహించుచక్రగతి జెల్వున శంకరతుల్యుఁడైనయా
చిన్నికుమారుఁ జూచి విలసిల్లె మహీసురకోటి యత్తఱిన్. 102

క. సురవరులు కుసుమవర్షము, గురిసిరి దివి మొరసెఁ బటహఘోషంబులు బం
ధురముగ మందసమీరో, త్కరములు వీచె న్మనోజ్ఞకరముగ దిశలన్. 103

వ. అయ్యవసరంబున. 104

ఉ. బాలుని బాన్పుపై నిడిన వాఁడునుఁ గన్నులు మూసియుండె న
వ్వేళ మహేశ్వరున్ హృదయవీథిఁ గనుంగొనునట్లు గొన్నినా
ళ్లీలసమానలోకమున నీశ్వరుఁ జూడఁ దలంచుమాడ్కి న
బ్బాలుఁడు నేత్రము ల్దెఱచుభావము రంజిలఁ జూచువారికిన్. 105

వ. తదనంతరంబున నాభూసురవరుండు పుణ్యాహవాచనజాతకర్మంబులు నిర్వర్తించి మంగళతూర్యరవంబులు సెలంగఁ గుమారశేఖరునకు సానందుం డను నామకరణంబు జేసె నమ్మహోత్సవంబున మహీసురులకుం గనకరత్నాంబరాభరణదానంబుల నిష్ట మృష్టాన్నంబులఁ దృప్తిం బొందించె నబ్బాలకుండు శుక్లపక్షసుధాకరుంబోలె దినదినప్రవర్ధమానుండై యుండె నంత. 106

క. లోక మనిత్యం బని యా, లోకన మొనరింపలేరు లోకులు నను న
ట్లాకొమరుఁడు తనలోఁ దా, నే కడువడి నవ్వఁదొణఁగె నింతులు చెలఁగన్. 107

ఆ. అతులమోహపాశవితతులు విదళించు, గతి యనంగ మెల్లఁ గాలు సేతు
లెత్తియెత్తియాడు నత్తలిదండ్రుల, భావపంకజములు పల్లవింప. 108

క. ప్రారబ్ధకలిత దుఃఖా, క్రూర పునర్భవపరాఙ్ముఖుం డైనగతిన్
సారెకు సత్త్వము గూడి కు, మారుఁడు పొరలాడఁ జొచ్చె మనసారంగన్. 109

తే. అమలకైవల్యరాజ్యసింహాసనంబు, నందుఁ గూర్చుండురీతి సానందుఁ డగుచు
డింభకుఁడు నేర్చెఁ గూర్చుండఁ గుంభినీసు, పర్వదంపతులకు నేత్రపర్వముగను. 110

క. ఘనచిద్విద్యారస మా, ఘనున కిడినరీతి నలరఁగా నన్నప్రా
శన మొనరించెం బొంగుచు, జనకుఁడు సానందునకుఁ షాణ్మాసమునన్. 111

క. మదనారితత్త్వ మనుమణి, వెదకినచందంబు దోఁప విపులస్థలిపైఁ
గొదుకుచుఁ దప్పడుగులు వెట్ట దొరకొనియె మహిఁ గడు దృఢస్థితు లెసఁగన్. 112

తే. జలకమార్చి ఫాలదేశంబునందు, ధవళభస్మంబు పెట్టి రుద్రాక్షదామ
మెఱుతఁ గీలించి కై సేసి యనుదినంబుఁ, బ్రేమమీఱంగ బాలుని బెంచుచుండె. 113

తరల. నడవనేర్చెను బరువులెత్తను నాఁడునాఁటికి నేర్చెఁ దా
నొడువనేర్చె మరందసారవినోదవైఖరి మీఱ ని
ల్కడ దలిర్పఁగ నవ్వనేర్చె విలాసలీలలఁ జూడఁగాఁ
దొడరనేర్చె మునీంద్రసూనులతోడఁ గూడుక వేడుకన్. 114

వ. ఇత్తెఱంగున వృద్ధినొందు సానందునిగుణంబు లిందుశేఖరభక్తిచిహ్నంబులై చెన్నొంద జనకుండు బాలునకుఁ బంచమాబ్దంబున నక్షరాభ్యాసచౌలోపనయనాది కృత్యంబు లొనరింప నతండు సర్వజ్ఞానుగ్రహసంభవుండు గావునఁ గుశాగ్రబుద్ధిమంతుండై విద్యాభ్యాసంబు సేయునవసరంబున. 115

సీ. గురుఁడు వేదముఁ జెప్ప దొరకొన నొకసారి విని కూడి పాఠంబు వేగఁ జెప్పు
షట్ఛాస్త్రములుఁ జెప్పసాగినఁ బూర్వోత్తరస్థితు లెఱిఁగి సారంబుఁ దెలుపు
గావ్యలక్షణము నొక్కటఁ జెప్పఁ జన దర్కసమితిచేఁ దా ప్రసంగంబుచేయు
బహుపురాణంబు లుపన్యాసగతిఁ జెప్ప నిఖిలార్థ మరసి వర్ణించుచుండు

తే. సకలవేదాంతవేత్త శాస్త్రంబులిట్టు, లభ్యసించి ప్రవీణుఁడై యందులోన
జిన్మయానందశివభక్తి సిద్ధ మగుచు, శంభుసేవాలసత్కాళారంభుఁ డయ్యె. 116

సీ. శివభక్తజనములఁ జేరి సంభాషించుఁ గాని యన్యులతోడఁ గలయఁబోఁడు
శివపురాణంబులు చెవియొగ్గి వినుఁగాని యన్యకథాలాప మాని వినఁడు
శివమంత్రరాజంబు శేముషి నిడుఁగాని యన్యమంత్రములపై నాసపడఁడు
శివపదాబ్జముల వీక్షింపఁ గోరునుగాని యన్యదర్శనముల కతఁడు చనఁడు
తే. అతనివైరాగ్య మతనికళ్యాణగుణము, లతనిశివభక్తిమాహాత్మ్య మతనితపము
నతనియోగము సరిపోల్ప నతఁడె కాని, యితరులన నెంతవారు మునీంద్రులార. 117

ఉ. కోరఁడు తుచ్ఛభోగములు క్రూరజనంబులచెంత కెన్నఁడుం
జేరఁడు తల్లిదండ్రులును జెప్పినకార్య * మొకింతయైనఁ దా
మీఱఁడు లేశమాత్రమును మిక్కిలి యక్కఱ గల్గియుండినం
జీరఁడు నమ్మహాత్ముని విశిష్టగుణంబు నుతింప శక్యమే. 118

మ. కఱకంఠాంకితగద్యపద్యములు వక్కాణించు నిత్యంబు శం
కరసంబంధకథానులాపముల నాకర్ణించుఁ దా రాజయో
గరమాలీలలమించుభక్తి మెఱయన్ గౌరీశు నర్చించుఁ ద
త్పరతత్త్వంబు గ్రహించు లోకము పరబ్రహ్మంబుగాఁ జూచుచున్. 119

వ. ఇవ్విధంబున సానందమౌనిబృందారకేంద్రుండు రెండవచంద్రశేఖరుండునుంబోలె
షోడశవర్షవయోవిలాసమానుండయి షోడశకళాపరిపూర్ణసుధాకరుచందంబున
దండకమండలు కాషాయశాటీపరిధానయుక్తుండై భర్గలాంఛనవిభూతిరుద్రాక్షమా
లికాలంకృత దివ్యసుందరవిగ్రహుండును నై సనాతనయోగీశ్వరు తెఱంగున విహ
రించుచుండు. 120

సీ. అంధకారస్ఫారదింధనచిటచిటధూమధామస్తోమభీమవలయ
మాజాహుతిజ్వలత్ప్రాజ్యహోమోద్ధూతకీలికీలాస్ఫులింగాలవాల
మాగమక్రమనినాదాభోగసత్తపస్స్వాధ్యాయకలకలాశ్చర్యకుంజ
మంచితాలంకారచంచదధ్వరధరాస్ఫారయూపస్తంభవారతీర
తే. మద్రికూటప్రవర్ధనీభద్రతీర, కుటజవటకుటపటలవిస్ఫుటపరిచ్ఛ
దప్రసూనమరందసాంద్రచరభృంగ, ఘనతరసుగీతకలిత మా వనమునందు. 121

క. పావనగతి సానందుఁడు, భావభవాహితపదాబ్జభక్తివిశేష
శ్రీ వెలయంగఁ దపోనిష్ఠావిశ్రుత దివ్యశీలసంపన్నుండై. 122

---

* మొకప్పుడైన.

మ. తపనాత్యుగ్రమయూఖదావదహనోద్దండస్ఫులింగచ్ఛటా
విపులస్ఫూర్తి మృగేంద్ర భల్లుకముఖావిఖ్యాతనాదార్భటీ
విపరీతోత్పతదండజస్ఫుటగరుద్విస్తారశబ్దంబులం
జపలత్వంబు వహింపఁ డీశ్వరపదాబ్జధ్యానసమ్మానియై. 123

క. తప మొనరించుచు విద్యా, నిపుణశ్రీఁ గాంచి హృదయనివసదుమాప
త్యపవారితసంశయుఁడై, యపరిమితానందుఁ డగుచు నలరుచునుండెన్. 124

సీ. జవహీనవృద్ధకేసరికి మత్తేభంబు తనకరం బిచ్చు కైదండగాఁగఁ
బాముపిల్లల కెండ పైసోఁక నియ్యక నెమిలి పింఛమ్మున నీడవట్టు
సమదోగ్రశార్దూలశాబకంబులఁ గూడి హరిణజాలము లాటలాడుచుండు
హద్దుగ వృకసమూహములు గొఱ్ఱెలఁ జేరి యలరు పచ్చిక మేఁపు లందియిచ్చు
తే. సతతసానందకృతతపస్సత్త్వగరిమ, జాతవైరములే కెల్లజంతుకోటి
కవిసి విహరింప నభిరామగతిఁ జెలంగు, చుండునయ్యాశ్రమంబున నొక్కనాఁడు.

ఉ. సన్మునిచంద్రు లొక్కెడఁ బ్రసంగవశంబున దివ్యబోధసం
పన్మహనీయగాథలు శుభస్థితలీలల నాలకించుచుం
దన్మయకేళి నున్నఁ బ్రమదంబున నచ్చటి కేగుదెంచెఁ జం
చన్మహిమాన్వితుం డభవసన్నిభుఁ డామునిచంద్రుఁ డయ్యెడన్. 126

సీ. భసితత్రిపుండ్రాంకఫాలభాగమువాని మహితరుద్రాక్షదామములవాని
సలలితబద్ధకాషాయచేలమువానిఁ గరతలస్ఫటికాక్షసరమువాని
సరిదండకుండికాంచితచిహ్నములవానిఁ బటుజటాపటలవిభ్రమమువానిఁ
బంచాక్షరీధ్యానపరవశత్వమువానిఁ గమనీయమధురవాక్యములవాని
తే. మునిచంద్రులు సానందమునిఁ గాంచి, యమ్మహాత్ముఁడు సాక్షాన్మహేశుఁ డనుచు
మమత నెదురేగి యభివందనములుచేసి, యర్ఘ్యపాద్యాదివిధులెల్ల నాచరించి. 127

క. సానందమునిభద్రా, సీనుం గావింప నతఁడు శివయోగుల స
న్మానించి పలికె నిట్లని, మానస మానందభాసమానముగాఁగన్. 128

క. మునిచంద్రులార యేకథ, వినియెదరో మోద మెసఁగ వివరింతుఁ డు మా
కనవుడు వారలలోపల, ననఘుఁడు ధర్మప్రసంగుఁ డనుముని పల్కెన్. 129

తే. పుణ్య మొనరించువారలు వొందుగతులుఁ, బాప మొనరించువారలు పడెడు వెతలుఁ
దెలియఁజెప్పెద వీరికిఁ దేటపడఁగఁ, వేడుకగు నేని నీవును వినఁగదయ్య. 130

క. అనఘుఁడు సానందుం డ, య్యనఘాత్ముని దిక్కుఁజూచి హర్షోజ్జ్వలుఁడై
వినవలతుఁ జెప్పవే యన, మునిచంద్రుఁడు తెల్పఁదొడగె మోదం బెసఁగన్. 131

వ. విను మర్త్యలోకంబునఁ బుణ్యపురుషులు దానధర్మపరోపకారాదిసుకృతంబులనేకంబులు సేసి చిరాయుష్మంతులయి సకలభోగంబులం బరితృప్తిం బొంది ప్రాణావసానకాలంబునఁ బుత్రమిత్రభ్రాతృబంధువర్గంబులు పరివేష్టించియుండ నందఱతోడం బ్రతిభాషించుచు నాయాసంబునఁ గర్మశరీరంబులు విడిచి సుకుమారదివ్యశరీరంబులు దాల్చి శమనకింకరులు శాంతమూర్తులయి తోడ్కొనిపోవ రాజీవహితతనూజపురభేదనంబున కరుగుదు రమ్మహనీయమార్గంబున. 132

సీ. మహనీయతపనీయమయమందిరంబులు భాసురస్ఫటికసోపానతతులు
దీపితచంద్రకాంతోపలవేదులు మంజులస్ఫుటహేమమండపములు
గురుతరవైదూర్యకుట్టిమస్థలములుఁ దులలేనిముత్యాలతోరణములు
పథికహార్దోజ్జ్వలపానీయశాలలు తతచిత్రవస్త్రవితానములును
తే. శాతకుంభస్ఫురత్కుంభసంభ్రమముల, మహితసౌధాంతరంబులమహిమ చెలఁగి
సకలశృంగారకలితప్రశస్త మగుచు, సరసమైయొప్పుఁ బుణ్యాత్ము లరుగుతెరువు. 133

మ. జవనాశ్వంబులు భద్రనాగములు భాస్వత్స్యందనవ్రాతముల్
నవలావణ్యవిలాసకామినులు నానానూనగంధాన్వితో
త్సవమందానిలముల్ప్రఫుల్లకుముదాంభస్సారకాసారముల్
సవిశేషాంచితనిర్మలోదకములున్ సంపూర్ణమై చెల్వగున్. 134

వ. మఱియుఁ జందనమందార మాకందపనస వకుళరసాలసాలనారికేళఖర్జూరజంబీరప్రముఖమహీరుహచ్ఛాయావితానశీతలభూరుహంబులును కుంద కురంటక కరవీర పారిజాతకాంచనసుగంధబంధురపుష్పారామప్రదేశంబులును గాంచనకమల కహ్లార కుముద పరిమళమిళితకమలాకరంబులును గలహంస మయూరశుక పికశారికాచంచరీకమనోహరనినద కోలాహలంబులును సద్యోఘృతదధిక్షీరమకరందఫలరసనదీప్రవాహంబులును సంకుమదకుంకుమకర్పూరపాటీరకస్తూరికాదిసుగంధద్రవ్యంబులు పంకంబులు సేసి పన్నీటం బొంకించిన కనకరజతపాత్రంబులును గంధర్వమానినీజనతానమానంబులును బారిజాతప్రసూనవర్షంబులును ధవళచ్ఛత్ర చామర కేతన శిబికాసమూహంబులును గుసుమకిసలయలలిత భవనంబులును జిగురాకుపాన్పులును సిద్ధరసదీర్ఘికలు న్నెడనెడఁ జెంగల్వదోనలును గలిగి శోభిల్లు నమ్మార్గంబున నప్పరమపుణ్యులఁ గరుణాకలితహృదయులై శమనకింకరులు మణిగణస్థగిత కాంచనసమంచిత కోటిసూర్యప్రకాశ దేదీప్యమాన దివ్యవిమానంబులపై నెక్కించి వేణువీణాస్వనంబులును మంగళతూర్యఘోషంబులునుం జెలంగ దండధరురాజధానికిం గొనిపోవునవసరంబున. 135

క. కొందఱు గంధర్వంబులఁ, గొందఱు భద్రేభతతులఁ గొందఱు శిబికా
బృందంబుల రథములపైఁ, గొందఱు నిడి వైభవములఁ గొనిపోవంగన్. 136

సీ. అమరకాంతలచేతి కాలవట్టము లిచ్చి చనువుమీఱఁగఁ బట్టు మనెడివారు
గిన్నరాంగనల కెంగేల వింజామర లప్పుడప్పుడు వీవు మనెడివారు
గంధర్వసుదతుల గానవిద్యాప్రౌఢి నలరుపాటలఁ బాడు మనెడివారు
రంభాదిసతుల సంరంభజృంభణగతు లెనయ నాట్యముసల్పు మనెడివారు
తే. ధర్మరాజుభటులు దలఁగక నీరీతిఁ, బనులుసేయఁ దాముఁ బెనఁగొనంగఁ
బరమపుణ్యు లేగుపథమున విలసిల్లి, విశ్రమించి యరుగువేళలందు. 137

ఉ. గందముఁ బూయుఁ డంగముల గప్రపునామము దిద్దుకొండు కో
రందగు పూలదండలు శిరంబునఁ దాల్పుఁడు రత్నదర్పణం
బిందునిజాస్యలక్షణము లేర్పడఁ జూడుఁడు దివ్యవస్త్రముల్
పొందుగఁ గట్టుకొం డనుచుఁ బుణ్యుల కిత్తు రనేకవస్తువుల్. 138

సీ. రత్నకంబళ్లమారత్తుకుత్తినిపట్టుదిండ్లు సేమంతిపూఁజెండ్లు గంధ
వడులు దూపములు పుష్పాదులు తళ్కులు గుల్కు నిలువుటద్దములును నెమలిపించి
సురటీలు కర్పూరచూర్ణతాంబూలంబు లగరుగందము తావిబుగులు జాజి
పన్నీరుచెంబులు పట్టెమంచంబులు పఱుపులు దంతపుఁబావుకోళ్లు
తే. తమ్మపడిగలు తాళవృంతమ్ము లొసఁగి, చారుతరమైనభోగముల్ సారెసారె
కింపుదళుకొత్త మీరు భోగింపుఁ డనుచుఁ,బుణ్యపురుషుల నెచ్చరింపుదురు భటులు.

మ. అకలంకస్ఫుటహాటకాంగదము లుద్యత్పూర్ణరత్నాంగుళీ
యకము ల్వజ్రకిరీటము ల్పతకము ల్హారావళు ల్మేఖలా
నికరంబు ల్మణికంకణవ్రజము మాణిక్యస్ఫురత్కుండల
ప్రకరంబు ల్తపనీయభూషణతతు ల్పల్మాఱు నందిచ్చుచున్. 140

మ. ఇవె వస్త్రంబులు భూషణంబు లివి మీ కింపైన కస్తూరికా
ద్రవకర్పూరసమేతగంధ మిదె నెత్తావు ల్గుబాళించు సూ
నవితానం బిదె మెచ్చుపాన్పు లివె నానాభక్ష్యపానీయభో
జ్యవిశేషంబు లివే ఫలంబు లివె యం చందంద నందియ్యఁగన్. 141

ఉ. గారెలు బూరె లిడ్డెనలు గమ్మనిదోసెలు జక్కిలంబులుం
జారులు గూరలు న్ఫలరసంబులు దేనెలుఁ బానకంబులున్
సారెలుఁ బాయసాన్నములుఁ జక్కెర లుక్కెఱ లప్పడంబులున్
వెరుల సారముల్ చెఱకుబిళ్ళలుఁ జల్లనినీరుమజ్జిగల్. 142

సీ. కలవంటకంబులుఁ గజ్జాయములు మనోహరములుఁ దియ్యనియానవాలు
మీఁగడ పెరుఁగు మామిడిపం డ్లరఁటిపండ్లు కండచక్కెరలుఁ డేంకాయపాలు
పనసపండ్లును ద్రాక్షపండులు ఖర్జూరఫలములు గజనిమ్మపండ్లు దోస
పండ్లు గమ్మనిచాఱపప్పులు గసగసా ల్జీడిపప్పును దియ్యచెఱకురసము
తే. భక్ష్యభోజ్యలేహ్యపానీయముల నిట్లు, దృప్తిఁ బొందఁజేసి దివ్యవిభవ
మలరఁ గొంచుఁబోయి యక్కజపురి బహి, ర్ద్వారదేశమందు వారి డించి. 143

ఉ. అంతకు దూత లేగి కొలువై కలసిల్లెడు ధర్మరాజు న
ల్లంతటఁ గాంచి మ్రొక్కి భయమందుచుఁ జేతులు మోడ్చి దేవ మీ
రెంతయు మమ్ముఁ బంచిన మహీస్థలి కే మరుదెంచి పుణ్యధీ
మంతులఁ దోడితెచ్చితిమి మానితసంపద లుల్లసిల్లఁగన్. 144

తే. వారలందఱు మనపురద్వారసీమ, నున్నవారని తెల్పఁ బ్రసన్నుఁ డగుచు
గరుడగంధర్వకిన్నరగణము గొల్వ, వారి కెదురేగి కాంచి వైవస్వతుండు. 145

క. వినయమున నిటులు ధర్ముఁడు, గని కుతుకస్వాంతుఁ డగుచుఁ గ్రన్నన తనదా
పునఁ గొల్చు చిత్రగుప్తుం, డనుకరణము దిక్కుఁజూచి యంతకుఁ డనియెన్. 146

మ. కరుణాదృష్టిని వీరిధర్మములు వక్కాణించు వాక్సౌధురీ
స్ఫురచిత్తంబున మేదినీతలముపై శోభిల్ల నేమేమి చే
సిరి మాకున్ వివరింపు మన్న జముతోఁ జెప్పం దొడంగెన్ మహా
గిరిరాడ్జూటధునీతరంగములమాడ్కిం జిత్రగుప్తుం డొగిన్. 147

శా. ప్రాతస్స్నానము సేయువారుఁ గవులన్ భావించువా రగ్రసం
జాతవ్రాతవిధేయు లన్యరమణీసంఘంబు తోఁబుట్టుగాఁ
బ్రీతిం గన్గొనువారు దీనజనతాపీడాపహారు ల్కృపా
స్ఫీతస్వాంతులు సత్యసంధులు సదాశీలవ్రతాపేక్షకుల్. 148

శా. కన్యాదానము సేయువారు హితసంకల్పంబు లీడేర్చువా
రన్యాయంబులు లేనివారు గురుపూజారంభకుల్ దేవతా
మాన్యుల్ దుర్జనసంగవర్జితులు కామక్రోధదూరుల్ మహా
ధన్యాత్ముల్ సవిశేషవర్తనులు తీర్థక్షేత్ర సేవాపరుల్. 149

చ. క్రతువులు సేసె నీఘనుఁ డఖండమతిన్ శివతీర్థయాత్రస
ద్వ్రతము లొనర్చె నాతఁడు వివాహపరంపరకార్యభారసం
గతుఁ డితఁ డిష్టమిత్రులకుఁ గల్గిన సొమ్ములు పంచి యిచ్చినాఁ
డితఁడు మహీసురవర్యుల కహీనపదార్థము లిచ్చె నాతఁడున్. 150

చ. శివునకుఁ బూలతోఁటఁ గడుఁ జిత్రముగా నొనరించు నీఘనుం
డవసరమైన సజ్జనుల కప్పు లొసంగె నితండు శైవపుం
గవులకు ముఖ్యసద్మములు గట్టి సమర్పణసేసె నీతఁడుః
గవిజనసార్వభౌములకుఁ గానుక లిచ్చె నతండు వేడుకన్. 151

సీ. అపకార మొనరింప కథమాధమునకైన నుపకృతిఁ జేయు నీయుత్తముండు
గ్రీష్మకాలంబుల గిరిజేశునకు వసుధారఁ గల్పించె నీధన్యమూర్తి
వైశాఖవేళను వసుధామరుల కిచ్చెఁ దాళవృంతంబు లీధర్మశాలి
కఱవుకాలంబుల మఱువుసొచ్చినవారి కూడుఁ గోక లొసంగినాఁ డితండు

తే. చెడిన బాంధవజనుల రక్షించె నతఁడు, దీనమానవు లాపద దీర్చె నితఁడు
తారతమ్యంబు లెఱిఁగినదాత యితఁడు, శూరుఁ డాతఁడు సంగరక్షోణియందు. 152

క. గోదాన మిచ్చె నాతఁడు, భూదాన మొనర్చె నతఁడు బుధకోటికి శా
టీదాన మొసఁగె నాతఁడు, వేదం బీబుధుఁడు శిష్యవితతికిఁ జెప్పెన్. 153

క. గౌరీశునిలయమున దీ, పారాధన నేసె నతఁడు భవునకు సత్పా
కార మితఁడు నిర్మించెను, దారుం డనిపించికొనియె ధరలో నితఁడున్. 154

ఉ. శ్రీగిరి కేగువారికి విశిష్టధనంబు లొసంగె నీతఁ డ
భ్యాగతపూజసేసినమహాత్ముఁ డితండు పరోపకారియై
రోగుల కౌషధంబు లిడి రొక్కము ముట్టక మాన్పె నీతఁడుం
జాగిలి మ్రొక్కి సంతతము శైవులఁ గన్గొనె నప్పు డాతఁడున్. 155

క. కలలో నైనను బొంకని, కులపావనుఁ డితఁడు శివునికో వెలయం దా
టలవారిఁ బాటవారి, న్నిలిపి మహోత్సవము నడుప నేర్చె నితండున్. 156

తే. మండపముగట్టె నాతఁ డుమాపతికిని
రథము నిర్మించె నితఁ డీశ్వరార్థముగను
హారుల నతఁ డిచ్చె శంభునికొఱ కితండు
గజము లొసఁగెను హరుని కైంకర్యమునకు. 157

క. ముక్కంటిమజ్జనంబున, కొక్కతటాకంబు నీతఁ డొనరించెను సొం
పెక్కిన గోపురదీపం, బక్కజముగ నెత్తె నీతఁ డమవసలందున్. 158

క. భూతేశప్రీతిగ నాఁ, బోతు నొంటివిడిచె నితఁడు పుణ్యనదీసం
ఘాతములఁ గ్రుంకె నాతఁడు, నీతం డుపవాసవిధులు నిచ్చ నొనర్చెన్. 159

క. జననీజనకులు వృద్ధులుఁ, దనయులు బాంధవులు హితులుఁ దనియక మును పా
ఘనుఁడు భుజింపఁగ నొల్లం, డినవందన బత్తిభేద మెన్నఁ డితండున్. 160

క. ఛిద్రములై పడిపోయిన, రుద్రస్థానంబు లతఁడు రూపించి మహా

భద్రంబుగఁ గట్టించెను, క్షుద్రాత్ములఁ గూడఁ డితఁడు సూర్యతనూజా. 161

క. వృద్ధులగు తల్లిదండ్రుల, బుద్ధులు విని యుక్సహించి పుంసకళాసం
సిద్ధాత్ముండై వర్ధిలు, నిద్ధరణీవలయమున జితేంద్రియుఁ డితఁడే. 162

క. లోకాపవాదమున కతఁ, డాకంపముఁ బొందఁ బరులయందు గుణమ్ముల్
చేకొని సంతోషించును, బ్రాకట గురుభక్తి గలుగుభవ్యుం డితఁడే. 163

తే. పితృపితామహకర్మంబు లతులితముగ, నడిపె నీధర్మశాలి యనాథులకును
ప్రేతసంస్కారములు సేసెఁ బెక్కు లతఁడు, పరధనంబుల కాసక్తి పడఁ డితండు. 164

క. పరులేమనిన సహించును, బరులయధర్మంబు లెత్తి పలుకఁ డితండుం
బరదూషణ విన నొల్లఁడు, పరనిందలు సేయనట్టిపావనుఁ డితఁడే. 165

క. విద్యావ్యసనుం డితఁడు, సద్యఃఫలదాత యితఁడు జగతీస్థలిపై
ఖద్యోతప్రియుఁ డితఁడు, పద్యంబులు చదువు శంభుపై నితఁ డనఘా. 166

తే. పాత్రదానంబు చేసినభవ్యుఁ డితఁడు, నేకపత్నీవ్రతుండు సుశ్లోకుఁ డితఁడు
వీను లలరంగ శివకథ వినె నతండు, నీశపూజకుఁ బువ్వు లందిచ్చె నతఁడు. 167

సీ. నవరసాలంకార నానాప్రబంధముల్ శివుని కర్పితముగాఁ జెప్పె నతఁడు
తోఁపులఁ బువ్వులతోఁటలు భువివృద్ధిఁ బొందించునట్టిసత్పుణ్యుఁ డితఁడు
నడవడి గలవేళ వసుగులఁ బెండ్లిండ్లు మించినవేడ్కఁ జేయించె నితఁడు
చీమలు పేల్నల్లి దోమలు మొదలైనజీవమునను హింససేయఁ డితఁడు
ఆ. కలుషమన్న నితఁడు కలలోనఁ దలఁపఁడు
పరుల దూషణమునఁ బలుకఁ డితఁడు
పరులసంపదలకుఁ బరమాద్భుతానంద
కలితబుద్ధి నున్నఘనుఁ డితండు. 168

క. తల్లియెడఁ దండ్రియెడ గురు, వల్లభునెడఁ దప్పుగలుగ వారల నెన్నం
డుల్లమున నొవ్వఁబలుకని, బల్లిదుఁ డీఘనుఁడు పద్మబాంధవపుత్రా. 169

తే. కాశికాక్షేత్రమున కేగు ఘనుల కితఁడు, సంబళంబులఁ బాదరక్షలు నొసంగు
ధర్మబుద్ధిని భద్రరుద్రాక్షమణులు, దాన మిచ్చిన దీనమందారుఁ డతఁడు. 170

వ. వెండియుఁ బ్రచండకరతీవ్రాతపకాలంబులఁ సర్వంసహాసుపర్వులకు శైత్యోపచారంబుగా దధ్యోదనగుడజలసుగంధగంధపుష్పతాంబూలచ్ఛత్రచామర పాదరక్షాప్రధానదానంబు లొసంగిన సుజ్ఞాననిరతులును నిరతాన్నదానకనకరత్నాంబరాభరణసాలగ్రామశివలింగదాననిధానవరులును పరోపకారాది సుకృతపరాయణులును సంక్రమణగ్రహణకాలప్రదత్తసవత్సధేనుగణదక్షిణాతాంబూలప్రముఖదాన వినోదులును సర్వకాలంబుల మార్గంబులఁ బ్రసాదంబులు నడిపించిన చంచన్మతిమం

తులును నగ్నిష్టోమాతిరాత్రవాజపేయపౌండరీకప్రభృతియజ్ఞంబులు గావించిన ప్రజ్ఞావంతులును సంగరాభిముఖులును బరనారీపరాఙ్ముఖులును మహీసురుల కగ్రహారక్షేత్రంబులు శివస్థానంబులుఁ గల్పించిన సచ్చరిత్రులు నని యిట్లనేకభంగుల సకలధర్మంబు లొనరించిన పుణ్యపురుషులఁ జిత్రగుప్తుండు వేర్వేఱం జూపినం జూప్రలం గారుణ్యాధార లోలుకం బ్రసాదభావంబున శ్రాద్ధదేవుం డప్పరమపావనులం గనుంగొని బహువారంబులు కైవారంబులు సేసి ముకుళితకరకమలుం డై యిట్లనియె. 171

సీ. ఓపుణ్యజనులార యోమహాత్మకులార చెలఁగి మీరిందు వేం చేసినపుడు
పాత్రుఁడనైతి మాభటులు మిమ్మెక్కంత నొవ్వఁబల్కిరు గదా నోరు పదరి
బహుదూరపథముల బడలితి రిట వచ్చి పెద్దప్రొద్దాయెఁ గోపింపవలదు
మానేరములు మాన్పి మన్నింపఁగదయ్య పరమకారుణ్యసంపద వహింపు:

ఆ. డనుచు ధర్మరాజు వినయోక్తు లలరంగఁ
గనకరత్నపుష్పకములమీఁద
భూరివైభవములఁ బుణ్యుల నెక్కించి
విబుధరాజముఖుల వెంటఁగూర్చి. 172

క. చనుఁ డని నియమించిన న, య్యనఘాత్మకు లరిగి రప్పు డమరావతికిన్
ఘనభేరీభాంకార, ధ్వను లొక్కట మొరయఁ బుష్పవర్షము గురిసెన్. 173

శా. ఈమాడ్కిం ద్రిదశాలయంబునకు వా రేతెంచి యాదేవతా
స్వామిం గన్గొని తత్కటాక్షవిభవాసన్నప్రభావంబునన్
శ్రీమత్కాంచనసౌధవీథుల సతుల్ సేవల్ ఘటింపంగ నా
సోమాదిత్యముగాఁగ నుండి రచటన్ శుద్ధాంతరంగంబులన్. 174

క. అని పుణ్యులు పొందెడి గతు, లనుపమముగఁ జెప్ప మునులు సానందుండున్
విని హృదయము రంజిల్లఁగ, ఘనమతి సానందుఁ డనియె కథకునితోడన్. 175

క. ధర్మాత్ములచరితము విని, నిర్మలసంతోష మెసఁగె నీకే చెల్లున్
ధర్మప్రసంగనామము, కర్ముల కథ యింకఁ దెల్పు కరుణావార్ధీ. 176

వ. అని యడిగె నని చెప్పిన విని శౌనకాదు లటమీఁదివృత్తాంతంబుఁ దెల్పు మనుటయు. 177

శా. తుంగస్వచ్ఛతరంగగాంగవనధీపోద్ధూయమానక్రియా
భంగప్రాప్తి ఘుమంఘుమాయితజటాభాస్వన్మహాజూటికా
సంగధ్యానపదాబ్జహంసకఝణంఝణారవానంతరా
పాంగీభూతసముద్రవాక్కలితషట్కాఘౌకగాథార్భటీ. 178

క. పంచాక్షరీవిభాకర, పంచేంద్రియవిషయ నాగపంచాననయో
పంచాననదుఃఖహరణ, పంచాశుగగర్వహరణ ఫణ్యాభరణా. 179

పంచచామరము. తరక్షుచైత్యభంగదక్షదక్షజామనోహరా
హరాసమస్తభూతహృద్విహారనీలకంధరా
ధరాధరేంద్రచాపధుర్యతారభూతిసుందరా
దరాశతారకాశతారతారకీర్తిబంధురా. 180

గద్య. ఇది శ్రీకాళికాంబావరప్రసాదలబ్ధసాహిత్యవైభవ సదాశివస్వరూపసద్గురుచరణారుణ రాజీవసేవాసమాసాది తాద్వైతానుభవ కౌశికగోత్ర సుధార్ణవ పరిపూర్ణకైరవబాంధవ కోట బాలయ్యతనూభవ సవినయగుణవిధేయ శివరామనామధేయప్రణీతం బయిన సానందోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము



కరుణారత్నాకర
కాకోదర పూరితాంగ కమనీయసుధా
నీకోత్పలరాకాబ్జము
ఖా కైవల్యేశ కాళహస్తిపురీశా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలమునుల, కిట్టులని చెప్పె సూతమానీంద్రచంద్రుఁ
డవ్విధంబున సానందుఁ డడుగుటయును, సంగతోక్తుల ధర్మప్రసంగుఁ డనియె. 2

సీ. వినవయ్య సానంద విశ్వంభరామరజనులు పాపంబులు చాలఁ జేసి
కడపటఁ బ్రాణాంతకాలంబు డాపైన శ్లేష్మరోగంబుల జీర్ణులగుచు
దేహంబు తెలియగక దీనభావంబులఁ గడు దద్దతిల్లంగఁ గాలభటులు
కాలనీరదభయంకరవిగ్రహోదగ్రనిగ్రహాబలబలోన్నిద్రు లగుచు
ఆ. వ్రోల నిల్చి ప్రాణములు పాశములఁ దీసి, యాతనాశరీరమందుఁ జేర్చి
గొలుసు లఱతఁ బెట్టి కుక్కలఁ గొనిపోవు, పోల్కి ఖలులఁ గొంచుఁ బోవునపుడు.

చ. యమపురి కేగుమార్గము భయంకరమై కనుపట్టు దుష్టసం
ఘములకు దుష్కరాటవులుఁ గంటకభూములుఁ గత్తిరాళ్లు వే
డిమియుఁగఁ గాయు నెండలుఁ గడిందిమెకంబులు ఢాకినీపిశా
చములు శిలోగ్రవర్షము లసహ్యములైన కఠోరవాయువుల్. 4

చ. గొటగొటఁ రొప్పు బెబ్బులులఘోషము భీకరసూకరార్భటుల్
పెటపెటఁ బండ్లు దీటుకొను భీమనిశాటపిశాచనాదముల్
దొటదొటరాలు మిన్నువిసి తోరపు నిప్పులవాన లొక్కటం
జిటజిట గుండుమంటలుగ సిక్కిన నాటెడి ముండ్లత్రోవలన్. 5

చ. కనములు గుట్టలుక్కినుసలఁ గందిన సైకత ముక్కుగుజ్జముల్
గనగనలాడు గుంపటులు గంపలు దుంపలు గక్కురాళ్లు భీ

స్సుదు వసనాభి గాలి పొరలాడెడిపాములు తేళ్లపుట్టలున్
ముసుకొని బారుకీ రిసుపముక్కులకాకులుఁ గుక్కడొక్కలున్. 6

క. గచ్చపొద లుచ్చకాలువ, లచ్చేరువ ఘనకమలము హయమూత్రముఁగన్
వెచ్చని గాడిపెలస్త్రైలు, చచ్చి ముఱిగి పిఱియు జంతుసంతానంబుల్. 7

మత్తకోకిల. పాడుబావులు చుప్పకాల్వలు బండతావ్రలు బండరా
ళ్లాడి దయ్యములాడ నెత్తురులాడ వృశ్చికబేఱులున్
జేఁదగుంటలు బొంటుదిబ్బలు బెద్దగద్దలుఁ గంకముల్
గాడిదల్ సెడఁదన్ను కంకరగాడిదల్ గలత్రోవలున్. 8

క. పల్లేరుముండ్లు గుల్లలుఁ, జెల్లాచెదరైన కొండచీమలపారుల్
గొల్లునఁ గూసెడి నక్కలుఁ, ఛెళ్లార్చి యదల్చు భూతబేతాళంబుల్. 9

క. పిడుగులు నలుగడఁ జెళపెళఁ, బెడిదముగా నిగిడి పెటిలు మనంగాఁ
గడువడిఁ బడ నొడ లుడికెడి, పుడములుఁ జెడువక్రగతుల పురువుల తెరువుల్. 10

తే. రొంపిగలిగిన క్రొత్తసున్నంపుటేర్లుఁ, జెద్దచీఁకట్లు గ్రమ్మెడి పెద్దపొదలు
గండుఁదుమ్మెదపిండులు కణఁదురీఁగె, జెట్టె లీఁగలగుంపు లాతెరువులోన. 11

తే. కన్నుఁ దెఱవంగనీయనిగాలిదుమ్ము, లుప్పరంబంది కనుపట్టు నుప్పరాసు
లుడుకులెత్తెడి యడుసులఁ గడునసహ్య, మైనజలధారిమడుఁగు లందందుఁ గలవు 12

శా. ఆదుర్గంధము లాదవాగ్నిశిఖ లాయాశల్య మావేద మా
ఖేదం బాసుడిగాడ్పు లావిపినసంకీర్ణోగ్రమార్గంబు లా
మేదఃపంకము రక్తకూపము దగన్ సొంపొడ్డు భూతాలగుం
పాదుష్కంటకభూము లాకటిన మాహా చాలదే పుట్టువుల్. 13

వ. అట్టిదుష్టమార్గంబున యమభటవర్గంబు పట్టుకొని పోవుసమయంబున. 14

సీ. తలకొని రక్తంబుఁ ద్రావెడితోఁడేళ్ళ పులులసందడిఁ బడి పొరలువారుఁ
గన్నులు పొడిచెడికాకుల దండుతుమ్మెదలకు లోఁబడి యొదుఁగువారుఁ
గాయంబు లుడుకెత్తఁ గాయు నెండకు వహ్ని కీలావళిని గుప్పగూలువారు
గుదికాళ్ళ పైకొన్న క్రూరాహులకు లోఁగి తెర్లుప్రాత్రల్లలోఁ ద్రెళ్లువారు
ఆ. నడుగు లడుసులంటఁ దడఁబడి నున్నంపు, టేఱులందు మ్రొగ్గి తాఱువారుఁ
గాళ్లు వగిలి కత్తిరాళ్లు పల్లేరుముం, డ్లీఁతముండ్లు దాఁకి యేడ్చువారు. 15

సీ. కడువేగమునఁ గొట్టు గాలిపెంబడి, బడి బలు గచ్చపొదలలోఁ బడెడివారు
పిడుగుల మ్రోఁతకు భీతిలి పరువెత్తి యుచ్చకాలువలలోఁ జొచ్చువారు
నిప్పులవానకు నిలువశక్యముగాక తుమ్మకంపల క్రిందఁ దూఱువారు
నలువంక తాళ్లవానకు నిల్వఁగా లేక భూతాలమరువుకు బోవువారు

తే. నైరి పాపకర్ము లాదుష్టమార్గంబు, బోవ నిర్విఘమున దీను లగుచుఁ
గూడిరావి కవులఁ గోపించు దండికిఁ, గరసమాజ మాత్మఁ గరుణలేక. 16

ఉ. కొట్టుచుఁ దిట్టుచు న్నలియఁగొట్టుచు మేదల గర్మ మెల్లఁ బోఁ
దట్టుచు ముట్టుచుం గినిసి తన్నుచు నెన్న చళాలు మంచు గీ
పెట్టఁగవచ్చుచుక్ మడియఁ బెట్టుచు నెట్టుచు మూటకట్లుగాఁ
గట్టుచుఁ జేము లెత్తుకొని గట్టిగ మోఁదుదు రొక్కొకట్టుచన్. 17

ఉ. గుంపులుగూడుకొన్న ఖలకోటులఁ గన్గొని భూతపంక్తి కో
పింపుచుఁ గంఠనాళములఁ బెక్కురఁబట్టిన జాఱునెత్తురుం
జింపకచల్లి కాయములు చిందఱవందఱసేసి జాలయా
లింపద పెద్దప్రొద్దునకు లేవసమర్థులు గాక తక్కినన్. 18

క. కాకులు గ్రద్దలుఁ దన్నినఁ, గోకోయని వెండి నేలఁ గూలిన బోరల్
బైకొని కండలు పెఱుకఁగఁ, జీకాకై యవయవములు చీమలు దినఁగన్. 19

క. బలువైన వృకసమూహము, లలవడఁ గబళించి మేను లలమటఁబడ బె
గ్గిలఁ గూయ నేడ్చి పో గుక్కలు వెంటం దిరిగి తఱిమి గాసిమొనంగన్. 20

సీ. నిబిడమై కురిసెడి నిప్పులవానలో మలమల గొందఱ మాడఁ జేసి
దరికొనికాలెడి దవనాగ్నికీలలఁ బొరిగొని గొందఱఁ బొక్కఁ జేసి
చురుకుచుర్కుచు గ్రొత్తసున్నంపుమడుపుల సురసురఁ గొందఱ సుక్కఁ జేసి
ప్రళయకాలాభీలభానురశ్ములకాక నందందఁ గొందఱ మ్రందఁ జేసి
నిలువ నీడలేక నీళ్లకు వాపోవఁ, దగలటుండఁ జేసి తెగువతోడఁ
బ్రాణికోట్ల నిట్లు బాములఁ బెట్టుచు, మఱియుఁ గాలభటులు మచ్చరించి. 21

సీ. కఱకుఁబగ్గములచేఁ గంఠమూలము గట్టి కుయ్యంగ నీడ్తురు కొంతసేపు
జల్లున రక్తము జ్వాళ్లంగ బల్లేల కొసరి గ్రుమ్ముదు రొకకొంతసేపు
కడకాలుపట్టి వెక్కసముగా నేలపైఁ గూల వేయుదు రొకకొంతసేపు
మిట్ట నెక్కించి బల్మిని నూకి పల్లుల గుప్పునఁ ద్రోతురు కొంతసేపు
ఆ. గ్రామగంగ జాతరకు దామెనలుగట్టి, కొంచుబోవుబారి గొఱ్ఱె లట్లు
పాపమతులఁ బట్టి బల్మిగాఁ గట్టుక, భటులు గొంచుఁబోవు పథమునందు. 22

వ. ఇప్పుగిది నప్పాపాత్ముల నప్పటప్పటికి గుప్పుగుప్పునం గుది చొప్పించి యొప్పు చెప్పుచుఁ జెప్పులెత్తి తెప్పతెప్పున గుప్పించి మోములు వాయ మొత్తుచు మొత్తుకొమ్మని గొట్టురాళ్ల నొడిసిళ్లఁ బెట్టి చేయొద్దిఁ ద్రిప్పి ఱివ్వఱివ్వున రువ్వుచుఁ గ్రొవ్వణంగఁ గొంతదూరంబు నిబ్బరంబుగాఁ బరువులు వాఱించియు బాఁది ముండ్ల పొదరిండ్లఁ దూఱిన వల్లెత్రాళ్లకుఁ దగిలించి తిగియం గక్కుఱుంపంబులఁ దెంపునఁ గొంకి

ముండ్లుగదలఁ గాఁడి కొన్నికండలుకండలుగారాలనీడ్చియుం నిట్టధికావస్థలఁ దూలిం
చియు జవుకులంగొట్టియుఁ జుబుకంబులఁదట్టియు మడిమతాకులం బఱచియుం జెడ
చేతులం జఱచియుఁ బచ్చదబ్బల న్మోదియు నిండుబావులం జేఁదియు ని ట్లధికావస్థలం
బెట్టుచు బహుదూరపథంబులు బహుప్రయాసంబున నడిపించుకొనిపోయిన నచ్చె
నఁటులు నొచ్చియుం విచ్చియు సోలుచు వీలుచు సొలయుచు నలయుచుఁ గడలేని
దుఃఖంబులం గుందియుఁ బడరానిపాట్లం గందియు మధ్యందినమార్తాండకిరణంబుల
మండియు దావానలకీలలం గ్రాఁగియు మంగళంబుల వేఁగియు భూతప్రేత
పిశాచ బ్రహ్మరాక్షస శాకినీడాకినీకోలాహలా కవాకహోర్భటులకు లోఁగియుఁ
గక్షస్థలంబుల మెట్టున బదంబులఁ దోఁగియు ఝంఝూనిలవాతంబులఁ దూలియు
నెత్తురుటేఱులం దేలియుఁ గర్దమంబులఁ గ్రుంకియుఁ బాషాణచూర్ణప్రదంబులఁ
గ్రుంగియు వేదనలఁ గలంగియుఁ గన్నీళ్ల మునింగియు మృగపక్షిగణంబులవలనం
గాయంబుల మూఁగిన మశకమక్షికపిపీలికాదినికాయంబులు వికీర్ణంబులైన కేశపాశం
బులును విచ్ఛిన్నంబులైన ఫాలదేశంబులును వ్యథంబులైన దేహంబులుంగల తత్సమూ
హంబులు తృష్ణాక్షుధాబాధలకు నిలువరింపలేక దగనొండిన పెదవులు దడుపుచు
నీటికి వాపోవుచుఁ గూటికి నోరుదెఱచుచు దగ్గుత్తికల మొఱవెట్టుచు వెన్నంటిపోయిన
కడుపులును గుంటబడినకన్నులును దిమ్మదుముకొన్న చెవులును సొమ్మసిల్లిన తనువులునుం
గలిగి యప్పు డప్పాపాత్ములు దమలోన. 23

సీ. చింతింపమైతిమి శ్రీమహాదేవుని దలఁపలేమైతిమి ధర్మగుణము
కోరలేమైతిమి గురుచరణాబ్జంబు లెన్నమైతిమి జగదీశుమహిమఁ
జదువలేమైతిమి శైవాగమంబులు పూజింపమైతిమి బుధుల నెఱిఁగి
చేరలేమైతిమి శివభక్తజనములఁ బాయమైతిమి మోహపాశతతులు
తే. సేయ మైతిమి ధర్మంబుఁ జేతులార, నడువమైతిమి ముక్కంటినగరమునకు
జరుగమైతిమి తీర్థరాజములు సూడ, మునుఁగమైతిమి యయ్యయో ముఖ్యనదుల. 24

మ. మదమోహంబులు మానమైతిమి కటా మాన్యత్వదోషాదులం
గదియంజేసితి మిష్టబాంధుజనసంఘాతంబులం దూషణా
స్పదముల్ వల్కితి మాత్మవేత్తలకు నిచ్చం దూషణల్ సేసి ము
న్నదయంబల్కితి మీశసేవకుల నాహా యింక నెట్లోగదే. 25

మ. పరసంపత్తికి నోర్వలేక శరుల న్బాధించి యెల్లప్పుడుం
బరనారీగమనంబుఁ జేసితిమి చెప్పంగూడ దిట్లాట మీ
దరయక్ లే కటు చంపఁజొచ్చితిమి పుణ్యాఢ్యులం జేరి శం
కరతత్త్వంబుఁ బఠింప మైతిమి వృథా కామానుకూలస్థితిన్. 26

ఉ. మంకుగుణంబు మాన కసమంజసకీర్తి వహింపలేక మీ
నాంక ధనుర్విముక్త కుసుమాశుగపఙ్క్తికిఁ దాళఁ జాల కే
ణాంకముఖీవిలాస దరహాససుఖంబుల కిచ్చనొంది దు
ష్పంకము లాచరించి తుది బాధలఁ బొందితి మేమి చెప్పెడిన్. 27

ఉ. ఈవఱ కింతసాటుల సహించితి మింకిట నెన్ని బాధలో
దేవుఁ డెఱుంగు వాఁడు మనదేహ మెఱుంగక కండక్రొవ్వు భో
గావహలీల వర్తిలితి మార్యులబుద్ధులు వీనులార నెం
తే విననేరమైతిమి తుది న్నిజమాయె మహోగ్రదుఃఖముల్. 28

క. మనకింక నేదిది క్కని, వనరుచుఁ గన్నీళ్లు దొరుఁగ వంత వెరుఁగ రో
దనములు సేయుచు నలుదెసఁ, గనుఁగొని భయమంది భీతికలితాత్మకులై. 29

వ. ఇట్లనేకభంగులఁ జింతింపుచున్న పాపజంతుసంతానంబులం గని మహోగ్రకోపావేశులును స్థూలమేచకాంబరులును సందష్టదంష్ట్రాకరాళ వికటాట్టహాస వదనగహ్వరులును ప్రళయకాలాకాల నీరదసంకాశ భయంకరాకారులును జండప్రభోద్దండ దోర్దండమండిత కాండకోదండభిండివాలప్రముఖనిఖిలాయుధనికాయులును దుర్నిరీక్షతామ్రాక్షులు నగు కాలకింకరులు రూక్షేక్షణంబుల నీక్షించి కోపంబులు మొగంబులమీఁద రూపింప నప్పాపకర్ముల కిట్లనిరి. 30

శా. దుష్టాచారులు మిమ్ము గన్గొనఁగ నెంతో దోషముల్ వచ్చు మీ
రష్టావక్రపుఁగూత లియ్యెడలఁ గుయ్యం గారణం బేమి యా
కష్టంబుల్ గడతేఱె నంచు మది సంకల్పించి యొండోర్లతో
నిష్టాలాపము లాడఁజొచ్చితిరొ మీకింతైన భంజింపఁగన్. 31

క. ఈమాత్ర మీపురీషము, నీముఱిగినకుక్కనంజు డీచెడుమల మీ
భూములగాడిద లద్దెయు, మీసీభోజ్యములు గావె చింతిల నేలా. 32

ఉ. పాపముసేయవ ద్దనుచుఁ బల్మఱుఁ బెద్దలు సెప్పిన న్మహా
కోపముమీఱ వారియెడ గుత్తుకబంటివిషంబుఁ గ్రక్కుచు
న్పాపము గీప మేదది నెపం బిడి జీవము దాఁటిపోయి యే
దాపున నెందుఁ బొందుదుమొ దాని నెఱుంగ రివేటిబోధముల్. 33

మ. అని ఘర్షింపుచు సిగ్గులేక ధనలోభాయత్తులై చేయఁగూ
డనికర్మంబు లొనర్చి వచ్చితిరి మీడంబంబులు న్మైత్రికె
క్కనుపాయంబులు చింతసేయుదురు నిక్కంబంచు భోగావళు
ల్వినుఁడీ మీయెడ మాకు లేవు తగవు ల్వేయేల సయ్యాటముల్. 34

క. మదమత్సరంబు వదలక, మదవతులం గోరి తవిలి మదనాతురత
న్మది నెఱిఁగి చేయుదురితము, కొదుకక మిమ్మింకఁ గట్టి కుడుపక యున్నే. 35

క. దారతనూభవరక్షణ, కారణమున ఘోరమైన కలుషము సేయం
గోరితిరి వారలిపు డె,వ్వారైనను మిమ్ముఁగూడి వచ్చిరె చెపుమా. 36

క. తాఁ జేయు పుణ్యపాపము, లోజ నెవ్వనిదగిలి వచ్చుచున్నవి గొఱఁగా
దీజగతి నెంతగలిగిన, నోజడమతులార కూఁత లుడుగుం డింకన్. 37

క. మీరింత గాసిఁ బొందిన, మారాజు పదంబులాన మామకచిత్తాం
భోరుహముల నింతైనను, గారుణ్యము వుట్ట దేమి గంటిరి మీరల్. 38

ఆ. ఇల్లు నొరకమునుపె యెలుకరాయుడియన్న, పగిదిఁ దోఁచె మీరు పలుకుటెల్లఁ
గొలఁదిమీఱఁ బెద్దగుమ్మడికాయలో, నావగింజయంత యైనఁ గలదే. 39

ఆ. మనుజలోకమునకు వనజాప్తనందను, పీడ నెనబదాఱువేలయోజ
నములదవ్వు మీకు నడుచు టెన్నటి కింక, ననుచుఁ గ్రోధఘూర్ణితాత్ము లగుచు. 40

క. భీ తెండని పెనుగుదియల, పాలుం గావింతు రొకని బరిఘంబులచేఁ
దోలాడఁ దీతు రొక్కని, గోలల విసరుదురు గోడుగోడన నొకనిన్. 41

క. ఎఱ్ఱఁగఁ గాఁగిన లోహపు, గుఱ్ఱముపై నెక్కుమనుచుఁ గొట్టుదు రొకనిం
గిఱ్ఱునఁదిరుగఁగఁ గఱ్ఱల, ముఱ్ఱంతయు వెళ్లిపోవ మొత్తుదు రొకనిన్. 42

ఆ. కోలకొక్కరాయి గూలనొక్కఁగఁజేసి, ముండ్లకట్టె నొకని కండ్లుపెఱికి
వేఁడిగొఱవు లెత్తి చూఁడుదు రొక్కని, భల్లతతుల నొకని త్రుళ్ళణంచి. 43

సీ. బటువైనపటకార్లఁ బట్టుదు రొక్కని వేమఱుఁ జట్రాత వేతు రొకని
ముసలాయుధం బెత్తి మోఁదుదు రొక్కని వెడఁదకత్తులుతీసి పొడుతు రొకని
సింగానికట్టెలఁ జెండుదు రొక్కని వాఁడిశూలంబుల ప్రత్తు రొకని
బిండివాలంబులఁ జెండుదు రొకరిని గొసరియండంబులు గోతు రొకని
తే. గుంతమున ఱొమ్ముచించి బాధింతు రొకని, మీఁది కెగురంగవైచి క్రుమ్మింతురొకని
జింతపద్దని రాళ్ళ మోయింతురొకని, గిరగిరను నేలఁ ద్రిప్పి వీక్షింతు రొకని. 44

క. కుక్కలచేఁ గఱపించెద, రొక్కని ఖరపక్షిచేత నుక్కడలంగాఁ
ద్రొక్కింతురు వేఱొక్కనిఁ, బక్కనఁ దలవిఱుగఁబీడఁ బఱచెద రొకనిన్. 45

ఉ. పీనికిఁ బూలదండలని వేడుకపుట్టు నటంచు నెంచి కం
ఠానకుఁ దేళ్లదండలు దృఢంబుగఁ జుట్టుదు రొక్కపాపికిన్
వానికి భూషణంబు లనవచ్చు ముదంబని దందశూకసం
తానముఁ బైని వైతురు పదంపడి వేఱొకకష్టబుద్ధికిన్. 46

ఉ. దప్పియటంచు వేఁడొకఁడు దద్దఱిలం గని తత్క్షణంబున
నుప్పుఁ దినంగఁ జేతురు మహోద్ధతి నొక్కనిఁ బోటబాడుమం
చప్పుడు కండ్లనిండ మిరియమ్ములు నూఱి చెముడుపాలతోఁ
జొప్పడఁ జేయనిత్తు రొకజూచరిగానికిఁ గానిపూనికెన్. 47

తే. పరిమళంబులు వీనికిఁ బ్రాణమంచు, శునకసూకరమలము కస్తూరినేసి
నీచజలదారినీళ్లు పన్నీరుగాఁగ, గలిపి పూయింతు రొకనియంగంబునందు. 48

ఆ. వేఁపచేఁదు నేలవేము నీసరవేళ్లు, నభిని ముష్టిపండ్లు నాత్మజలము
గూడ నూఱి కలిపి గొట్టాలతోడఁ బోయింతు రొకనిచేతఁ జింతిలంగ. 49

ఉ. హింసలు చేసి చేసి తనయింటికిఁ గూటికి వచ్చినప్పుడున్
మాంసము లేనియన్న మొకమాటు భుజింపఁ డటంచు మేనిదు
ర్మాంసముఁ గోసికోసి తినుమా యని యిత్తు రనేకజంతువి
ధ్వంసికి దండికింకరు లుదగ్రతమీఱఁగఁ గోప మారఁగన్. 50

సీ. తగరంబు సీసంబుఁ దగఁ గొననిత్తురు పోనీక యొకనికిఁ బొట్టనిండ
జిల్లేడుపాలలో గుల్లసున్నముగల్పి త్రాగింతు రొకనికి దప్పిదీఱ
గ్రుళ్లినకుక్కనంజుళ్లు గాడిదలద్ద తినిపింతు రొకనికిఁ జెంపునేసి
సలసలమఱఁగునూనెలఁ గాఁచి పోతురు నెత్తి మండగ నొక్కనికి బిరాన

తే. దురదగొండియు నల్లేరు దూసి కోసి, నలఁగుఁ బెట్టుదు రొకనికి బలిమిఁబట్టి
యుడుకుచుండెడి గుబ్బంపుటుచ్చలోన, ముంచి యెత్తుదు రొక్కని గొంచెపఱిచి. 51

ఉ. ఎంచఁగరానియెండకు సహింపఁగలేని భుజంగపుంగవుం
గాంచి బిరాన వీఁడు తనకాంతఁ దలంచి వియోగవేదనన్
మించినవాఁడు వీని కొకమే లొనరింపకయున్న బెట్టుదుః
ఖించునటంచు నెంచి యమకింకరు లుగ్రభయంకరోక్తులున్. 52

ఆ. ఇట్టిపాపమతిని బట్టి వీనికి మేను, చలువపుట్టఁ జేయవలె నటంచు
బట్టబయిటఁ బద్మబాంధవపరితప్త, సికతరాశిమీఁదఁ జేరవైచి. 53

సీ. పల్లేరుముండ్లు తల్పంబుగా, నొనరించి గండకత్తెర తలగడఘటించి
యఱచేత నఱకాల నావపిం డెనయించి కన్నుల మిర్యంపుకారమొత్తి
కళపెళఁగ్రాఁగునూనెలు పైని జిలికించి బగ్గునమండుకుంప ట్లమర్చి
బలురేఁగుకంపలు పైసోఁక విసరుచుఁ బొంతచెముడుపాలు వోసి నోట

ఆ. నింకఁ గోమలాంగి నేలుకొమ్మని మండు, తుండు దెచ్చి పక్కదండఁ జేర్చి
యిట్టిభోగ మీవు నేకాలమందైన, ననుభవించి యెఱుఁగ వంచు భటులు. 54

క. వైతత్యోపచారమున కవి, సత్యంబో నిక మఱి విచారించిన నా
నృత్యముగఁ గల్గునని యమ, భృత్యులు నచ్చటికి నీడ్వ భీతియొసంగున్. 55

వ. సకలరోగంబులును మూర్తిమంతంబులై కొలువ నీలమణిపీఠంబున నీలనీరదసంకాశ భయంకర నిగ్రహానుగ్రహ మహోగ్రవిగ్రహుండును ప్రజ్వలజ్వలన జాజ్వల్యమానప్రదీప్త రూక్షేక్షణవర్తులాకార రక్తనేత్రుండును దండాయుధప్రశస్త హస్తుండును నీలమరకతస్థగిత మకుటవిస్తారుండును నిజకింకర పునరాగమనచింతనుండునై కొలువై విలసిల్లు సమవర్తిం గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి చేతులు మోడ్చి యిట్లనిరి. 56

సీ. అవధారు దేవ మీయాజ్ఞ మున్నిడుకొని యేము భూతలమున కేగుదెంచి
పాపకర్ములఁ బట్టి బహుపాశములఁ గట్టి తోలించి రొప్పించి త్రుళ్ళడంచి
తెచ్చితి మందఱు దేవ నీమొగసాల వచ్చియున్నారని వారు దెల్పఁ
దీవ్రకోపంబునఁ దెం డిచ్చటికి వారి ననవుడుఁ గింకరు లరిగి ఖలులఁ
ఆ. సరగఁ దోడితెచ్చి సమ్ముఖంబున నిల్పఁ, జుఱుకుచూపు లెసఁగఁ జూచి యప్పు
డాప్తుఁడైన చిత్రగుప్తుని గనుఁగొని, యిట్టులనియె దక్షిణేశ్వరుండు. 57

ఉ. ఓమహితాత్మ చూచితె కుయోగులఁ గన్గొన దోషమబ్బు నెం
తే మహిలోన వీరు మదియించి యొనర్చిన ఘోరదుష్కృత
స్తోమము లేమి చెప్పు మన సూర్యతనూభవువంకఁ జూచి యో
స్వామి పరాకు దెల్పెద విచక్షణవైఖరిఁ జిత్తగింపుమా. 58

క. అని పల్కు చిత్రగుప్తుం, డనుపమముగఁ గవిలెపట్టుటాకులు గేలం
గొని శంభుజూటగంగా, ఘనభంగస్ఫూర్తిదనరఁ గా నిట్లనియెన్. 59

శా. దేవద్వేషులు వేదదూషకులు భూదేవాహితు ల్గోహరు
ల్శైవద్రోహులు లోకబాధకులు నీచస్వాంతు లన్యాంగనా
సేవాలోలురు భస్మచోరకులు దుశ్శీలవ్రతు ల్లోభమో
హావేశాత్ములు మద్యపానరతు లన్యాయాధికు ల్ధూర్తకుల్. 60

మ. చలచిత్తు ల్గురునిందకు ల్జడమతు ల్సంసారసమ్మోహితు
ల్కులభామామణివర్జితు ల్కుజనులు న్గోపాత్మకుల్ కుత్సితుల్
పలలాసక్తులు దుష్టవర్తనులు కాపట్యప్రధాను ల్మహా
కలుషాయత్తులు సాధుబాధకులు మూర్ఖస్వాంతులుం గ్రూరులున్. 61

చ. పరధనసక్తులు న్నిఖిలబంధువిరోధులు మిత్రవంచకు
ల్పరిహారభేదమానసు లహంకరణాఢ్యులు జీవహింసకు

ల్గురుపితృభక్తికంటకులు క్రోధవిచారులు ధర్మసత్క్రియా
విరహితు లట్టిదుష్కృతుల వీఁడని వాఁడని యేర్పరించెదన్. 62

చ. నడువఁడు వీఁడు శంభుసదనంబున కెన్నఁడుఁ గష్టచిత్తుల
న్విడువఁడు వాఁడు వేదహరి విప్రవిరోధియు వీఁడు హింసకుం
జడియఁడు వాఁడు ధర్మసదసంగుఁడునై తగువారియొద్దకున్
సుడియఁడు వీఁడు భవ్యగుణశూన్యుఁడు వాఁడు విభాకరాత్మజా. 63

సీ. శివపూజయైనఁ గేశవపూజయైనను గలనైనఁ జేయనిఖలుఁడు వీఁడు
హరుకథయైన శ్రీహరికథయైనను జెవులార విననట్టిచెనఁటి వాఁడు
భవునామమైన స్వర్భవునామమైనను బలియింప నొల్లనిపాపి వీఁడు
యీశ్వరునైన లక్ష్మీశ్వరునైనను గని కొల్వ నేరనికర్మి వీఁడు
తే. ఫాలలోచనునైన గోపాలునైనఁ, గోరి మ్రొక్కనినీచసంగుండువాఁడు
మదనహరునైన దానవమథనునైన, భక్తి సేవింపఁజాలనిభ్రష్టు వాఁడు. 64

క. మదగజము వచ్చి తఱిమిన, మదనారిస్థానమునకు మఱపునసైనం
గదియంజొరఁ డీక్రోధా, స్పదునిం గనుఁగొంటె వీఁడు భానుతనూజా. 65

ఉ. పర్వదినంబులందు గలభ్రప్రతియానలసంగమంబు దు
ర్గర్వముగప్పి సల్పినవికారవిధేయుఁడు వీఁడు వాఁడు శ్రీ
శర్వనికేతనంబునను జారవినోదము లాచరించె వీ
డుర్వి రణంబులోఁ బ్రభువు నొవ్వఁగఁజేసెను క్రూరచిత్తుఁడై. 66

క. మిత్రుని కభిముఖముగ మల, మూత్రంబులు విడుచునట్టిమూర్ఖుఁడు వాఁడున్
రాత్రులు జ్యోతింగను నప, విత్రక్రియనున్నవేళ వీఁ డర్కసుతా. 67

చ. అడుగనిసాక్షి పల్కి యొరు లాపద నొందఁగఁజేసె నీఖలుం
డిడుమలఁజాడనే కుడిచినింటికిఁ జేటు దలంచువాఁడు తుం
దుడుకుతనానఁ బెద్దలకుఁ ద్రోవ తలంగనిగర్వి వీఁడు కా
ఱడవులఁ గాల్చుచొప్పున గృహంబులఁ గాల్చెను వాఁడు గొంకకన్. 68

శా. జ్ఞాతిద్రోహము చిత్తమం దిడి సభాస్థానంబులం జేరి దు
ర్జాతుండై వసుధాధినాథులకు లంచాలిచ్చి సంసారసం
ఘాతంబుం జెడిపోవఁ జేసిన మహాకష్టుండు వీఁ డగ్రసం
ఘాతక్షేత్రవినాశహేతుగణసంపూర్ణుండు వాఁ డర్కజా. 69

ఉ. మెల్లన యిల్లుసేరి కడుమెచ్చునఁ దచ్చన లుచ్చరించి తాఁ
గల్లరివానివ గ్గనలు గం పెడువన్ని కులాభిమానముక్

గొల్లలుగాఁగఁ జెల్వి తనుగూడ నుపాయము లేర్పఱించి సం
ఫుల్లసరోజనేత్రలను బొంకెను వీఁడు విచిత్రవైఖరిన్. 70

క. ఋతుమతియై కాంతామణి, పతిఁ గోరి గృహంబులోనఁ బరితాపింపన్
మతిఁ దలఁపక పేఱొక్కని, సతితోఁ గ్రీడించె వీఁడు చపలాత్మకుఁడై. 71

తే. సోదరుల వైభవంబులఁ జూడలేక, మందుమ్రాఁకులు శూన్యాదిమంత్రశక్తి
నన్నదమ్ముల ప్రాణము గొన్నయట్టి, జాతికర్మవిహీనుఁ డీస హాసుండు. 72

ఉ. ఇచ్చెదనంచు బ్రాహ్మణున కీతఁడు నాశయుఁ జెప్పి యింటికిన్
వచ్చిన జేపు మా పని ధ్రువంబులఁ బల్కినఁ గొన్ని నాళ్లపో
నిచ్చి యిదేమయా యనిన హెచ్చినకిన్కను లేదు పొమ్మనెన్
గచ్చులు సేసి వీఁడు కలకాలము దబ్బఱలాడుఁ గష్టుఁడై. 73

సీ. తండ్రితద్దినము పెద్దలువచ్చిచెప్పినఁ దమ కచ్చిరాదన్న కుమతి వీఁడు
భోజనం బిడుచోటఁ బుణ్యమెన్నక పఙ్క్తిభేదం బొనర్చు పాపిష్ఠి వాఁడు
ఇల్లాలివాక్యంబు లింపుగాఁ జేపట్టి తల్లిదండ్రుల కెగ్గు దలఁచె వీఁడు
భిక్షమడుగువాని బిలిచి కుక్కలచేత నుసికొల్పి కఱపించి కసరు వాఁడు

తే. తుంటతనమునఁ దిరుగుతుందుడుకు వీఁడు, జారచోరప్రవర్తన సలుపువాఁడు
వావివర్తనలేని చార్వాకి వీఁడు, కపట మెప్పుడుగల పలుగాఁకి వాఁడు. 74

క. శివరాత్రుల భుజియించుచు, శివభక్తులఁ బరిహసించు శివదూషకుఁడై
శివనిర్మాల్యము ముట్టని, శివకంటకుఁ డల్లవాఁడు శిష్టవిచారా. 75

ఉ. స్నేహముగోరి మిత్రుఁడు వశీకృతుఁడై కడునమ్మి యెంత సం
దేహము లేకయున్నతఱిఁ దెంపున నాతని జంపనెంచు ని
ర్మోహవిచారుఁ డీజడుఁడు ముఖ్యచరిత్రులఁ జూచి యూరకే
ద్రోహము గట్టుకోఁ దలఁచి దూషణసేసెను వాఁడు జంకకన్. 76

క. గడియకు నూరుగుణంబులు, తడఁబడు హృద్వీథిలోన దాక్షిణ్యం బె
న్నఁడులేని దుష్టచిత్తుఁడు, గడుసరి కలహాశి వీఁడు కాసరగమనా. 77

ఉ. తామసమర్త్యకోటికిఁ బ్రధానశిరోమణి యెంతవారినై
నా మది లెక్కవెట్టక ధనంబులఁ గూరిచి వారకామినీ
స్తోమము పాలుచేసి తుది జూదరికాండ్రకుఁ గొంత యిచ్చియున్
నేమది దానధర్మము సహింపక వర్తిలె వాఁడు మేదినిన్. 78

తే. భూమిపతి కిచ్చుకంఋలు పుట్టఁజెప్పి, కొంతలొక్కంబు నిందులఁ గూడు వంచుఁ
దీర్ఘవాసులు వోయెడి తెరువులందు, సుంకవాసులఁ గల్పించుఁ జూచె నితఁడు. 79

సీ. గురునియిల్లాలితోఁ గూడె నీతుచ్ఛుండు తండ్రిఁ బొందినచోటఁ దగిలె వాఁడు
అన్నా యటన్నతో య్యాలిని నేలెను వాఁడు పినతల్లి నెనయు పాపిష్ఠి వీఁడు
తమ్మునిభార్య నుద్ధతిఁ బట్టె నీదుష్టుఁ డత్తతో సయ్యాట మాడె వాఁడు
దగఁ జెల్లెలిని బొందఁదలఁచె నీకష్టుండు కదిసినాఁ డగ్రజాంగనను వాఁడు
తే. విధవలకు గర్భభరము గావించె వీఁడు, విప్రభామలఁ గోరినవెడఁగు వాఁడు
మునిమహిళలను గామించు మూర్ఖుఁ డితఁడు, బోసకత్తెల భోగింపఁ బూనె వాఁడు.

తే. అతిథి వాకిటవచ్చి కుయ్యంగ నతని, నాదరింపక మూలగేహంబులోన
భోజనముసేసి తాఁ దృప్తిఁ బొందినట్టి, కఠినచిత్తుఁడు వీఁడు భాస్కరతనూజ. 81

క. ఎక్కడ మరణము షోడశ, మెక్కడఁ దిలదానభూరి యెక్కడ శ్రాద్ధం
బెక్కడ నని కులకర్మం, బక్కట పోనాడి తిరుగు నధముఁడు వీఁడే. 82

శా. నానాదానవితానము ల్గానఁ బరాన్నప్రీతుఁడై నిత్యక
ర్మానుష్ఠానము మాని రేఁ బగళు లన్యాయార్జితద్రవ్యసం
తానుండై పరమార్థమైన సెలవింతా లేక పడ్డప్పులి
చ్చేనీచుం డదిపోవ దుఃఖపడెఁ దా నిట్లయ్యె వేయేటికిన్. 83

ఉ. అన్నము విక్రయించి పరిహాసపు యుక్తులు గొన్ని నేర్చి సం
పన్నులయిండ్లయొద్దఁ బనిపాట లొనర్చి నికృష్టవర్తనా
సన్నపరాభవంబులకు జంకక శంక యొకింతలేక దు
ష్టాన్నవిహారుఁడై యఘము లార్జన సేసె నితండు మెండుగన్. 84

ఉ. వర్తకరీతుల న్సకలవస్తునికాయము లెల్లఁ గూర్చి తాఁ
గర్త యనం జెలంగి యధికంబుగ బేరములాడుచోట స
త్కీర్తి వహింపలేక బహుకిల్బిషయుక్తులు గల్లమాటలుం
ధూర్తకుఁడై వచించి కడుదోషము సేసెను వీఁడు నీసునన్. 85

సీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణమును మాని దుర్మార్త్యుల మంత్రశక్తి
నేడింటిమరగియు నిష్టుల నెఱుఁగక నంతరంబున శత్రుజయములేక
యాష్టకర్మండైన నాతనిమన్నించి నిరపరాధులమీఁద గొఱకలంచి
రిక్తసాధుల విచారింపక పుణ్యంబు సేయ నొల్లక కష్టశీలుఁ డగుచు
తే. వెలపడంతులపొందు గావించి మించి, బ్రహ్మనిర్జరాదాయము ల్పాడుసేసి
ప్రజలకెల్లను మృత్యువై పరఁగినట్టి, పరమపాతకుఁ డీ భూమిపాలకుండు. 86

క. కొండెము విని సత్సాధుల, గుండెల నవియంగఁ గట్టి కొట్టి ధనంబుల్
దండుగలఁబట్ట నరదై, త్యుం డనఁ దనువెత్తె వీఁడు దొడిబడి పుడమిన్. 87

తే. ఎవని జెఱుపుదు నే నని యెల్లప్రొద్దుఁ, జింతసేయుచు రాజులచెంతఁ జేరి
చొప్పుదళుకొత్తఁ గొండెముల్ జెప్పు వీఁడు, వీఁడుచెఱచినయిండ్లు వేవేలుగలవు. 88

క. మగలకు మగువల కెడలోఁ, బగనొదవం జెప్పి రేలుఁబగలును దగఁ బెం
జగడంబులు గల్పించిన, సిగకోఁతలమారి వీఁడు శిష్టవిచారా. 89

ఉ. కుక్కల గర్దభావళుల ఘోణులఁ బిల్లుల నాయసంబులం
గొక్కుల బల్లులం జడులఁ గుష్ఠవిరోగుల జారకాంతలం
గుక్కుటరాజి నంటుపడుకొమ్మలఁ జేడుల మద్యపానులం
దక్కక మీఱి యంటుకొని తానము సేయఁడు వీఁడు గొబ్బునన్. 90

సీ. భూతేశుగుడిలో విభూతియొసంగిన దిగజాఱవిడుచు నీద్రిమ్మరీఁడు
శైవపురాణప్రసంగంబు వచ్చిన నవి కల్ల లెంతలే దనును వీఁడు
భస్మరుద్రాక్ష శుంభచ్ఛరీరులఁ గాంచి పనికిరా వెగ్గలు పలికె వీఁడు
శివభక్తిపరుని వీక్షించి యోర్వఁగలేక దూషణచేసె నీదుండగీఁడు

తే. యిందుశేఖావతంసుఁ డూరేగి రాఁగ, నింటితలుపు బిరాన మూయించె వీఁడు
యెల్లచదువులమర్మంబు లెఱిగినట్టులు, హరపరాత్ముల బాధించి తిరుగువాఁడు. 91

ఉ. గోవధకారి వీఁడు గజఘోటకభేదనుఁ డల్లవాఁడు వీఁ
డావులఁ జేర్చి శంబరతృణాదులకాలము రోగమెన్ని తాఁ
బ్రోవఁగ లేనినిర్దయుఁడు భూసురహత్య యొనర్చు వీఁడు బా
లావళిఁ ద్రుంచె వీఁ డహరహంబును మద్యముద్రావు మూఢుఁడై. 92

ఉ. తెమ్మని కాంచనం బొరసి దిట్టము వట్టము నెత్తుఁ జూచి నే
సొమ్ములు చేసి తెత్తునని చొప్పుగఁ గైకొనిపోయి కొన్నినా
ళ్ళమ్ముగఁ ద్రుప్తి బంగరు గ్రహించెడిమాయలు పెక్కు నేర్చి యీ
ద్రిమ్మరి పొట్టకై యిటులు ద్రిమ్మరు సాధుధనాపహారియై. 93

సీ. అగ్రజునకు వివాహంబు సేయకమున్న పెండ్లియాడిన పరివేత్త వీఁడు
హితకారియైయుండి పతికార్య మొరులకుఁ జెప్పి తద్రాజ్యంబు చెఱిచె వాఁడు
విందు బెట్టెదమని మందులువెట్టించి జ్ఞాతులఁ బెక్కండ్రఁ జంపె వీఁడు
వంచనలేక సెవ్వగ సేవచేసిన భటులపై నేరముల్ పన్ను వాఁడు

తే. కన్యకావిక్రయానందకరుఁడు వాఁడు, ద్విజకురంగేక్షణల జెఱఁ దెచ్చె వీఁడు
పరమపుణ్యాత్ములను దూలఁబలుకు నతఁడు, భానునందన వాఁడు విశ్వాసఘాతి. 94

సీ. నలుగురిలోఁ బ్రతిజ్ఞలు పల్కి తన్నుఁ దా భూషించుకొన్న దుర్బుద్ధి వీఁడు
కన్నగాండ్ర గడించి కలిగినవారిండ్లు గన్న పెట్టించు దుష్కర్మి వాఁడు

పుడమిఁ జేదలయిండ్ల విడుదులుగా నుండు దుస్సహకఠినచిత్తుండు వీఁడు
అధిపుచే బహుమాన మంది కయ్యముఁ జూచి భీతిలి చను పాఱుబోతు వాఁడు
తే. నూటి కొక్కటైన సత్యంబు నుడువలేక, నిష్ఠురాలాపములు పెక్కు నేర్చు వీఁడు
మమతఁదాఁ జేయుమర్మకర్మములుపరులు,వినవలెనటంచుఁ బ్రకటించువెడఁగు వాఁడు.

క. సరియింపఁడు పంచాక్షరి, ధరియింపఁడు భూతి నుదుట దబ్బఱలయినా
చరియింపఁడు పుణ్యంబుల, భరియింపఁడు నీతి వీఁడు పాపాత్మకుఁడై. 96

మ. హరునిందించిన దుష్టవర్తనుని జిహ్వామూలముం గోసి సు
స్థిరతన్ వర్తిల శక్తి లేకునికిఁ గస్తిం బొంది కర్ణంబులం
గరయుగ్మంబున మూసికొంచు జనము ల్గల్యాణ లీదుష్కృతం
బరుదారన్ శివదూషణంబు విని సాహంకారులై కొంకకన్. 97

ఉ. ధాతువిలక్షణంబున నిదానము లేక మహౌషధక్రియా
ఖ్యాతికి రోగజన్యము గుణాగుణసంగతి కాలదోష మా
ధూతవిశేషభావములుఁ దోఁచక యూరక మందులిచ్చి ని
ర్ఘాతకుఁడై యఘంబు లాడిగట్టెను వీఁడు ధనాభిలాషియై. 98

సీ. సంగీతముల్ కళాశాస్త్రము ల్వినుఁగాని వినఁడు శైవజ్ఞాన విపులమహిమ
భోగభామలఁ గూడి ప్రొద్దుపుచ్చునుగాని దలఁపఁ డొకప్పుడు ధర్మగుణము
పనిలేనిపనికినై పర్వులెత్తునుగాని మెట్టఁడు తీర్థసామీప్యభూమి
సంసారదూషణాశల దుఃఖపడుఁగాని యొల్లఁడు శీలవ్రతోపనిష్ఠ
తే. కనక మార్జించుకుశలంబుఁ గాంచుఁ గాని, గుప్తదానంబుసేయఁ డేకొలఁదినైన
బుద్ధి యొరులకుఁ జెప్పంగఁ బోవుఁగాని, తన్నెఱుంగనితుచ్ఛవర్తనుఁడు వీఁడు. 99

క. ఉదయాస్తమానవేళల, మదమున నిద్రించుచున్న మాసలనైనా
నదులందుఁ గ్రుంకనొల్లని, మదిరాప్రియతముఁడు వీఁ డమంగళుఁ డధిపా. 100

ఉ. ప్రేలుఁ బగళ్లు త్రోవలు దరించుచు నిద్రయు భోజనంబు ని
ర్మూలముసేసి దండము సమున్నతిఁ గేల నమర్చి యొంటిమై
వ్రాలుచు బాటసారి తెరవాటులు గొట్టి భయంబుఁ జెప్పి బా
గాలును గాసువీసములుఁ గైకొనుసుంకరి వీఁడు సూర్యజా. 101

క. తిరునాళ్లపరుసలోఁబడి, తిరుగుచుఁ గ్రిక్కిరిసియున్న తెఱవలపాలిం
డ్లొరయఁగఁ జొరఁబడి ముల్లెల,మఱ దొంగతనంబు గొన్నమాలఁడు వీఁడే. 102

మ. ఒకనాఁ డన్న మొకింతతక్కువగనే నోర్వంగలే కమ్మతో
సిగకట్లాడుచుఁ బెద్దకూ తలిడి గాసిం బెట్టి నిత్యంబు వే

శిశుఁ జూపట్టి భుజింప నంట ధనమెల్లం గొల్లగా జూదగాం
డ్రకు వెచ్చించి ముసళ్ళదుఃఖముల మండంజేసె వీఁ డెంతయున్. 103

క. నక్షత్రవారదినముల, లక్షణమారయక వీఁ డలంకారకళా
పేక్ష స్నాపితుఁ డబ్బిన, నక్షణ మాపనులు సేయుమను ననఘాత్మా. 104

క. దొరయని తనయొద్దికి స, త్పురుషు లరుగుదేరఁ జేరి పూజింపఁ డమం
దరతిం గూర్చుండు మనం, డిరవుగ నీనరునిగర్వ మేమనవచ్చున్. 105

సీ. అనుకూలవతియైన తనవనజాక్షిపై నిలుగులుపూని వర్జించె వీఁడు
సంప్రదాయకుఁడైన సద్గురురాయని విడిచిపెట్టిన దుర్వివేకి వాఁడు
నప్పునప్పులుదీసి యడిగిన నియ్యక బహుఋణంబుల పాలుపడెను వీఁడు
నవమానవృత్తి వద్దని తండ్రి హితవుగాఁ జెప్పినఁ గోపించి రొప్పు వాఁడు
తే. కొడుకుసంపత్తికిని మదిఁ గుందు వీఁడు, నవనిలోన స్వదత్తాపహారి వాఁడు
పేదలకుఁ జేయుమేలుఁ దప్పించు వీఁడు, శరణుసొచ్చిన భీతులఁ దఱిమె వాఁడు.

క. రదనవ్రాతము తర్జని, కదియం జొరనిచ్చి తోమి గండూషజలం
బుదకంబుల విడిచిన దు, ర్మదునిం గనుఁగొంటె వీని మార్తాండసుతా. 107

వ. అని యిత్తెఱంగున బ్రహ్మహత్యా సురాపాన గురుతల్పగమన సువర్ణస్తేయ తత్సంగతాది మహాపాపసహితులను స్త్రీపతిశిశుజీవహత్యాద్యుపపాతక విహితులను పరిహార పరాఙ్ముఖులను నఖిలప్రాణిహింసాపరాయణులను వేదబాహ్యులను వ్యాధయవనపార్వతీయమ్లేచ్ఛ చండాల చార్వాకప్రముఖ దుర్మతస్థులను భస్మరుద్రాక్షవిరహిత క్షుద్రులను విశ్వాస ద్రోహులను విశ్వాసఘాతకులను వేర్వేఱం జూపి తత్తత్కర్మంబులను జిత్రగుప్తుండును జిత్రవైఖరి వినుపించిన నాలకించి సమవర్తి సంవర్త సమయప్రజ్వలనోగ్రకీలాజాలంబులపై ఘృతంబుఁ జల్లిన మెండుకొని మండు చందంబుననుండి బ్రహ్మాండకాండంబులు భస్మీభూతంబులు సేయనుద్యోగించు ప్రళయభైరవాకారుండై దీర్ఘనిశ్వాస నిర్ఘోష భీషణేక్షణుండై సందష్టదంష్ట్రాకరాళభయదాట్టహాసముఖుండై కుటిలభ్రుకుటీతటనిటలుండై వికటనాసికాపుటుండై శోణదృక్కోణంబులఁ బ్రస్ఫురద్విస్ఫులింగంబును రాల నొక్క పెడనవ్వు నవ్వి కొలువువారెల్ల భయభ్రాంతులై గడగడవణంక నిజభుజాదండ ప్రచండకాలదండంబు బ్రహ్మాండ కటాహంబు వగుల నెగురవైచి పట్టి హృదయంబున వెడలుకోపంబున మొగంబు జేవుఱింపంగ నప్పాపజాతులం జూచి తలయూఁచి నిరంకుశత్రిలోకభయంకర ప్రచారులగు తనపరిచారకులవంకఁ గనుంగొని యిచ్చటి సనాతనమహర్షిపుంగవుల యనుజ్ఞను విజ్ఞానేశ్వరప్రకారంబున విధిజ్ఞులకుం దనయాజ్ఞ వినుం డని యముం డిట్లనియె. 108

సీ. గృహదాహకులఁబట్టి కీలజాలోజ్జ్వలజ్వాలలఁ గాల్పుఁడు సాహసమున
గురుతల్పగమనుల ఘోరాసిపత్త్రవనంబుల నుంచుఁ డంగంబు లురుల
విద్యాన్నకన్యకావిక్రయాసక్తుల నడలఁ ద్రిప్పుఁడు దారుయంత్రములను
మద్యమాంసాహారమత్తచిత్తుల దుఃఖపడఁ ద్రోయుఁ డంధకూపములలోన
తే. నీతిమాలిన విపులాధినేత్రసమితి, మంగలంబుల వేఁచుఁడీ మాఁడిపోవఁ
గండలసిధారఁజెండుఁడు కొండెగాండ్ర, గోయుఁడఱ్ఱులుకొండవండ్లఁ గ్రూరమతుల.

సీ. విధుకళావాళీక విద్వేషినాలుకల్ కోసివండుఁడు తైలకుంభములను
శివదూషణలు విన్నచెవఁటులచెవులలోఁ జొనుపుఁడు కాలినశూలసమితి
శ్రీకంఠమూర్తి వీక్షింపనివారల కన్నుల చెలుకుఁడు కత్తిమొనలఁ
జిద్రమణీశుఁ బూజింపనిమూఢుల కరములు నఱకుఁడీ ఖడ్గధార
తే. గట్టువిల్కానికోవెల మెట్టనట్టి, ఖలుల నూకుఁడు పట్టి బెబ్బులులవాత
స్మరహరస్మరణాజ్ఞులజఠర మొరయఁ, గాఁచి పోయుఁడు సీసంబు కరుణలేక. 110

క. పర్వదినంబుల రాత్రులు, పర్వేందుసమానముఖులఁ బైకొనుజడులం
దర్వీకరదంష్ట్రానల, దుర్వహశిఖలందు మండ ద్రొబ్బుం డలుకన్. 111

చ. తగనికురంగనేత్రల మదంబునఁ బొందినమందబుద్ధులం
బుగబుగమండున ట్టినుపబొమ్మల నిమ్ముల నంటఁ గట్టుఁడీ
పగగొని భ్రాతృ మిత్త్ర గురుబంధుల దూఱినవారిపై మహా
యుగములదాఁకఁ బర్వతము లొయ్యన తియ్యకవైపుఁ డుద్ధతిన్. 112

క. కుక్కలచేఁ గఱపింపుఁడు, ముక్కంటికి మ్రొక్కనట్టి మూఢాత్ములతో
మ్మెక్కించి త్రొక్కఁజేయుఁడి, యక్కరినికరంబుచేత హరవిరహితులన్. 113

సీ. నలివజ్రదంతపుర్వులుగల బావిలోఁ గూలఁద్రోయుఁడు లోభగుణులఁ బట్టి
యుక్కుకొఱ్ఱులమీఁద నెక్కించి త్రొక్కుఁడు గమకించి విశ్వాస ఘాతుకులను
వేదవిప్రద్విషద్వితతుల బరిమాలఁ గఱకుఱంపంబులఁ దఱుగుఁ డలుక
ననృతవాదులకండ లవనిపైఁ గ్రొళ్లంగఁ జెక్కుఁడు బాడిసె ల్సేతఁబూని
తే. వెదకి సున్నంపుటాళ్ళను విరియఁబోయుఁ, డమితకోపాదిపశుల దేహములు గాల
గాలపగ్గాలుగట్టియుఁ గక్కటాళ్ళ, నోఁక సీడ్వుఁడు వీథుల జూదగాండ్ర. 114

చ. తలలు పకీలుసం బగుల దంపుఁడు మాసలపంక్తులెత్తి ని
ర్మలపరిశుద్ధవర్తనుల మర్మము లోర్వక తూలనాడఁగాఁ
దలఁచినహీనులం బశువధం బొనరించినవారిపొట్టలం
గలకలమంచు గాదిలను గ్రాఁగిన తైలమువోయుఁ డోడకన్. 115

ఉ. తప్పుగ సాక్షిచెప్పిన యధర్మశరీరుల మేనిచర్మముల్
చొప్పడఁదీసి యుప్పు సరిసున్నము పంకము చేసి పోయుఁడీ
తప్పక మేలొనర్చు తమదాతల కెగ్గు దలంచునీచుల
న్నిప్పులగుండమందుఁ బడనెట్టుఁడు నెట్టన గుట్టుపీడఁగన్. 116

చ. పరతరుణీశిరోమణులపై భ్రమఁబొంది వియోగవేదనం
బొరలెడివారిమర్మముల బోరునఁ జొన్పుఁడు నీ తమఃళ్లఁ ద
త్క్రూరముల గోళ్ళలో నిడుఁడు కాలినసూదులు గత్తులెత్తి త
చ్ఛిరములు వాపుఁ డట్టలకుఁ జెప్పఁగ నేటికి మాటిమాటికిన్. 117

క. శరణాగతసంరక్షణ, పరతంత్రులుగాని భూమిపాలుర దనుజో
త్క్రూరభూపవ్రాతంబుల, కఱిముఱి నాహారమియ్యఁ డఱమఱలేకన్. 118

తే. ఉన్నతాత్ములఁ గని లేవకున్నవారి, నొసరఁ గ్రాగిన యినుపపేనములమీఁదఁ
బట్టి కుయ్యంగఁ గూర్చుండఁబెట్టుఁ డలుక, మీఱ నామాట మీఱక మీర లిపుడు.

మత్తకోకిల. తల్లిదండ్రుల సన్నదమ్ములఁ ఏల్లడించినవారలన్
మల్లగించియు మీర లేపుగ మాటిమాటికి నిప్పుడున్
శల్లపంక్తులపాలు సేయుఁడు పాలుమాలక చోరులన్
రాళ్ల బువ్వఁడు ఱివ్వఱివ్వన నాఁటనాఁటికిఁ జూడఁగాన్. 120

మత్తకోకిల. ఱాతిరోళ్లను బట్టి క్రుమ్ముఁడు ఱాగము ల్వడి బాడుచున్
జాతికర్మవివర్జనాత్ముల సందుసందులు వీడఁ దాఁ
బైతృకక్రియ లాచరింపని భ్రష్టులం బరిఘంబులం
భీతివుట్టఁగఁ గొట్టుఁ డుద్ధతిఁ బెన్నురంబులు వ్రీడఁగాన్. 121

ఆ. పెద్ద లుసురుసురనఁగఁ బీడ పెట్టినవారి, యుసుఱు గాలములను గొసరి తీయుఁ
డల ధనాపహర్త కొలుములపై నిడి, యుస్సురనఁగఁ దిత్తు లూద్చుఁ డిపుడు. 122

ఆ. త్రాళ్ల గ్రాళ్లఁబెనసి తల్లక్రిందుగను నే,రేడుకొమ్మలందు వ్రేలఁగట్టి
పందిఁ గాల్చినట్టిపగిదిని గాల్చుఁడీ, యతిథిపూజ సేయనట్టిజనుల. 123

ఆ. ప్రాణహానిగాఁగ భక్ష్యభోజ్యంబుల, మందుఁ బెట్టినట్టి మందమతుల
ద్రొబ్బు డొక్కవగుల దుస్తరగంభీర, ఘోరగరళమిళితకూపములను. 124

క. మలమూత్రక్రిమికీటక, కలిలదుర్గంధప్రపూర్ణకిల్బిషకూపం
బులఁ బడనూకుఁడు నిరతముఁ, బలవింపఁ గృతఘ్నతతుల బహుకల్పంబుల్. 125

తే. ప్రల్లదంబులు వల్కెడిపాతకులను, ద్రెళ్లప్రాంతఱ ద్రొబ్బుఁడు తృష్ణణంగఁ
బత్క్రభేదం బొనర్చిన పంకరతుల, హతఁబోయుఁడు విషము లవారిగాఁగ. 126

తే. ఉదకసామీప్యమునసురులొడ్డి విహగ, మృగసమూహముఁ దెగఁజూచు మ్లేచ్ఛతతులఁ

గత్తిబోనులఁ ద్రోచియు గండశిలలు, మొత్తముగవైవఁ డౌదల లెత్తకుండ. 127

వ. మఱియు ననేకవిధంబు లగుదురిత్రంబు లాచరించిన పురుషాధముల దొడ్డుకొంచెంబు లరసి మద్వాక్యోల్లంఘనంబు గాకుండ మీమీనేర్పులు మెఱయ వారివారికిం దగిన నఱకంబులు రౌరవంబును గుంభీపాకంబును నసిపత్రవనంబును ననలలోహస్తంభంబును మొదలుగాఁగలదుర్గతుల నిందఱ బాధించునెడ నిమిషార్థంబైనఁ గా లూది నేదదేర నావకాశంబు లేకుండున ట్లధికావస్థలం బెట్టుచు రత్నగర్భయు రత్నాకరంబులును గంధవహబాంధవుండును నంతరిక్షంబును దివాకర నిశాకరాది గ్రహంబులు బ్రహ్మకల్పంబుఁ గల్గునందాఁక జీవులసమయించియు సమయనీయక నొప్పించుమని భటకోటికి నప్పాపుల నొప్పించి వీడ్కొలిపి యందు వీరసేనుం డనుసేనానాయకుంబిలిచి తనవ్రేలిముద్దుటుంగరం బొసంగిన నతండు భయభక్తిపూర్వకంబునం బుచ్చుకొని దండధరునకుం బ్రణమిల్లిన బాహూకరించి యనిపె నవ్వీరాగ్రేసరుం డరుదెంచి తద్వృత్తాంతంబుఁ దదీయసహచరులకుం జెప్పి సంభ్రమంబున దూతలు మున్ను బరేతవిభునిచేత మూఁడువరంబులు గైకొన్నవార లగుటం జేసి దూతలును బ్రేతవ్రాతంబులును భూతసంఘాతంబులుం జెలరేగి కహాకహార్భటుల లోకంబు లావళింప జేయుచుఁ బరశు పట్టిస ప్రాస ముసల ముద్గర తోమరభిండివాల దండ గదాదండ ధనుర్బాణకృపాణకరపత్రముఖ నిఖిలసాధనంబు లంకించుచుఁ బెడబొబ్బలిడుచు వెడనవ్వులు నవ్వుచుఁ జంగునం దాఁటుచు ఱంగున నువ్వుచు నాడుచుం బాడుచు నెగురులాడుచు ముష్టిఘాతంబుల బాధించుచు బెట్టురట్టడిఁ గొట్టికొనిపోయి తన్నగరదక్షిణదిగ్భాగంబున నయోమయప్రాకార బంధుర వజ్రద్వారకవాట ప్రపాటనంబుగాఁ గదలి యందుఁ బడఁ ద్రోచినఁ జిరకాలంబు మహాఘోరనరకంబులం బడరానియిడుమలం బడి జీవులు బహుదుఃఖంబు లనుభవింతురన విని విస్మయగతమానసుం డై సానందమానిసునాసీరుండు కరుణారస భావంబునఁ గటకటం బడి శివస్మరణంబు సేసి యద్ధర్మప్రసంగున కిట్లనియె. 128

ఉ. ఓమునినాథ మీరలిపు డొప్పుగఁ జెప్పినగాథవైఖరు
ల్నామది నింపుపుట్టదు వినం గడుచోద్యము లయ్యెఁ గొంద ఱి
ట్లామహనీయవైభవము లంది సుఖించుట యేమి కొంద ఱీ
బాములఁ బొందుటేటికిఁ గపర్దికృపారస మెట్టులుండెనో. 129

క. మిక్కిలిపుణ్యులచరితం, బక్కట విను చెవులఁ బాప మాలించుటలుం
జక్కెర మెక్కినతోడనె, వెక్కసముగఁ జేఁదు దిన్నవిధ మయ్యె సుమీ. 130

ఉ. అక్కట ఫాలనేత్రుఁ డుదయాంబుధియై చెలువొంది కొందఱ
న్మిక్కిలి తీవ్రవేదనల నివ్వటిలం దలపోసె నయ్యయో

దిక్కుఁ గయింత లేక గడు దీనులకై వడి నున్నవారలన్
మక్కువఁ బ్రోవకున్న యిది మంచితలంపె ఖగేంద్రచంద్రమా. 131

మత్తకోకిల. సర్వజీవదయాపరత్వము సర్వదేవవిభుత్వమున్
సర్వకారణవైభవంబును సార్వసాక్షివిలాసము
స్సర్వమంగళదాయకత్వము సర్వపూర్ణమహత్త్వము
స్సర్వదేవునియందుఁ గల్గుట చాటు వేదము లొక్కటన్. 132

సీ. అదిగాక విను మమ్మహాదేవుఁ డార్తజనత్రాణుఁ డనియు ననాథనాథుఁ
డని యకారణబంధుఁ డని దీనపోషకుం డని కృపాంభోనిధి యనియు నీశుఁ
డనుచుఁ బురాణేతిహాసశాస్త్రంబులు నొరిది వక్కాణించు శ్రుతులు దెలుపుఁ
గావున నద్దేవు కరుణాకటాక్షంబు రాకున్కి వారికర్మములుగాక

తే. నమ్మహాత్ముని దివ్యవిఖ్యాతమహిమ, వర్ణనము సేయఁ దరమె యెవ్వారికైన
బూర్వదేవాదితేయులు పూర్వమందు, ఘనసుధాపేక్షఁ గలశసాగరముఁ జేరి. 133

శా. అంభోరాశిమథించినప్పు డతిరౌద్రాభీలదుర్వారసం
రంభోదగ్రకరాళపావకశిఖారాజన్మహారావది
క్సంభూతస్ఫుటకాలకూటము జగత్సంహారముం జేయ గా
జంభారిద్రుహిణాదు లెన్న నవి చంచల్లీల భక్షింపఁడే. 134

సీ. ఎల్లలోకంబులకేఁ గర్త ననుకొన్న కమలగర్భుని మస్తకంబు ద్రుంచె
నధ్వరఫలదాతనై తనర్చినతన్ను దూషించు దక్షుని త్రుళ్ళణంచె
నెదు రెవ్వరును లేక మదమున వర్తిల్లు త్రిపురాసురుల క్రొవ్వు దీర్చివైచె
పాంథుల బాధించు పంచశిలీముఖు ఫాలాగ్నికీలల పాలు చేసెఁ

తే. గల్పనస్థితిసంహారకర్తయైన, దేవదేవుఁడు రక్షింపఁ దెగువ సేయ
వలవదని యడ్డపెట్ట నెవ్వారితరము, నమ్మహేశుఁడు స్వేచ్ఛావిహారి గాఁడె. 135

క. చిత్రంబులు నఘవల్లీ, దాత్రంబులు భక్తలోకతారకలీలా
పాత్రంబులు కలివర్షా, చ్ఛత్రంబులు ఫాలనేత్రుచారిత్రంబుల్. 136

క. కామంబులు బహుదురితవి, రామంబులు రాజయోగరమణీయకళా
ధామంబులు సద్భక్త, క్షేమంబులు శంభుదేవు శ్రీనామంబుల్. 137

క. స్మరణంబులు వేదాంతవి, హరణంబులు ఘోరపాపహరణంబులు దు
ర్భరసంసారపయోనిధి, తరణంబులు రజతశైలధవుస్మరణంబుల్. 138

క. పావనములు నిర్జరసం, జీవనములుఁ జిత్కళావిశేషజ్ఞ విశా
లావనములు శోభనసం, భావనములు చంద్రమౌళిపదసేవనముల్. 139

క. లక్షణములు నిగమార్థవి, చక్షణములు నైజగర్భసంభరితజగ

ద్రక్షణములు మధురసుధా, భక్షణములు శరాలిసత్కృపావీక్షణముల్. 140

వ. అని వెండియు. 141

సీ. ఏకార్ణవమువేళ వైకుంఠుఁ బ్రోవంగ న్యగ్రోధభూరుహమై చెలంగెఁ
గాలుని దర్శించి కాలభీతుండైన మునికుమారుని గాచె మోదమలర
లోకకంటకులైన భీకరవ్యాఘ్రాసురాదిదైత్యులపీచ మణఁచివైచె
శరణాగతత్రాణబిరుదు వక్కాణించి యఖిలనిర్జరరాజి కభయమిచ్చెఁ
తే. ప్రళయకాలోగ్రతాండవభ్రమణనిపుణ, చరణఘట్టనచూర్ణితజలజసంభ
వాండభాండనికాయుండునై వెలుంగు, నట్టిదేవుండు మఱచెనో యార్తజనుల. 142

తే. నరకముల నున్న జనము లెన్నటికి సుగతి, మేలుకాంతురో విన్నప్పటాలనుండి
హృదయసంతాప మారదో సదమలాత్మ, కటకటా నిటలాక్షుండు కరుణలేక.

క. కొందఱు సద్గతులకు మఱి, కొందఱు దుర్గతుల కంపఁ గొంతపదార్థం
బిందులఁ దనకుం గూడునె, యిందుకళాధరువిలాస మేమనవచ్చున్. 144

క. కపటనాటకసూత్రాధికారి శివుఁడు, వసుధలోపల జన్మించువారికెల్లఁ
జిన్మయానంద నిర్మలచిత్త మొసఁగఁ, దనదుబండార మేమైనఁ దఱఁగిపోనొ. 145

మత్తకోకిల. భవ్యవర్తన యిప్పు డొక్కయుపాయ మెన్నితి నిచ్చలో
దివ్యమానులు మీరలందఱు ధీరబుద్ధులుఁ గావునన్
నవ్యవైభవ ముల్లసిల్లఁగ నాదువెంబడి రండు మీ
కవ్యయాధికపుణ్య మబ్బునటన్న వారలు వేడుకన్. 146

ఉ. ఓమునిసార్వభౌమ కరుణోదధి దేవరచిత్తవీథిలో
నేమి దలంచినారో పరమేశ్వరుసాక్షిగ నీదువారమై
యే మది సేతుమన్న విబుధేంద్రుల కిట్లని పల్కె సంయమి
గ్రామణి ధర్మరాజుపురికర్మలఁ జూడఁగ వేడుకయ్యెడిన్. 147

ఉ. ఆపుటభేదనంబు గని యర్కతనూభవుఁ గాంచి కొన్నిస
ల్లాపము లాడి వారలకు లాంఛనముల్ వదలింపకున్న ను
త్తాపముదీఱ దిందులకుఁ దామసమేటికిఁ బోయివత్త మో
తాపసులార యంచుఁ ద్వరితంబుగ యత్నము సేసె నయ్యెడన్. 148

సీ. హృదయకాననపీఠి మదనారి నాసీనుఁ గావించి నిర్మలభావజలము
లారిచి సత్యపీతాంబరం బర్పించి తతపుణ్యదివ్యగంధం బలంది
మహితనిష్ఠాకుసుమంబునఁ బూజించి శమదమతారహారములు పూన్చి
భక్తివిశ్వాసధూపము సమర్పణచేసి పరమవిజ్ఞానదీపము ఘటించి
తే. విమలవైరాగ్యఫలము నైవేద్య మిచ్చి, భూరిదాక్షిణ్యచంద్రతాంబూల మొసఁగి

భవ్యకాంతాతపత్రంబుఁ బ్రబలఁజేసి, యిట్లు సానందుఁ డాత్మలో నీశుఁ గొల్చి.

చ. హర పరమేశ శంకర దయాపర యీశ్వర పార్వతీమనో
హర నిఖిలాండనాయక మహాఫలదాయక విష్ణుసాయకా
సురవరపూజిత ప్రపదశూలవిదారిత దారుణాహితో
త్కర యని ప్రస్తుతించి విశదంబుగ నప్డు నిమీలితాక్షుఁడై. 150

చ. తలఁచినమాత్రఁ బుష్కరపథంబుననుండి మహోన్నతప్రభా
కలితచిరత్నరత్నమయకాంచనభూరిచకచ్చకద్యుతుల్
బలసి దిగంతరాళములఁ బర్వఁగ సర్వజనానురాగమై
వెలసిన దివ్యపుష్పకము వేగమె ముందఱ వచ్చి నిల్చినన్. 151

చ. నిలిచినదాని గన్గొని మునివ్రజ మద్భుతమంది యాతనిం
బలుమఱుఁ బ్రస్తుతించుచు సెబాసు జటీశ్వర నీమహాత్త్వముం
దెలియఁగ నెంతవార మన దివ్యవిమానముమీఁద మీర లిం
పలరఁగ నెక్కుఁడంచు ముదమారఁగఁ దా నధిరూఢుఁడై తగన్. 152

వ. ఇవ్విధంబున సానందమౌనిశిఖామణియు నచ్చటితాపసగణంబులును మహనీయపుష్పకారోహణంబుచేసి వేణువీణాగానస్వరంబులును మంగళతూర్యరవంబులును శివదూతికాపాఠకవిశేషఘోషంబులుగా నొక్కుమ్మడి ఘోషింప వృషభధ్వజంబులు దేజరిల్లం గదలి నభోమార్గంబునం జనుచున్నతదనంతరంబ యయ్యమునిపురవరంబున. 153

సీ. సకలధర్మాధర్మశంకాసమాధానకలితులై మౌనిపుంగవులు దనరఁ
గనుసన్న వలసినపనులు సేయఁగ యక్షగరుడపన్నగభూతగణము గొల్వఁ
గ్రమగానవినోదగతు లుల్లసిల్లంగ గంధర్వు లగ్రభాగమునఁ జెలఁగఁ
గంకణఝణఝణత్కారంబు లెసఁగఁ జారణసుందరులు చామరములు వీవ

తే. మంజుళంబైన ముత్యాలమండపమున, భాసురైశ్వర్య మలర వైవస్వతుండు
హాటకోజ్జ్వలరత్నసింహాసనమున, వేడ్కఁ గూర్చుండి కొలువున్నవేళయందు. 154

సీ. బలుకెంపుదులకింపు పల్లవారుణజటాపటలిపైఁ గాషాయపటము దనరఁ
దళుకారి నునుపారి పెళపెళమను క్రొత్త జింకతోల్ డావంకఁ బొంక మమర
పన్నెలయోగపట్టైన్న జన్నిద మంసభాగంబుపై వింత బాగుఁ జూప
రు విరతప్రసరించు రుద్రాక్షమాలికల్ గళశంఖతలమునఁ గళుకులీన

తే. ఘుమ్మఘుమ్మున వీణారవమ్ము లెసఁగ, జపసరము దండకుండిక చేతులందుఁ
గ్రాలఁ గలహాశనుండు వేగమున వచ్చి, వెలిహజారంబుచెంగట నిలిచియున్న. 155

క. వాకిట చాకిరు లమ్ముని, రాక నెఱింగింప ధర్మరాజు సవినయో
ద్రేకుండై యెదురుగఁ జని, యాకమలజసుతుని గాంచి యతికుతుకమునన్. 156

తే. తనమకుటకోటీర మకరిపాదములు సోఁకఁ, బడమిఁ జాఁగిలి మ్రొక్కి సంపుటకరాబ్జుఁ
డగుచుఁ బూజించి వినుతించి యమ్మహాత్ము, యముఁడు దోడ్తెచ్చి రత్నపీఠమున నునిచి.

ఉ. నారద సంయమీంద్ర కరుణారససాంద్ర పటీరతారకా
సారద శారదాబ్జ పవిపన్నగరాజవియన్నదీశర
న్నీరదవచ్ఛభాంగ మహనీయచరిత్ర మహానుభావ మా
యూరికి మీరు వచ్చుట శుభోన్నతి మించి ఫలించెఁ గోరికల్. 158

ఉ. పావనమయ్యె నాభవము పాత్రుఁడనైతి భవత్కటాక్ష సం
భావన కోమహాత్మ యని పల్కిన సంతసమంది నారదుం
డావనజాప్తనందనునియాస్యము గన్గొని మేలె యాంజనీ
దేవికి నీకు మిత్రులకు దివ్యమునీంద్రులకెల్ల నాప్రభున్. 159

ఆ. మీయనుగ్రహంబు మిక్కిలి మాకును, మేలుగాక క్లేశ మేలకల్గు
స్వామిజగములందు సంచరింతురు గాదె, యందు వింత లేమియైనఁ గలదె. 160

మ. అనినం గద్దొకవింత చెప్పెదను నే వాలింపుమా నీపురం
బునకున్ శంకరమంత్రసిద్ధుఁడు దయాంభోరాశి వేదాంతవే
ది నుదారాంచితసుందరాంగుఁడు మహాతేజుండు సానందుఁడన్
మునినాథుం డరుదెంచుఁ జూడుము సదా మోదంబు రెట్టింపఁగన్. 161

తే. తద్విమానసూత్నధగధగ ద్రత్నకాం, చన నవీనకాంతి చదలఁ బర్వఁ
గోటిసూర్యదీప్తి పాటవంబున మించి, మెఱుఁగులెల్లఁ గదల మెఱయునట్లు. 162

ఆ. వచ్చి తనమహత్త్వ మచ్చు పడంగను, బురముఁ జూచి పాపపురుషబాధ
లణఁచి మహిమ వారి నందఱ శివలోక, గతి వహింపఁజేయు ఘనత మెఱయ. 163

ఆ. మేలు నీకుఁ దలఁచి మేము చెప్పితి మది, పట్టణంబు పాడు పడకయుండ
నిలువబలిమి నేర్పు గలదేని మాబుద్ధి, విని యుపాయ మిపుడె వెదకికొనుము. 164

చ. అన విని విన్నన వ్వొలయ నాతని కిట్లను దేవ మీర లి
య్యనువున నానతియ్యఁ బడుమాటలు భావ్యతగాదు పైని నా
మునియెవఁ డెక్కడెక్కడ విమోచన మేగతిఁ జేయు వీరికిం
బనివడ నీతలం పతనిపాటిమహాత్ములు లేరొకో మహిన్. 165

సీ. వింధ్యాద్రిశృంగము ల్వీఱుగఁద్రొక్కి ప్రసిద్ధివడసిన కుంభసంభవునికంటెఁ
బురహరుఁ డెఱుఁగంగ నఱకాల నొకకన్ను దనకుఁ గల్గన్న గౌతమునికంటెఁ
బంకేరుహాసనప్రముఖుల తారతమ్యము నారసిన భృగుమౌనికంటె
స్రష్టతో వాదించి సృష్టిని బ్రబలఁ జేసినయట్టి గాధేశుపట్టికంటె
తే. సాగరులఁ గూల్చిన కపిలయోగికంటె, వాసవుని శాపమిచ్చు దుర్వాసుకంటె

సానంద—4

శిష్టవర్తనుఁడైన వసిష్ఠుకంటెఁ, దనదుమాహాత్మ్య మెక్కుడే తలఁచి చూడ. 166

క. మాండవ్యుఁడు శాండిల్యుఁడు, గౌండిన్యుఁడు శౌనకుండుఁ గాశ్యపుఁడును మా
ర్కండేయుండును దాపస, మండను లెందఱను లేరె మహిలో ననఘా. 167

ఉ. అంద అటుండనిమ్ము సనకాదులు నీరరవిందసూతికి
న్నందనులై చెలంగి భువనంబులు గొల్వఁగనుండు నట్టిసం
క్రందనముఖ్యులెన్న సుకరంబుగ నుండెద రట్టివార లీ
చందమునం దలంచిన వశంబె యెదుర్కొన మాన్యశాళికిన్. 168

మ. తనకుం దక్కవచూనులే యిపుడు ప్రస్తావంబునం గల్గువా
రనిశంబుం దయలేనిమందమతు లాహా యదేమి ప్రయో
జనముల్లేని విచిత్రయుక్తులకు వాక్చాతుర్యమేలా తపో
ధనుఁ డిప్పాటికి వచ్చెనేనిఁ గని తాత్పర్యంబుతోఁ బోయెడిన్. 169

ఉ. అంతియెకాని చెల్లదిసుమంతయుఁ దా వినఁబూనుకార్య మెం
తెంతలు తాపసేంద్రులు మహీస్థలి భ్రమ్మరుచున్నవార లీ
వింతలు నింతకాలమును నెన్నఁడు చూచి వినంగనోవ మా
కంతువిరోధిదివ్యపదకంజములాన నిజంబుఁ బల్కెదన్. 170

సీ. ఎండమావులనీరు కుండఁ బోయఁగ వచ్చు శేషుని నెత్తిగాఁ జేయవచ్చు
బూడిదఁ దైలంబుఁ బుట్టింపఁగా వచ్చు నవవహ్నికీలలు ద్రావ వచ్చుఁ
దామరతూండ్లచే దంతిఁ గట్టఁగవచ్చు నచలపంక్తులు బంతులాడవచ్చుఁ
... ... ... ... ...

తే. గాన నరకంబునందున్న కలుషమతుల, శ్రీమహేశ్వరులోకంబుఁ జేర్పఁదరమె
దేవదేవుఁ డొసంగు నాదివ్యపదవి, ముట్టి చెఱుపంగ బూడిదబొట్టుగాదు. 171

ఉ. ఆయువు నిండినట్టి మనుజాళులఁగాని మదీయకింకరుల్
పోయి వధింప రన్యులఁ దపోధన నాదెస లేశమాత్రమ
న్యాయముగూడ దెట్టులన నన్ను నెఱుంగరె ధర్మరాజటం
చేయెడనైన నాశల నొకింతయులే కటుఁబోవ నయ్యెడున్. 172

ఆ. ఎట్టివారినైనఁ బట్టి మాదూతలు, దోడితెత్తు రిటకుఁ దోడుతోన
నంతఁ బుణ్యపరుల నరసి పారీకత్తు, చేసిపోవనిత్తు జిష్ణుపురికి. 173

క. కర్మంబు లాచరించిన, దుర్మార్గుల బాధబెట్టి తుదినరకములం
గర్మములు వీడఁద్రోతురు, నిర్మోహస్వాంతులగుచు నెఱి మాదూతల్. 174

క. కావున మదీయరాజ్య, శ్రీవిభవము హానిచేయ సిద్ధునితరమా
దేవ మునీశ్వర యాతని, కీవగ శివభక్తి నెత్తికెక్కెనొ తలఁపన్. 175

తే. పట్టుపసలేనిపనులు చేపట్టఁగా వి,వేకులకునైన మోసంబు రాకపోదు

సత్యసంకల్పుఁడగు హరిశ్చంద్రుఁబట్టి, భంగమొందిన యాగాధిపట్టిభంగి. 176

తే. అనిన మౌళిశిఖామణి యాత్మలోన, నెవ్వ రేగతిఁబోయిన నేమికొఱఁత
యనుచు నూహించి యర్కనందనునిదిక్కుఁ, జూచి దీవించి దిగ్గున లేచి నడిచె. 177

క. సారసచక్రావళి సం, సారసముజ్జ్వలమరందసౌరభలీలా
సారసకల్హారస్థల, సారకనకముఖరి కావిశాలవిహారా. 178

పంచచామరము. జటాపటీలలాటదీప్తచంద్రచిత్రవ్యగ్రతీ
నిటన్న వహ్నికీలకావినిర్జితాంగకాకృతీ
కటస్ఫుటద్భటేభచర్మకంఋకంకధాత్రటీ
పటత్సమాజలాసకానివాసవాదిసన్నుతీ. 179

గద్య. ఇది శ్రీమత్కాళికాంబావరప్రసాదలబ్ధసాహిత్యవైభవ సదాశివస్వరూప సద్గురుచరణారుణరాజీవసేవాసమాసాదితాద్వైతానుభవ కౌశికగోత్ర సుధార్ణవ పరిపూర్ణ కైరవబాంధవ కోట బాఁపనయ్యాసూనుభవ సవినయగుణవిధేయ శివరామనామధేయ ప్రణీతం బయిన సానందోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము




మహిళాధవ శక్రపి
తామహ ముఖ్యామరార్చితప్రపద కళా
ధామవిభూషణ యోగీం
ద్రామరశరువార కాళహస్తిపురీశా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలమునుల, కిట్టులని చెప్పె సూతమునీంద్రచంద్రుఁ
డవ్విధంబున సానందుఁ డరుగుదేర, దివ్యపుష్పకదీప్తులు దిశలు నిండె. 2

సీ. ఉదయశైలేంద్రకూటోదితప్రత్యగ్రబాలార్కబింబసంపద యనంగ
రమణీయనీలనీరదమధ్యవిద్యోతలలితసౌదామినీలతిక యనఁగ
గగనలక్ష్మీహస్తకమలోద్ధురస్ఫురత్ప్రకటమాణిక్యకందుక మనంగ
నుత్తుంగ మేఘవాహోత్తమాంగోత్తప్తమహనీయ తపనీయమకుట మనఁగ
తే. వికచకల్పప్రసూనారవిందకుముద, మల్లికామంజరీజాయమానసురభి
ఘుమఘుమత్కారకలితదిక్కోణ మగుచుఁ, బుష్పకమువచ్చె సమవర్తిపురముకడకు. 3

సీ. భద్రచిత్రవిమానపార్శ్వాంతరోచ్చరత్కల్పప్రసూనప్రకాశితంబు
పరితఃపరీతదర్పణవేదికాచకచ్చకత మోఘ్నస్తంభసంభృతంబు
గనకదండస్ఫురద్ఘనవృషభధ్వజపటపటాత్కారసంపత్ప్రదంబు
కాశ్మీరపాటీరకర్పూరమృగమదక్రముకపర్ణసుగంధగంధిలంబు
తే. వజ్రవైడూర్యమరకతోజ్జ్వలనితాంత, కాంతిసంతానదంతురితాంత మగుచుఁ
గలకలస్వానగంధర్వగానఫణితి, గలిగి శోభిల్లు బహుచిత్రగతులు మెఱయ. 4

ఉ. మందమరుచ్ఛటాచలదమంద సుధారసబిందుబృందము
ల్చిందనకల్పకప్రసవసౌరభశీకలముల్ ఘుగుల్కనం
గుందనపుస్మెఱుంగు లిరుగోపులమించుల సంచుమించ నం
దంద విచిత్రచేలరుచు లంబరభాగ మలంకరింపఁగన్. 5

క. తళతళమను రాకళికలు, దలగడ మిఱుమిట్లుగొలుపఁ దపనీయకళ
ల్దులకింపుచుఁ బుష్పకమం, చలరాఁగని తత్పురంబుజనములు వేడ్కన్. 6

సీ. గోపురాకమణైకగోపురాగ్రంబుల సౌధప్రభామిళత్సౌధములను
సాలోక సాలోక్య సాలోపరిక్షోణి జాలరంధ్రస్థలీజాలములను
గల్యాణతరనూత్నకల్యాణవేదు లారామపుష్పోదయారామములను
రేఖాలసత్పుణ్యరేఖాతలంబుల హారదీప్తి ప్రతీహారములను
తే. నిలిచి తలలెత్తి యనిమిషనేత్రలీల, శమనపుటభేదనావనజనములెల్లఁ
జూచి యప్పుడు దమలోనఁ జోద్యమంది, మట్టుమీఱిన వేడుక లుట్టిపడఁగ. 7

ఉ. చూచితిరే విమాన మదె సూర్యశతప్రభ నుప్పతిల్లెడిన్
లోచనపర్వమై నిఖిలలోకవశీకర శోభనక్రియా
సూచకమై వెలింగెడిని సోముసిదో హరిదో విరించిదో
ఖేచరనాథుఁదో యనుచుఁ గేవలవిస్మయయుక్తచిత్తులై. 8

మ. అటుగాకున్న విరించిసూనుఁడిపు డేకాంతంబుగా రాజుతో
జటిచంద్రుం డిటవచ్చి నారకుల నీశానాధివాసంబునం
బటుసామర్థ్యముతోడఁ జేర్చునని చెప్పం గొంద ఱాలించి ర
చ్చట నమ్మౌని యమోఘవాక్యమహిమల్ సత్యంబులై పోవఁగన్. 9

శా. ఆసానందవిమానరాజ మిది తథ్యంబిట్లు గాకున్న నీ
వాసశ్రేణివిమానపాళికల నీవన్నెల్ ప్రకాశించుటల్
యాసర్వజ్ఞసమానుఁ డైనముని నిత్యానందచిత్తాబ్జలీ
లాసంపూర్ణత నిందు వచ్చుటయె కల్యాణప్రదం బయ్యెడిన్. 10

తే. ఇమ్మహాత్మునిరాక సౌఖ్యమ్ము సుమ్ము, నరకవాసుల నింక మన్మథవిరోధి
లోకవాసులఁ జేయుఁ విలోకనముల, ఘనసుధాధార లొక్కటఁ గడలుకొనఁగ. 11

సీ. ఉష్ణాంశుతీవ్రమయూఖజాలమ్ముల మటుమాయగాని చీఁకటులు గలవె
నానాదిగంతరఝంఝానిలస్ఫూర్తికి విచ్చనిజీమూతవితతి గలదె
జంభారి దంభోళి చటులోగ్రధారకుఁ గుప్పఁగూలని శైలకోట్లు గలవె
జాజ్వల్యమానభీషణకీలికీలల సమసిపోవని కాననములు గలవె
తే. చారుతరమౌనిమంత్రసంస్మరణవలన, నీరుగానట్టి పాతకనికర మేది
గాన నరకంబులందున్నకలుషమతుల, బాధలన్నియు నేఁటితోఁ బాయు నిజము. 12

క. అనుమాన మేల మన మి, మ్మునిఁ జూడఁగ నేమి పుణ్యములు చేసితిమో
మునుపటిభవముల నని పుర, జనములు దలపోయుచున్న సమయమునందున్. 13

క. పరిచారకనికరంబులు, పరువడిఁ జని యమునిఁ గాంచి పల్కిరి దేవా

పరమేష్ఠిసూతిచెప్పిన, పరమమునీంద్రుండు వచ్చె బరఁగినవేడ్కన్. 14

క. నావుడు కంపము భయముక్, భావమునం బెనఁగొనంగ భాస్కరతనయుం
డావృత్తాంతము విని మది, లో వెఱఁగందుచును మిత్రలోకముఁ దానున్. 15

ఉ. ముందఱఁ బింక మెల్ల నొకమూలవసింపఁగఁ జేసి కింకరుల్
ముంగలి వంకఁ గొల్వఁ జని మూఁడుగవప్పును దాఁటి యచ్చటన్
సందడి పౌరలోకముల సందున బొందుగ నిల్చి కాంచె సా
నందు విమాన యానుజననందితసద్గుణబృందు నయ్యెడన్. 16

సీ. కందర్పతులితమంగళవిగ్రహమువాని బాటలస్ఫుటజటాభరమువాని
భస్మాంగరాగశోభావిడంబమువాని రాజీవపత్రనేత్రములవాని
ప్రకటితరుద్రాక్షభవ్యవక్షమువాని దరహాసవదనసుందరమువాని
నున్నతవ్యాఘ్రచర్మోత్తరీయమువాని గటిబద్ధకాషాయపటమువాని
తే. దండకుండీసమేత హస్తములవాని, శంకరధ్యానమానలక్షణమువాని
సన్నికరమధ్యగతపూర్ణచంద్రలీల, మునులలోనున్న సానందమౌనిఁ గాంచి. 17

వ. ఇవ్విధంబునఁ బరివేష్టితసనాతనమౌనిశార్దూలజాలుం డగు దక్షిణామూర్తిచందంబునఁ దాపసజనమధ్యంబునం దేజరిల్లు సానందమౌనికంఠీరవు నయనోత్సవంబుగా సందర్శించి దండధరుండు సాష్టాంగదండప్రణామంబు గావించి ముకుళితకరకమలుండై యి ట్లనియె. 18

చ. శరణం దయాసముద్ర మునిసన్నుతచిన్మయభద్ర సోమశే
ఖరమహనీయమంత్రజపకారణముద్ర మహామునీంద్ర మీ
చరణము లాశ్రయించెదఁ బ్రసన్నుఁడవై మముఁ బ్రోవుమయ్య యో
పరమజటీంద్రచంద్ర భవబంధవిమోచన సాధుసూచనా. 19

క. నాపురికి మీరు వచ్చుట, నాపూర్వవిశేషఫలమునం గాదె గుణో
ద్దీపకృతార్థుఁడ నైతిని, మీపదయుగళంబుఁ గాంచి మించినభక్తిన్. 20

ఆ. మిగులఁ బిచ్చుకుంటుమీఁద గంగాప్రవాహంబు వచ్చినట్టు లయ్యె దేవ
నన్ను ధన్యుఁ జేయ నెన్ని మీ రిచ్చటి, కరుగుదెంచుటెల్ల నఘచరిత. 21

ఉ. తామస మేల రండు ప్రమదంబున మద్భవనంబుఁ జూచి పా
ద్యామలసత్క్రియల్ వడయుఁ డన్న జటీంద్రుఁడు మందహాసముక్
మోమున నంకురింప మునిముఖ్యులుఁ దాను విమానరాజముం
బ్రేమము మీఱఁ డిగ్గినఁ బరేతవిభుండు మహానురాగుఁడై. 22

ఉ. దండితదండహస్త పరతత్త్వవిచారున కిచ్చెఁ గేలు కై
దండగ దండపాణి యలదండిశిఖామణిఁ జూచి వారలు

ద్దండకపుతూపాలంబులును దండకు సందడి మెండుగూడఁ గాఁ
దండిభటు ల్బరాబరి పదంపడి సేయఁగ నేగుచున్నెడన్. 23

తే. భానుసూనునివినయసంపదకు మెచ్చి, యాత్మలో నుబ్బి సానందుఁ డతని కుశల
మడిగి దీవించి మధురోక్తులలరఁ గొన్ని, ద్వారములు గోపురంబులు దాఁటి నడువ.

వ. ఇత్తెఱంగునం దోడ్కొనిపోయి కక్ష్యాంతరంబులం గడచి యేనుఁగుమొగసాలఁ జొచ్చి పోవ నచ్చట ధగద్ధగాయమాన హాటకాంచిత వితానబంధురంబును లంబమానసంతాన ప్రసూనదామాభిరామంబును విద్రుమస్తంభసంభృత శృంగారంబును తప్తజాంబూనద కుడ్యప్రకాశితంబును ముకురపేటికాలంకృతంబును జంద్రకాంతోపలవేదికావిరాజితంబును నిర్మలస్ఫటిక సోపానశోభితంబును నగుచు సాంబ్రాణిధూపధూమఘుమఘుమామోత్కారంబునై చెన్నొందు లోపలి కొలువుకూటంబుఁ జేరి యందు రత్నఖచితకాంచనసముంచితపీఠంబున సానందసూనికంఠీరవుం గూర్చుండఁబెట్టి యర్ఘ్యపాద్యాద్యతిథిసత్కారంబు లాచరించి యచ్చటి తాపస జనంబుల నర్హాసనంబుల సుఖాసీనులం గావించి పూజించి యందఱిచేత ననుజ్ఞాతుండై సప్తసైంధవతనూజాతుండు సుచిత్రపీఠంబున వసియించియున్న ధర్మునిం గాంచి యతిశేఖరుం డిట్లనియె. 25

క. అంభోరుహబాంధవతను, సంభవ నీగుణములన్ని సంయములెల్లన్
జృంభణ మని తెల్పిన విని, శుంభద్గతివచ్చి నిన్నుఁ జూచితి ననఘా. 26

ఉ. వారలు చెప్పినట్లు సరివచ్చె లసద్వినయానురక్తి స
ద్గౌరవలక్షణంబులఁ బ్రకాశతనొందితి వీవొనర్చు స
త్కారములన్ని శంకరుఁడు గైకొనె ధర్మచరిత్ర పెద్దలం
జేరి సపర్య సేయుటలు శిష్టగుణంబులు గావె మేదినిన్. 27

క. కోపప్రసాదభావము, భూపతులకు నైజగుణము బుధజనులెడలం
గోపము పుట్టిన నెంతటి, భూపాలుండైనఁ జెడు నభోమణితనయా. 28

ఉ. రాజసతామసోక్తిగల రాజుల కేడవి తారతమ్యముల్
రాజసలక్షణస్థితి విరాజితధర్మపథంబుఁ జెంద ది
గ్రాజులుమెచ్చు మైపరఁగి రాజ్యము సేసెద వెల్లసీతులన్
రాజుల ధర్మరా జనెడి నామలలామము నీకుఁ జెల్లదే. 29

చ. అనవుడు దండపాణి దరహాసముఖాంబుజుఁడై జటీంద్రుతో
ననియె మహానుభావ భవదంఘ్రిసరోజపరాగలేశ మీ
తనువున సోఁకినంతఁ గడుధన్యుడ నౌదు నటంచుఁ గ్రమ్మఱ
న్మునికులసార్వభౌమునకు మ్రొక్కి నుతించి వినీతి నిట్లనున్. 30

క. శంభునిదివ్యాంశంబున, సంభవ మందితిరిగాదె జగమెఱుఁగఁగ మీ
శుంభన్మహిమలు వొగడఁగ, జంభాహితముఖులకైన శక్యంబగునే. 31

ఉ. నన్నొకపెద్దఁ జేసి మృదునవ్యసుధారసమంజువాక్యముల్
చెన్నలరారఁ దెల్పెదరు శీతకరాంశుని బూర్వజన్మమం
దెన్నికలేనిభక్తి జపియించితిఁ గావున మీశుభాంగముల్
గన్నులఁ జల్లగా నిటులఁ గన్గొనఁగల్గెను దాపసోత్తమా. 32

ఉ. దేవర యేమికార్య మరుదెంచుట కిచ్చటి కానతీవలె
న్నావిని మౌనికుంజరుఁడు నవ్వ మొగంబున నొండుకార్యమున్
భావములోన లేదు విను భానుతనూభవ నిన్ను నీపుర
శ్రీ వివరింప వచ్చుటలు సిద్ధ మబద్ధములాడ మెయ్యెడన్. 33

ఉ. కంటిమి నీమహామహిమఁ గన్నులపండువుగాఁగ నింక ని
ష్కంటకవృత్తి నీపురముఁ గన్గొన వేడ్కపుట్టె నీవు మా
వెంటనె రమ్ము లెమ్మనిన విన్నఁదనంబువహించి కిన్కతో
నంటు పరేతనేత బదులాడఁగఁగూడక మానసంబునన్. 34

క. బాగాయె నారదుం డీ, యోగీంద్రు నిరాకఁ దెల్పె నోహో మును న
ట్లాగరిమనె యిమ్ముని యీ, లాగునఁ బురి పాడువడదలంచె నితండున్. 35

క. పిలువని పేరంటము జను, డెలమిం జనుదెంచునటులు నితఁ డేటికి నిం
దులకు న్వచ్చినకార్యము, దలఁపం దానయ్యె నింకఁ దప్పెం దప్పెన్. 36

ఉ. బుద్ధికి మోస మాకలశభోజనుఁ డిచ్చటఁ జెప్పినప్పుడే
నొద్దిక నిచ్చగించుకొని యూరక మన్మథవైరిఁ జేరి యీ
సుద్దులు దెల్ప నందులకు సూత్రము సేయఁడె యట్టులైన నీ
బద్ధులు చెల్ల నేరవు తపస్వి విచారము ఱిత్తవోవునే. 37

ఉ. నవ్వరె యెవ్వరైన నిఁక నన్నుఁ గనుంగొని వెఱ్ఱియోజనల్
నివ్వటిలంగఁ జేసినపనిం గొన కీతని కుత్తరంబు నే
నెవ్వగనిత్తుఁ జిత్తము నికేమియుఁ దోఁచదు కించపుట్టెనా
మువ్వురకైన మీరుదు రమోఘతపోధను లొక్కవేళలన్. 38

క. మేరువు తృణముం దృణమును, మేరువు సేయుదురు వీరు మిక్కిలి కరుణా
పారీణులయ్యుఁ గోపం, బారయ ముక్కనను దాల్తు రద్భుత మరయన్. 39

క. తపసులు కావున జీవుల, కుపకారము దాల్త్రు ధాత్రి యెల్లరు సూడన్
నెపమిడి యిది మూలముగా, శపియించిన నడ్డ మెవరు చర్చింపంగన్. 40

సీ. అనిమిషాధీశ్వరు నఖిలసంపదలెల్ల క్షీరాబ్ధిపాలుగాఁ జేసె నొకఁడు
శతయాగకృతుఁ డైనచక్రవర్తిని పెద్దచిలువయై పోవఁగఁ జేసె నొకఁడు

వేలసంఖ్యలు గలవీరాదివీరుల నెలచూపులనె భూతి సేసె నొకఁడు
సత్యవాక్యోల్లాసనమధికుం డగుమేటిఁ జెనఁటివాకిటఁ గొల్వఁ జేసె నొకఁడు
తే. గానఁ జక్కెర లొలుకంగఁ దేనె లూర, మాటలాడి రటంచు నమ్మంగరాదు
ప్రీతితో నేస్తకంబు గావించువిధము, లరయ వారితోడ: జర్లాట మాడినట్లు. 41

క. పలుబలుకు లేల నాతని, బలఁ పేగతి యట్లజేసెదను వేఱొండుం
పలఁప నికఁ బాడిగా దని, జలజాప్తసుతుండు మానిచంద్రునితోడన్. 42

క. సంతోషమాయెఁ బురమా,ద్యంతము గైసేయ నిచ్చి యరుగుద మంచుం
జెంతలఁ గొల్చినకింకర, సంతతిచేఁ బట్టణంబు సాటం బనిచెన్. 43

వ. అంత. 44

క. దారుణమై కాలభట, ప్రేరితమై సకలదిశల భేరి ధణధణ
త్కారంబు లడరుకొన విని, పౌరులు కైసేసి రపుడు పట్టణ మెల్లన్. 45

సీ. కుంభికుంభితశాతకుంభహేమస్తంభకీర్ణముల్ గాని వాకిళ్లు లేవు
భూరిముక్తామణీతోరణప్రద్యోతకలితముల్ గాని మార్గములు లేవు
భూయిష్ఠరత్నస్ఫుటరంగవల్లిప్రదీప్తము ల్గాని వేదికలు లేవు
పరితఃపరీతాత్తబిరుదధ్వజాంశుకభ్రమణముల్ గాని సౌధములు లేవు
తే. నవమృగీమదసమ్మార్జనములు గాని, మంటపంబులు లేవు ధర్మప్రభుప్ర
కల్పితాశేషదివ్యశృంగారమంది, రమ్యు లోకవిరాజితరాజధాని. 46

మ. కుఱువేరుంజగజంత్రకొందెలుఁగురంగుల్ మీఱు మేల్బొమ్మచి
త్తరు నంగారు పటాలు నిచ్చలపు నిద్దాకెంపు కాగుమ్మటల్
మరువంపుల్ విరిమల్లెపూసరులు చల్వ ల్జిల్కు పందిళ్లు బం
ధురతం బట్టణరాజమార్గములయందు న్మించుఁ జంచద్గతిన్. 47

సీ. ఏచాయఁ గనుఁగొన్న హిమవారిశిఖరసంప్రత్యగ్రమందిరప్రాంగణంబు
లేవంకఁ దిలకింప హేమాంగకుంకుమ శ్రీగంధగంధలక్ష్మీపథంబు
లెటుఁజూడ దిక్తటోద్ఘటభూరిభేరీధణంధణోగ్రారావనవపదంబు
లేదారి వీక్షింప హేమదండచ్ఛత్రచామరధ్వజకళాసముదయంబు
తే. లెందుఁ బరికింప నందితానందకుంద, మందమందస్మిత శ్రీరమాముఖార
విందరసమందయానావివిక్తచిత్ర, లాస్యసంగీతవినుతకోలాహలములు. 48

వ. ఇత్తెఱంగునఁ బురంబు కృతాలంకారం బైనవిశేషంబు కింకరులు వచ్చి విన్నవింప దండ్యుద్దండకమండలమూర్ధాభిషిక్తుం గనుంగొని విచ్చేయుఁం డనుచుఁ బద్మరాగ ప్రస్ఫురితజాంబూనదపాదుకాయుగళం బొసంగినఁ జరణకమలంబులుం జేర్చి కుతూహలాయత్తచిత్తుండై తాపసోత్తమునకు కంతుమత్తగయుండు నిజభుజాదం

డంబు కై దండగా నిచ్చి ధర్మప్రసంగాదిమానిపుంగవులం దోడ్కొని చిత్రగుప్త ప్రముఖమిత్రపరిజనసమేతుండై నిజస్థానంబు వెలువడి కాహళమృదంగపటహ శంఖమురళినిస్సాణాదితూర్యనిస్వనంబు నింగికిం జెలంగఁ జామరధ్వజశ్వేతాత పత్రంబు లొక్కపెట్ట నిట్టలంబై చుట్టు నేపట్టునఁ జోటు సెట్టుకొన్న వందిమాగధ హృద్యానవద్యగద్యపద్యాభివందనంబులు సందడింపఁ బనిమిన్నవన్నెలబంగరు రంగుమెఱుంగుటరిగె లిరుగడలం గశలుకొని రాజమార్గంబునం బోవుచుఁ బురం బునం గలవినోదంబులు నమ్మహాత్మునకుం జూపుచు నిచ్చలంపుపచ్చలమేల్మచ్చుల మచ్చికలం గ్రొచ్చుకొని యొచ్చంబు లేని మెచ్చులు గని యచ్చొత్తినమచ్చరం బున నచ్చరమచ్చెకంటులనిచ్చనిచ్చలం దచ్చనలాడి కెచ్చులకుం బొంచియెచ్చుగా నెచ్చరించుతులలేనిచెలువుగల యొలజవ్వనంపుచెలువలకు వడికెంపు బోడకెంపు బెడంగుదొడరిన దాడిమచ్చులకుం బొంచి యెచ్చు నెచ్చరించు తులలేనిచెలువుగల కడువన్నెగొప్పచప్పరంపుటుప్పరిగెల నొప్పు గన్న గొప్పులు గుప్పలింపుచుఁ జిలుక పలుకులం బలుకుబెలఁకులు గులకుమెలఁకువగల కలికిపగల చిలకలకొలఁకులును బగ డంపుఁదీఁగెలవగవగలం బొగడువగ జగజంపుఁబూదుగల నెగడు మురువగుజిగిబిగి నగవులజిగిగొని దొమ్మిగా నేమ్మనం ద్రిమ్మఱుతుమ్మెదల ముమ్మరమ్మునం గ్రమ్మి చెమ్మి కయ్యంబునకుం గొమ్ములంజిమ్ము నెఱికురులఁగఱగఱిమెఱుంగులఁ జెఱగొన గరు వమ్మున మఱిమఱిం గెఱలు మన్నెవగలచిన్నెకన్నెలును మవ్వంపుతీఁగెపనిమిన్న సోరణగండ్లదిన్నగావచ్చు పిన్న తెమ్మరలసోఁకునం జిగిలి వగలకు సఖుల గుసగుసల పలుకులు బంగరుమెఱుంగుఁదిన్నెల నెక్కియుం గనుంగొని కొసియాడునమందా నందకందళితహృదయారవిందుం డగుచున్న సానందునకుం గృతాంతుండు తద్వృ త్తాంతంబు లెఱింగింప సముత్సాహాపోహులు లయి విపణిమధ్యంబునం జొచ్చి వచ్చునవసరంబున. 49

ఉ. వాకిటిబెత్తె న్నిలిచి భర్గజటాతటదభ్రవాహినీ
శీకరభంగదావళికిఁ జేవవిచక్షణులై సమస్తవి
ద్యాకుశలత్వమై ఖరివిధాతసమం బనుకొంచు నవ్వుచుం
బ్రాకటవేదశాస్త్రముల భాసిలుభూసురకోట్లఁ జూచుచున్. 50

ఉ. రాముఁడు వీరుఁడైన రఘురాముని కోడునె జానకీవిభుం
డేమఱి పొంచి యేసెఁ బ్లవగేంద్రుని నింద్రునిపట్టి కర్ణునం
గ్రామములోనఁ జేరు తొలఁగం గని పోరెఁ బ్రతాపమేది యా
స్వాములఁ గంచు నవ్వుకొనుక్షత్రియులం గని ప్రస్తుతించుచున్. 51

చ. తనసదనంబున న్నవనిధానము లుండఁగఁ జూచి మెచ్చరే
జనములు యక్షవల్లభుని సమ్మతితో నను మెత్తురంచుఁ దా

రనిచి విపణ్యాళాలలఁ దిరంబుగ నిల్పి సమస్తవస్తువా
హానముల బేర మాడెడిధనాఢ్యుల వైశ్యులఁ జూచి మెచ్చుచున్. 52

క. హాలపాణికైనను హాలా, హాలి పుట్టింపంగఁజాలు హాలలీలల దో
హాలహాళికబృందంబుల, బలముల నీక్షించి హర్షపరవశు లగుచున్. 53

సీ. పులిమీస లొడిసి యగ్గలిక నుయ్యేలలూఁగు గండుమీఱినకోడెదండిమగలు
పందికోఱల దించి పట్టి యిట్టట్టూఁచి దట్టులై ధట్టించు జెట్టిమగలు
హాస్తీంద్రములకొమ్ము లఱచేతఁ గీలించి పేర్చి వెన్కకు ద్రొబ్బు బిరుదుమగలు
కొదమసింగపుఁదోఁక కొనవ్రేళ్ళ బిగఁజుట్టి వదలక పడ రెమ్మువాఁడిమగలు

తే. పసిఁడిసకళాతుప్రాఁబచ్చపసులుగండ, పెండరంబులు మొదలైనబిరుదు లదరఁ
జరణహంసకఝణఝణంఝుణలు మెఱయ, వఱల నిశ్శంకగలవీరవరులఁ గనుచు. 54

క. తెమ్మెరయెమ్మెలఖురములఁ, జిమ్ముచు రవివాహజనవిశేషవిభూతుల్
రెమ్ముచు మీఱినజవనా, శ్వమ్ములఁ గనుఁగొని ప్రమోదసంగతమతులై. 55

క. బెగ్గడిల దిగ్గజంబుల, నెగ్గింపుచు దివిజదంతినెళవునఁ బురిలో
నగ్గలికఁ దిరుగు ద్విపముల, దృగ్గరిమ యెలర్ప గని హసించుచుఁ గనుచున్. 56

మ. ప్రకటశ్రీమహశృంగపత్రహరిణాపద్దారుణోన్నిద్రవై
రికధాతున్ ధరణీధరోన్నతకళారేఖం బ్రకాశించు హా
టక మాణిక్యవిభాపరిస్ఫురితదండచ్ఛత్రకేతుచ్ఛటా
దికలక్షుం దులకించి వచ్చి గొనునం దేరుల్ విలోకింపుచున్. 57

మ. ఘనమాతమ్ములు నేడ నాడఁ జనిరో కల్గం గదా నందివ
ర్ధనముల్ గల్గు శివాలయంబునను గద్దాకాంచనుల్ గద్దు క
ల్గినవారిండ్ల నటంచుఁ బలుక్కుజిగి మేల్మిం బుష్పలీలావధూ
జనముల్ వేడుకకాండ్రతో వెలయు వాచాప్రౌఢిఁ గీర్తింపుచున్. 58

వ. ఇవ్విధంబునం జని యమ్మునిదివివర్గంబు మఱియును. 59

లయగ్రాహి.—

చంచలప్రమించులత లెంచఁదగు సంచలరుచించకల యించుల కలంచి గమకించుం
బొంచుక మదించి నిరసించి జిగిమించి నడసంచు ధరిమించుఁదగనంచు మది నెంచుం
జంచలవిలోకనకళాంచల రహించె ఛళియంచు నుతియించు విటసంచయమటంచుం
గొంచకవసించెననుకొంచుఁ హరించు వెలచంచలదృగంచలల మచ్చికలుగాంచున్.

మ. గమకించం జనుదోయి భారమునసుక్ గౌనెల్ల నాడంగఁ బో
రముగానిద్దపుచెక్కుటద్దములవర్ణస్వర్ణతాటంకదీ

ప్తిమిటారింపఁగ నవ్వువెన్నెలలు గల్పింపం బురి నాట్యవస
ద్మములం జేరు నవోఢలైన గణికాతండంబులం జూచుచున్. 61

మ. గొనబుంబంగరుటందియల్ మొరయ నిగ్గుల్ దేరు క్రొంబైకసి
మిణుకుంగుచ్చలకొంగుజాఱిమగటా మేల్ పెట్టెలుం జీరఁగా
నునుగెంపుల్ జగజంపుకమ్మమెఱుఁగుల్ నూల్కొల్పి దేవాలయం
బునకుం బోవు ప్రసిద్ధవారవికచాంభోజాస్యలం జూచుచున్. 62

మ. అసదుం గౌ నసియాడఁ గొప్పులపయిన్ హారంబు లిట్టట్టు దుం
పెసలాడన్ మణికర్ణపూరములు కంపింపం గటాపారుకుం
దసుమశ్రీలు దిగంతదేశముల సాంద్రజ్యోత్స్నికల్ బూన్ప నా
రసి పూదోఁటల కేగు జారవనితారాజి న్విలోకింపుచున్. 63

చ. పలుచని చెక్కుటద్దములు బంగరు క్రొంజిగి మేనుదీఁగెలం
గలకలనవ్వుమోములును గమ్మని మోవులుఁ గప్పు వెండ్రుకల్
గులుకుమిటారినిబ్బరపుగుబ్బలు లేనడుముల్ చెలంగ వి
చ్చలవిడి వీథులం జనెడి జవ్వనులం గని సంస్తుతింపుచున్. 64

చ. సెలకొని యాత్మనేత్రములసేటు గనుంగొనలేక సిగ్గునన్
జలమును నెమ్మనమునఁ బెనంగొనఁ గుత్తుకబంటినీట న
గ్గలికఁ దపంబు సేసి సరిగాంచక పద్మము లాత్మపంకతం
గలిగెనటంచు నెన్నుకొను కన్నెలమిన్నలచెన్నుఁ జూచుచున్. 65

సీ. జలదముల్కురులతో సాటివ్రానఁగలేక కలువచూపుల సరిగాంచలేక
రేవెల్గుముఖలీలతో వాదు గొనలేక నునుమోవితో బింబ మెనయలేక
చిందంబు కందరాశ్రీ భరింపఁగలేక గిరులు గుబ్బలదీటుఁ బొరయలేక
జఘనముల్ సైకతస్థలులతో సెనగాక ననఁటు లారులమేల్మి గొనగలేక

తే. ధూమమై నీటఁ బడి చిక్కి తుదలఁ బండి, కంధిలోఁ డాఁగి రాగిరై గాలికెగిరి
పట్టులాడ్పంగఁ బడెనంచుఁ బ్రజలు పలుక, నలరువూబోండ్ల వీథినందంద గనుచు. 66

చ. నడుముల సాటిచాలక ఘనంబగు సిగ్గున వీఁగి గండ్లయం
దడవులఁ గోనలన్ గుహల నార్తిఁ జొరంబడెఁ గోడెసింగముల్
శెడలసమంబు గన్గొనక చిల్వలు సేరె రసాతలంబటం
చెడనెడ లోకులెంచఁగ రహించుపడంతుల మేలుచున్. 67

చ. జిగిదళుకొత్తుపల్వరుస చెక్కులచక్కఁదనంబు మేనిడాల్
సొగసుమిటారి చన్నుఁగవపొంకము దాడిమబీజపంక్తులం

దగినమెఱుంగుటద్దముల దట్టపు మించులపైఁడికుండలం
దెగడు నటించు లోకులు నుతింపఁ బురింగల బోంట్లఁ జూచుచున్. 68

శా. మల్లీచంపక కేతకీ వకుళ క్రమ స్ఫారసౌరభ్యముల్
ఫుల్లాంభోరుహకైరవైకసురభిస్ఫూర్తుల్ పటీరావనీ
జోల్లాలిత్యసుగంధముల్ మధుపమాయూరారవంబుల్ విభా
సిల్లం జెన్నగువన్యలం గనిరి సస్మేరాననాంభోజులై. 69

క. రాజీవకుముదకైరవ, రాజీవ భ్రమరవ భ్రరావ భ్రమరీ
తేజఃపరిపూర్ణంబై, రాజిల్లెడు సారసాకరంబులఁ గనుచున్. 70

సీ. కొడిగట్టుటకు నొంటికోనకంబములనంటి నాకలీలాలక్షణములు గాంచి
కూటంబునకుఁ దారి కొత్తళంబులఁజేరి గ్రమ్మునందన మరుద్గతుల కరిఁగి
పొడువుకొమ్ముల నిక్కి తడవి యించుక యెక్కి మిన్నేటిపసిఁడితామరలఁ జిదిమి
గమ్ములై యలంగాల గాపుండి జేజేల సంగీతరసపుష్టిశంకచేసి

తే. ఖటులు విహరింప మణిగణస్ఫారసౌధ, గోపురాట్టాలకధ్వజోద్దీపితద్యు
చుంబితావరణోన్నతిస్తూయమాన, పాటనశ్రీవిచిత్ర మాకోట చూచి. 71

సీ. ప్రాసాదవలన శుంభద్గాఢఘూర్ణణీ ఘూతభూరితరంగ ఘూత్కరణము
రాజీవకూర్మ నక్రగ్రాహఘోరఝంఘాలయనిఖ పెళపెళరవంబు
అతలరసాతలాంతాగాధసంపూర్ణ సర్వతోముఖ కళాసముదయంబు
బంధురోభయదరీ భంగాహతోద్ధూత డిండీర తండోపతండపథము

తే. కనకకైరవ కహ్లార కమల కువల, చక్రచక్రాంగరోలంబసారస ప్ర
భంజన సమంజసవిహార రంజనైక, ధామ పరిఘాలసద్వినోదంబుఁ గనుచు. 72

వ. ఇవ్విధంబునం జని చని వెండియు. 73

మ వినియోగంబుల వారు చేరి నికటోర్విం గొల్వఁగా నిట్టు లా
య్యన సానందుని వెంటఁదోడుకొని చిత్రాలంకృత ప్రాభవా
వనమా పట్టణరాజవీథి యనుచున్ వాక్ప్రౌఢిమైఁ గాలుఁ డ
ల్లన తా నిట్లనె మానితో నగరిలీలాశ్రీలు గాన్పించుచున్. 74

మ. కనుఁగొంటే జటిసార్వభౌమమణి రంగచ్చంద్రశాలాస్థలీ
కనదంభోరుహలోచనా మధురసం గానామృతాసారసే
వనలీలాప్రవణైకతా ప్రవణులై వర్తింపుచున్నార్మనం
బునఁ జివ్వందెగి యిష్టభోగవిభవంబుల్ గాంచు వీరుల్ చుమీ. 75

క. పరికింపు మఱె విచిత్ర, స్ఫురిత మహాసౌధకనకపుత్రీ లీలా
భరితగవాక్షస్థలముల, గురిగాంచిన సోమయాజికులు వారసుమీ. 76

సీ. హేమరంభాస్తంభ దామప్రతీహార నిలయాళి నుండు దాతలబిడారు
మాణిక్య హీరసమంజసాలయరాజి గురుభక్తి విశ్వాస పరులనెళవు
మౌక్తికతోరణమయనికేతనపంక్తి సత్యభాషావిచక్షణులగీము
బంధుర సంగీత భవ్యపద్మశ్రేణి హరిహరసమబుద్ధి పరులతావు
తే. మర్దల శ్రుతి తాళసమ్మర్దనినద, నాట్యకోలాహలోత్సవానందకంద
మందిరంబులు దానధర్మప్రవీణ, మానసుజ్ఞాన సంపన్నమతుల వీడు. 77

మ. గొనబుంచేరులపై మెఱుంగుజిగిరంగుల్ గొప్పతేజీలపై
మిఱుకుందంతపుతోడు పల్లకులపై మేలౌపదార్వస్త్రై కుం
దనపుంగచ్చుల యందలాలపయి నందందం బలారాతిచో
ప్పున వీటం జరియించు భోగపరులౌ పుణ్యాత్ములం జూచితే. 78

క. ఆదరణపూర్వకంబుగ, నాదంపతులుండు వెంట నరుదేరంగ స
మ్మోదాంతరంగుం డగుచు వి, నోదము లరయుచుం దపోధనుం డరుగంగన్. 79

సీ. పుష్పలావీకరాంభోరుహప్రస్థిత పుష్పకసౌరభంబులకుం జెలంగి
ప్రతిపణ్యశాలాప్రభాసమాన కిరీటకన్యకామణుల సత్కళలు మెచ్చి
యెదురుగా రథవాజిమదగజారూఢులై పఱతెంచు భోగానుభవుల కలసి
శుద్ధాంతకాంతా కపోలశీతలగుణ ప్రాహ సంభ్రమమనుద్గతుల కుబ్బి
తే. పటహచటుల ధణంధణార్భటికఠోర, శంఖకాహళకాహళానినాదభాస్వద్వినోద
వైభవైకప్రతిష్ఠలద్వారమహిమ, లరసి కొనియాడు చామౌని యరుగునపుడు. 80

శా. ముక్తాసౌధగవాక్షజాలముల సమ్మోదంబున న్నిల్చి సు
వ్యక్తానోన్యశుకీపికీకలకల స్వైరానులాపక్రియా
రక్తిం బ్రౌఢికి వీణెలంబలుకు ధారాళస్వరస్త్రీలు ప్ర
త్యుక్తుల్ పల్కు మునీంద్రుం జూచి సముదగ్రోత్సాహులై భామినుల్. 81

ఉ. చూచి నవోదయార్కగతి శోభిలు తాపసరాడ్వయాకళా
రోచుల కద్భుతస్థితనిరూఢసుధామధురీధురీవచో
వీచికల న్నుతింపుచు వివిక్తనిరీక్షణలక్షణోత్సవ
శ్రీచతురాస్యలై మఱిమఱిం బ్రవరాంగన లప్డు డుబ్బుచున్. 82

క. కనుంగొని సంయమనిప్రరి, వనితారత్నములు నేత్రవైభవలీలల్
వెనఁగొన నొండొరుం దమలోం, గొనియాడుచు నిట్టు లనిరి గురుతరభక్తిన్. 83

సీ. నిఖిలజగంబులు నేర్పుతోడ సృజించు పుష్కరసూతినాం బోలునొక్కొ
ప్రస్తనిర్మించిన సృష్టి పాలింపంగ విలసిల్లు శ్రీమహావిష్ణుండొక్కొ
శ్రీమనోహరుండు పోషింపంగ లోకము ల్తనయందం దణంచు శైలధన్వియొక్కొ

మూఁడుమూర్తులకుఁ దా మూలమై విస్మయ పరిపూర్ణుఁ డగుపరబ్రహ్మమొక్క
తే. యటులు గాకున్న నిఁక నేరి కర్కసుతుఁడు, సేవసేయంగనోపునే సిద్ధముగను
నారదుఁడు చెప్పినట్టిసానందకాని, చంద్రుఁ డీభవ్యుఁ డంచు నిశ్చయముచేసి. 84

శా. శూలంబున్ గజచర్మమున్ బరశువున్ శుభ్రాంశుకోటీరమున్
నీలాంభోదసమానకంఠమణియు న్నిద్రజ్వలన్నేత్రమున్
వ్యాళస్రాకలాపము ల్హరిణముల్ వర్జించి నానాకృతిన్
వాలాయంబుఁ జరించుశంభుఁడు సుమీ వర్ణింప నీతం డిలన్. 85

సీ. కనకాంగి యీతఁడా గరళకంఠుపదాబ్జ పూజామహోత్సాహభోగవర్తి
నలినాక్షి యీతఁడా నరకవ్యథాఖిన్నలోకావనోత్సవాలోకవర్తి
హరిమధ్య యీతఁడా గురుభక్తి విశ్వాస వినయమోదాకీర్ణ వేదమూర్తి
చంద్రాస్య యీతఁడా సర్వదాభువనప్రశస్తతాపసవంశచక్రవర్తి
తే. యనుచుఁ దమలోన నొండొరు లభినుతింపఁ, బురవరారోహలానందభరిత లగుచు
మించుతట్టల దోయిళ్ళ ముంచిముంచి, సారె ముత్యాలసేసలు చల్లుచుండ. 86

మ. జనువెంటం బురవీథులం జనుచు భాస్వత్పట్టణశ్రీవినో
దము వీక్షింపుచుఁ జూడఁ జూడ మఱియుం గండోపతండంబులై
భ్రమఁగల్పించుపురీవిశేషములకుం బ్రాద్యాద్భుతాన్వితుఁడై
యమునిం గన్గొని పల్కె సంయమివరుం డానందసాంద్రోక్తులన్. 87

ఉ. ఓకమలాప్తపుత్ర సుగుణోన్నత నీపురిరాజవీథులం
దీకరణిం జరింపఁ గనుధోరణిచూచినచోట వెండి యా
లోకనచేసినట్లు మదిలోపల దిగ్భ్రమమంది పల్మరున్
మాకడఁ దోచుచున్న దనుమానము దీర్పుము దాని నేర్పునన్. 88

క. అనవుడు సంతోషంబున, వనజాప్తసుతుండు మౌనివర్యునితోడన్
వినుమని చెప్పం దొడఁగెను, దననగరివిశేషముల నిధానముగాఁగన్. 89

వ. మహాత్మా యిమ్మహాపట్టణంబున సకలధర్మాధర్మ విధినిషేధప్రాయశ్చిత్తనిరూపణం
బుల కాదికారణులగుసంయమిజనంబు లుండుటంజేసి యీనగరంబు సంయమనీపురం
బను నభిధానంబునం బ్రసిద్ధంబయ్యె నిక్కూటకం బిరువదేనులక్షలవిస్తీర్ణంబై
యుండువయోమయంబును రజతంబును మహారజతమయంబును నగుత్ర్యావరణప్రధా
నంబై చెన్నొందుఁ బూర్వపశ్చిమోత్తర దక్షిణదిగ్భాగంబుల మరకతసువర్ణ
దుర్వర్ణాయః ప్రకల్పితవర్ణంబులు దేజరిల్లుఁ దత్తద్గృహద్వారంబుల నాలుగుగోపురం
బులు ప్రకాశమానంబులయి వెలుంగుచుండు నదియునుంగాక యిప్పీటికి లక్షయుం
దొమ్మిదివేల ప్రధానద్వారంబులు నొక్కొక్కవాకిటిముందర నొక్కొక్కగోపు

రంబును నవరత్నకీలితంబులై యలరారు నాలుగులక్షలుం బదియాఱువేలు రాజమార్గంబులును డెబ్బదియైదువేల శివాలయంబులును నన్నియుం విష్ణుస్థలంబులునుం గలిగి దశసహస్రకోటి వీరకింకరవర్గంబుచేతం బరిపాలితంబై రాజిల్లు నీరాజధానికిం బశ్చిమదిగ్భాగంబునం గోటిసూర్యప్రకాశంబై దగద్ధగాయమాన కనత్కనకగోపురంబున హాటకాచలంబుతో మేలంబులాడుచున్నదని యమ్మహాగోపురద్వారంబునకుం దాపసాగ్రణిందోడ్కొని వచ్చి యచ్చటి పురుషులంజూపి వీరలు సకలధర్మస్వరూపులు దేహాంతంబున దేహంబులు విడిచి సుకుమారదివ్యమంగళవిగ్రహంబులు గైకొని దివ్యమాణిక్యప్రభాభాసమానకాంచన సమంచితవిమానంబులపై నెక్కికొని మదీయకింకరు లత్యంతసంభ్రమంబునం బరిచర్య లొనర్ప విద్యాధరగంధర్వకామినీజనంబులు తానమానంబులు వినిపింప భూరిభేరీమృదంగకాహళ శంఖనినాదంబులు చెలంగం బరమోత్సవంబున మహనీయగోపురంబుం జొచ్చివచ్చియచ్చటం దప్తచామీకర సుందరదివ్యమందిరంబుల భాసమానకాంచన ప్రాసాదంబుల ధర్మనిర్మితహర్మ్యంబుల హిరణ్మయగణ్య వేదికాసముదయంబులం గల్యాణసత్కల్యాణమండపంబుల సాంద్రతరసౌవర్ణ చంద్రశాలాతలంబుల శాతకుంభరంభాస్తంభసంభృత సౌధంబుల హైమకాసారతీరంబులం గనకమయస్థలంబుల యథేచ్ఛవిహరింపుచు హేలామహనీయడోలికా జాలికాజాలంబుల నుయ్యాలలూగుచు బర్హిర్ముఖపద్మముఖులతోడం గ్రీడింపుచు గంధర్వగంధసింధురగమనాబంధురసంగీతలాస్యంబులం బ్రొద్దుపుచ్చుచు సర్వాభీష్టంబు లనుభవింపుచు।సుఖోపవిష్టులై చెడనిపదవులం బరితృప్తిం బొందియుందు రనుచు సానందమునిపురందరుం డానందభావంబున సప్తసైంధవనందనుంగని ధరణీతలంబున నీపుణ్యపురుషు లేమేమివిశేషంబులు సేసిరి మాకుం దేటపడ నెఱింగింపుమనిన నమ్మునిశిరోమణికిం దరణిజుం డిట్లనియె. 90

క. వాపీకూపతటాక, స్థాపన మహనీయదానధర్మాత్ములు వి
ద్యాపరతంత్రులు సత్యా, లాపవిచక్షణులు ధైర్యలక్ష్మీదక్షుల్. 91

తే. సమపదంబునం బితృతర్పణములు పర్వ, కాలములం జల్పి పరమవిఖ్యాతిం జెంది
నిత్యనైమిత్తికాచార నిరతు లగుచు, మనినధన్యులు పరమపావనులు వీరు. 92

క. కయ్యము నందడి గని పిఱు, తియ్యక తన్నెలుదొర నుతింపఁగ రిపులం
జయ్యన బోరిగొని వచ్చిన, యయ్యుత్తమమతులు వీర లనఘచరిత్రా. 93

సీ. ధనము సంపాదించి ధాన్యంబు ఘటియించి దుర్భిక్షవేళలం దొంటిధరలు
వదకుండ మునుగొన్నపద్ధతి నమ్మించె నరులపాలిటి కల్పతరువనంగం
గొనియాడంబడి తూము గుంచంబు వాడుకపడి పెద్దసేయించి యడుగు పేద
సాదుల కప్పిచ్చి శత్రులకేనియు నుపకార మొనరించి యొరులనొవ్వం

తే. బలుకకను గొన్ని వారికిఁ గలిగినట్లు, యన్నపానాదు లిచ్చి ధర్మైకబుద్ధి
శిష్టవర్తులకు సేవచేసి పుడమి, మనిన పుణ్యులు వీరలో మునివరేణ్య. 94

మ. సఖులం బ్రోచిన పుణ్యవర్తనులు భాస్వద్యజ్ఞకర్మవ్రతుల్
నిఖిలప్రాణులపైఁ గృపారసము గాన్పింపంగ వర్తించువా
రఖిలేశాంబుజ దృక్పురాణములు నిత్యంబాడు ధన్యాత్ముల్
శివపూజాపరతంత్రు లేకవనితాశీలవ్రతాపాదయుల్. 95

క. దేవాలయంబు లూడిచి, శ్రీవెలయఁగ జలము చల్లి శివు బూజింపఁ
బూవులు దెచ్చినభాస్వ, ద్భావులు వీరలు మహానుభావ మునీంద్రా. 96

సీ. కొల్లాపురము కుంభకోణంబు కమలాలయము వృద్ధకాశి చిదంబరంబు
కాశి గోకర్ణంబు కాంచీపురంబు శ్రీశైలంబు వేంకటాచలము కాళ
హస్తి యహోబలం బాదివరాహంబు రామేశ్వరంబు శ్రీరంగనిలయ
మరుణాచలంబు వేదాచలంబు జనార్దనంబు శ్రీవైద్యనాథంబు మధుర
తే. జంబుకేశంబు మధ్యార్జునంబు మర్త్య, భూతపతిగిరి మొదలైన పుణ్యతలము
లర్థి సేవించి మిగులఁ గృతార్థులైన, ధన్యచరితులు వీరలు తాపసేంద్ర. 97

సీ. పావకజ్వాలలఁ బడకుండఁ బ్రాణులఖేదంబు మాన్పి రక్షించువారు
చంపఁ దెచ్చిన వారిచావు దప్పింపఁ జేపట్టి రొక్కము దెచ్చి పెట్టువారు
పన్నగగ్రాహికిఁ గొన్నిరూక లొసంగి ప్రాణులచెఱ వడిఁ బాపువారు
మండువేసవి నీళ్ళ కుండలతో ముంచి పసులకుఁ బోసి కాపాడువారు
తే. గలిగెఁ బుణ్య మటంచుఁ బాపలకు మాపు, తగినశయనంబు లిచ్చు నుదారమతులు
బుడమి జేజేల దీనత్వ ముడుపుపుచులు, మొదలు గాఁగలవార లీపుణ్యధనులు. 98

సీ. ఒక్కపిప్పలవృక్ష మొక్కటిపిచుమంద మొక్కవటోర్వీజ మొక్కబావి
దశతింత్రిణీవసుధారుహంబులు బిల్వతరువులు మూఁడుచూతములు నాలు
గైదుశిరీషచెట్టు లటమూఁడువెల్లమ్రాఁకులు మూఁడు నీరీతి వెలయుతోఁపు
లీడేర్చి బాటల నెండకాలంబులఁ జప్పరంబులు గట్టి జలము వోసి
తే. నట్టిపుణ్యులు కన్న సౌమ్యంత యొసఁగు, నిస్పృహులు రిక్తజనజీర్ణనిలయచయము
లుద్ధరించినవారలు బుద్ధిలోన, నన్యకాంతల దల్లిమర్యాదగాఁగఁ
దలఁచు సుగుణులు వీరలు ధర్మచరిత. 99

క. ఒడలు గడిగించువారలు, విడువక శివుమ్రోల నాట్యవిధి సల్పినవా
రుడురాజశేఖరునకుఁ, గొడుగులుఁ బడగలును బట్టు కుశలస్వాంతుల్. 100

తే. గంగ కేదారతీర్థము ల్గడియ వలయు, దనువుగలిగిన ఫలమంచుఁ దలఁచి తలఁచి
తీర్థవాసులఁ గొంచు నాతిథ్యపూజ, సేయు పుణ్యాత్ములు వీరు శిష్టభావ. 101

క. గయలోఁ బితృదేవతలకు, నియతిం బిండంబు వెట్టు నిర్మలచిత్తుల్
భయమంది శరణుచొచ్చిన, దయఁ బగతుఁ డైనఁ బ్రోచు ధర్ములు వీరల్. 102

సీ. కార్పాసశయనంబు కంబళిదానంబు మహిషదానంబు నామలకదాన
మజదాన మార్ద్రకృష్ణాజినదానంబు లవణదానంబుఁ దల్పప్రదాన
మంబరదాన మయఃఖండదానంబుఁ దైలదానంబు విద్యాప్రదాన
మాషదానంబు కూష్మాండదానం బిక్షుఖండదానముఁ గలకండదాన

తే. మాభరణదాన మఖిలఫలైకదాన, మాజ్యదానంబు గుడదాన మంబుదాన
మవని తాంబూలదానంబు లాదిగాఁగఁ, జేయు పుణ్యాత్ములు వీరు శిష్టభావ. 103

క. ఎలమి న్నిరతము మోదుగు, పులియలలోఁ గుడిచినట్టి పుణ్యాత్ములుం
బులికిని లోఁపడు ధేనువు, నలిఁ బడకుండఁగఁ గాచిన మహాధీరుల్. 104

వ. ఇత్తెఱంగునఁ గొన్ని విశేషంబు లెఱుంగం జెప్పి యచ్చోటు వెడలి యల్లచోఁ బురోభాగంబున నుత్తరద్వారంబున సుధారాశియుంబోలె ధాళధళ్యప్రభావిరాజమానంబై కోటిచంద్రమండలంబుల బెండువడం జేసి కైలాసశైలసంకాశంబై వెలుంగుచున్న దని యమ్మహారజతగోపురద్వారంబు దాపునకుం దోడ్కొనిపోయి యచ్చట వసియించియున్న పుణ్యాంగనలం జూపి యీయోషారత్నంబులు పతివ్రతాత్వవిశేషంబుల మెలంగి ప్రాణాంతరంబునం దత్కళేబరంబులు ధరణీతలంబునం దిగనాడి దివ్యసుందరశరీరంబులు గైకొని దివ్యగంధంబులు దివ్యమాల్యంబులును దివ్యాంబరంబులు దివ్యభూషణంబులును ధరియించి యగ్నియుంబోలెఁ దేజరిల్లుదివ్యపుష్పకంబుల నెక్కి గరుడకిన్నరచారణయక్షగుహ్యకరాజీవనేత్రలు ఛత్రచామరధ్వజవ్యజనంబులు వేయ మహావైభవంబులఁ జెలంగి తమతమపుణ్యంబులవలన నిజనాథుల నధోగతిం బడకుండ సముద్ధరించికొని యమ్మందిరద్వారంబు సొచ్చి వచ్చి యచ్చటం గల్గురజితరాజితప్రాసాదంబులరజతమంటపరచితరుచిరాగారంబులఁ గాఁపురంబులు సేయుచు సుగంధబంధురపద్మాకరంబుల జలక్రీడలాడుచు మృదులతాంతశయ్యాతలంబులం బవ్వళించుచు ఘుమఘుమంఘుమాయమానోద్యాన వనంబుల విహరించుచుఁ గలకంఠ నీలకంఠ శుకశారికాచంచరీకసంచారనినదబృందంబులనానందించుచుఁ గిసలయకుసుమలతాగారంబుల నివసించుచుఁ గాశ్మీరకర్పూరపాటీరహరిద్రాసంకలితపంకాంగరాగంబుఁ జెన్నొందుచు సిద్ధవిద్యాధరమత్తకాశినులతో నెత్తములాడుచు వేణువీణావినోదమ్ముల మోదించుచుఁ బ్రాణవల్లభులఁబంచభల్లక్రియాకలాపంబుల గాఢాలింగనంబుల సుధామధురాధరపానంబుల దశవిధచుంబనంబులఁ జిత్రబంధంబులఁ గలంచి మెప్పించుచు నిర్విఘ్నంబునం . దరుణులవలన శాశ్వతైశ్వర్యంబు లనుభవించుచు మన్మథసామ్రాజ్యం బేలుచుఁ గాలంబు

గడుపుచు నిమ్నహోస్థలంబులం బెంపొందుచుండు రవిగ నీసుందరీజనంబు లవనీతలం
బున నేమేమి సుకృతంబులు చేసిరి వివరింపు మనిన నయ్యతిశిఖామణికి ద్యుమణి
నందనుం డి ట్లనియె. 105

చ. అనలముఖంబున న్వెడలునట్టి లతాంగిని గాంచి తద్వరుం
డనిశము ఘోరపాపరతుఁ డైన నడంచి మఱియు కింకరు
ల్మనమున భీతి గ్రమ్మఁగఁ బలాయితు లౌదు రనంతరంబ త
ద్వనిత నిజేశుఁ గూడుకొని వచ్చు విమానవిచిత్రయానయై. 106

తే. కాన నుత్తమధర్మంబు కంజముఖికిఁ, నాత్మనాథుండు మృతిఁ బొందు నవసరమున
వహ్నికీలలదేహంబు వదలవలయు, నింతకన్నను ధర్మంబు లెవ్వి సలికి. 107

వ. అట్లయినఁ బ్రాణేశ్వరువంశంబు పదునాలుగు తరంబులవారి జననివంశం బేడుత
రంబులవారి సముద్ధరించుం గావున నిచ్చటిమచ్చెకంటుల సుకృతవిశేషంబులు
గొన్ని వివరించెద నాకర్ణింపుము. 108

మ. పురుషుం డీల్గిన వేదనం బడక సత్పుత్రాదిమిత్రుల్దనుం
బరివేష్టించి యనేకవైఖరులఁ జెల్వ న్వారి నూరార్చి త
ద్వరునిన్ మానసవీథి నిల్పికొని దుర్వారజ్వలజ్జ్వాలికా
స్ఫురదగ్ని న్నిజదేహము ల్వదలు నీపూఁబోణులం జూచితే. 109

సీ. కలనైన మగనివాక్యము జవదాఁటక వరునిఁ బ్రత్యక్షదైవముగ నెంచి
ప్రియుఁ డారగించిన పిదపఁ దచ్ఛేషాన్న మింపుమీఱఁగ భుజియించి పరులఁ
దలయెత్తి చూడక యలుగక నాథుతో నెదురుమాటాడక యిష్టబాంధ
వులఁ గలకొద్దిలో నుపచార మొనరించి చిత్తేశుచిత్తంబు చెలఁగ మెలఁగి
తే. యిరుగుపొరుగుల కేగక యెల్లవారుఁ, దగ నుతింపంగ మని మనోధవుఁడు నిర్గ
తాసుఁ డయినను దక్షిణ మనలశిఖల, దనువు దిగనాడినట్టి సుందరులు వీరు. 110

ఉ. అత్తల మామల న్మగల నన్నలఁ దమ్ముల వందనీయులం
జిత్తము నొవ్వఁ బల్కక విశేషగుణంబుల రూఢికెక్కియ
త్యుత్తమవృత్తి నాథు మనముబ్బ సపర్యలు సేసి మేలముల్
చిత్తజుకేళి దక్క మఱిసేయక వర్తిలు మత్తకాశినుల్. 111

సీ. ప్రాణేశుఁ డారగింపక మున్నె యెన్నఁడు భుజియించుటకు బుద్ధిబుట్టనీక
పతిదను నిందింపఁ బ్రాల్మాలి కింతయు లేక కోపంబును లేక మగుడ
నాథుండు మేలుకొనక మున్నె మేల్కాంచి నిత్యకృత్యంబులు నెరయఁ దీర్చి
వివిధమంగళ సమన్విత గాకమున్నె తద్వల్లభుఁ గదియఁ బోవంగ నోడి
తే. తనదుచాతుర్య మింతైన ధవునియెదుటఁ, జూపనొల్లక మగని కసూయలేక

సొమ్ము లేదని పలుమాఱు జోలి యిడక, మఱి సమానేక్షణలు వీరు మునివరేణ్య.

సీ. పరదేశ మేఁగిన పతిరాకఁ గోరుచుఁ గించిదలంకృతిఁ గొంచెపఱిచి
యటు లున్న తఱి పతి యరుదెంచె నని చెప్ప మునుముతో వాకిటి కెదురుపోయి
పదముల నీళ్లార్చి భవనంబునకుఁ దెచ్చి విశ్రమింపఁ జనమర్చి వివిధరుచులు
పుట్టఁగ వంట గొబ్బునఁ జేసి స్నానంబు సేయించి పిదప భుజింపఁ బెట్టి

తే. భోజనంబైనవెనుక తాంబూల మొసఁగి, పఱపు సవరించి విభుఁడందుఁ బవ్వళింపఁ
బాదపద్మంబు లూరుల పైని జేర్చి, యొత్తి పతిసేవ గావించు నువిద లనఘ. 113

తే. ప్రాణనాథుండు సంతోషపడినయెడల, సంతసింతురు విభుఁడు సంతోష మెడలి
యున్నవేళల సంతోష ముడుగు వికచ, లోచనలు వీరు తాపసలోకవర్య. 114

తే. ప్రాణనాయకుమిత్రులఁ బ్రాణసఖులు, గాఁగ మది నెంచి విభునకుఁ గానివారి
నోరగింపుచుఁ గనుఁగొని యుర్వి మనిన, మానినీమణు లార్యసమ్మతవిచార. 115

క. పురుషుఁడు గడపిన వ్రతముం, బరమం బని సలిపి యతని పల్కులు నిగమా
వరము లనియుఁ దలపోయుచు, వరునకు శుశ్రూష సేయువారణయానల్. 116

తే. విభుఁడు కోపించువేళల వెగడుపడక, చిత్తచోరునిపర్యంకసీమదాపు
భూమిపైఁ బవ్వళించి స్వస్వామికరుణ, జెందఁగోరిరి వికచరాజీవముఖులు. 117

తే. చెఱఁగుమాసిన నాల్నాళ్లు జరుగనిచ్చి, స్నాన మొనరించి ధౌతవస్త్రంబుగట్టి
తగ నలంకారములు దాల్చి ధవునిమోముఁ, గాంచకన్యులఁ గనని శృంగారవతులు.

క. చిత్తేశుఁ డన్యవనితా, యత్తుండై యున్నఁ బ్రియంబులు దగఁ బ
ల్లెత్తుం బల్కక యెప్పటి, చిత్తములోఁ భక్తిఁగలిగి చెలఁగిన పఁణతుల్. 119

ఉ. రామవిశాలవైఖరుల రంభ యనందగి నాథుకార్యమం
దేమఱ కిష్టమంత్రి తెఱఁ గేర్పడ భోజనవేళ మాతృవో
భామహితంబు సేయుచుఁ గృపన్ రతితంత్రము వారకామినీ
శ్రీ వెలయంగఁ దాల్చి పతిసేవ నరుంధతిఁబోలు భామినుల్. 120

క. గౌరీవ్రతంబు లక్ష్మీ, చారువతీవ్రతము సారసప్రభుచంద్రా
చారవ్రతములు నోములు, వారక సల్పినసరోజవదనలు వీరల్. 121

క. ఇందుధరమందిరాంగణ, మందముగా నలికి ప్రూసి యందు విచిత్రా
నందకసలీలముగ్గులు, పొందుగ సవరించుచుట్టి పుష్కరనేత్రల్. 122

క. గంగాధరుఁ డూరేగిన, మంగళహారతు లమర్చి మంగళములు పా
డంగలిగిన పుణ్యాంగన, లంగంటే దివ్యమంగళప్రదమూర్తీ. 123

వ. అని యోషిద్ధర్మంబులు ధర్మం డెఱింగించి యచ్చోటు నెడబాసి ముందర పూర్వ
ద్వారగోపురంబున స్తవనీయనవరత్నప్రభాచకచ్చకిత కాంతిసంతాన దంతుర

కమలంతంబై త్రివిక్రమావతారుండైన విష్ణువైభవంబున విష్ణుపదంబు నొరయుచు సకలకళాపరిపూర్ణంబై బ్రహ్మాంబు తెఱంగున వెలుంగుచున్నదని యద్దివ్యగోపురంబుచెంతకుం దోడుకొనిపోయి యచ్చో విహరించుచున్న పుణ్యాధనులం జూపుచు వీరలు బుద్ధిమంతులు మరణసమయంబున మోహాబంధంబుల విముక్తులై మోహన దేహంబులు ధరియించి వజ్ర వైడూర్య మరకత పుష్యరాగ కీలిత హాటక కిరీట గ్రైవేయ మకరకుండల కేయూరహార కంకణాంగుళీయకమండన మండితులై పీతాంబర పరిధానులై సుగంధబంధురచందనాగరు కర్దమాదిలేపన ఘుమఘుమచ్ఛరీరులై నిజాంగదీప్తులు దిక్కులం బిక్కటిల్ల మహోత్సాహులై దివ్యదుందుభిధ్వానంబుల దిక్కుంజరంబులం జెవుడుపఱుచు నవ్య మాణిక్యమయ విమానారూఢులై వ్యోమపదంబునం జనుదెంచు నవసరంబున గంధర్వచందన గంధులు చారణచారుముఖులును నాగనాగేంద్రయానలును విద్యాధరహరిమధ్యలును యక్షరాజీవాక్షులును కిన్నరసుందరాంగనలును గీర్వాణవీణాకంఠులును సముత్క్రాంతాకుంఠితవిభవంబుల నెదుర్కొని యుడిగంబులు సేయం జెలంగి యరుగుదేర నాసేయు సముచితాసారంబుల కానందకందళితహృదయారవిందులై వారలిమ్మహాగోపురంబు సొచ్చి వచ్చి యచ్చట మరకతసోపానవిరాజితమంటపంబుల వాసవోపలభాసుర స్తంభగుంభిత చిత్రవస్త్రవితాన నవీనముక్తామణి తోరణాలంకార ప్రదీపిత సుధామయసౌధంబుల వజ్రమయసాలభంజికామనోరంజన వాతాయనాయాత శీతల వాతపోతసంకర్షిత నికేతనంబులం దుహినకరకాంత వేదికాప్రదేశంబుల సకలపరిమళమిళిత పుష్పదామంబులం బుండరీకనీలోత్పల షండమండితమరాళ క్రౌంచరథాంగసంగతశృంగార సరోవరంబుల నందంద నందడిం దిరుగులాడుచు భోగహంసయానలతోడం బుంభావసంభ్రమసంభోగంబుల భోగించుచు నవ్యయసౌఖ్యంబులఁ దనివిదీర సుఖియించుచున్నవారలనినఁ దనమనంబున విస్మయ సంభ్రమంబులు పెనంగొన మునివరుం డర్కసూనుం గనుంగొని. 124

క. ఈసజ్జను లేపుణ్యముఁ, జేసిరి భూలోకమందుఁ జెప్పుమనుడు నా
భూసురలోకేశుం గని, యాసూర్యకుమారుఁ డిట్టు లనియెన్ బ్రీతిన్. 125

సీ. అరుణోదయంబున కటమున్నె లేచి సద్విధిశివస్తోత్రము ల్విష్ణుస్తోత్ర
ములు స్వయంభువునామములఁ బఠియించుచు బైశుపతుల మహాభాగవతులఁ
బిలఁచుచు పుణ్యతీర్థంబులు నొడువుచుఁ గాశ్యాదిదివ్యనగరములెన్ని
సీతాత్రిముఖపుణ్యశీలల నుతియించి భాస్కరప్రభృతుల భజనచేసి
తే. తపనుఁ డుదయింప విహితకృత్యములుదీర్చి, పూతచేతస్కులై మనభూమిజనులు
ఇమ్ముగనుఁగొని పాపబంధములవలన, ముక్తులగువారు వీరలు సుఖ్యచరిత. 126

సీ. మాఘకార్తిక ముఖ్యమాస దినంబుల స్నానంబుఁ జేసిన శాంతనిధులు
చాంద్రాయణవ్రతాచారంబు వదలక సల్పిన పుణ్యవిజ్ఞానపరులు
నాకాల మీకాల మనక భుక్తంబులు నిత్యంబు గావించు నియతరతులుఁ
దగ జరావేళలఁ దల్లిదండ్రుల కుపచారంబు లొనరించు చారుమతులు
తే. సత్యమెన్నండు విడువని సారమతులు, శీలమెప్పుడు గల్గువిశేషధనులు
ప్రమదలకు మర్మమియ్యని ప్రమదమతులు, నవని దైవసహాయు లైనట్టిజనులు. 127
సీ. గంగలో స్నానంబు గావించుపుణ్యులు గౌతమీనదిఁ గ్రుంకు కలుషహరులు
కేతకీనది మునింగిన శుద్ధచిత్తులు యమునావగాహను లైనఘనులుఁ
దనువుఁ బ్రయాగఁ ద్రోచిన కృతకృత్యులు పెన్నిధానముఁ జేయు పృథులయశులు
కావేటిసేటి సంగముఁ ద్రోచుభవ్యులు నర్మదాంభఃకేళి నడుపు బుధులు
తే. నిందుసూర్యోపరాగంబులందు జలధి, మజ్జనం బాడు దానధర్మప్రవీణు
లంబురుహమిత్రుఁ డుదయింప ననుదినంబు, బాహ్యతీర్థాభిషిక్తులౌ భాగ్యయుతులు.
క. ఏకాదశీవ్రతస్థులు, శ్రీకందరు సోమవారలశీలస మేతుల్
శ్రీకృష్ణాష్టమి పితృతిథు, లేకాలము నడుపునట్టి యిద్ధచరిత్రుల్. 129
సీ. కమలాప్తునకు నమస్కారము ల్పండ్రెండు నిరతంబుఁ గావించు నియమపరులు
నొరులధర్మంబున కుత్సాహ మొందిన పరమకృపావేశభావనిధులు
మదమత్సరంబులు హృదయసీమలమాని బుధులెన్నవర్తిల్లు పూతమతులు
గౌరీశ మాధవాగారంబులకుఁ బోయి దండము ల్వెట్టిన తత్త్వవిదులు
తే. కలిమి స్థిరమని నమ్మక కలిగినపుడు, గుప్తదానంబు సేసిన కుతుకరతులు
హరిహరాత్మక మగుకృతియందుకొన్న, చిరయశోనీతిమంతులు సిద్ధవర్య. 130
తే. దైవపితృకార్యములు దక్క దక్కుతిథులఁ, బిండివంటలు మొదలుగా వండిరేని
సదమలాత్ముల కిడ కేకసాక్షిగాఁగ, భక్షణము సేయనొల్లనిభవ్యమతులు. 131
పంచచామరము. ఆలేఖము ల్పొసంగఁ గట్టి యంద్ను సత్పురాణముల్
వెలుంగ వ్రాసి శిష్టులైన విప్రపంక్తి కిచ్చువా
రలు న్మెఱుంగుటుంగరా ల్వరాలఁ బట్టుచీరెలుం
గురుప్రవర్యు లెన్నినియ్యఁ గోరుపుణ్యవర్తనుల్. 132
క. పట్టిన సద్వ్రతము ల్వద, మట్టినఁ బాటించి విఘ్నములు గాకుండ
న్నెట్టన నుద్యాపన మెదఁ, బట్టిన వేడుకలఁ జేయు పుణ్యాఢ్యనుల్. 133
ఉ. కపటము లేనివా రొరులకల్మి కసమ్మతి బొందకున్నవా
సకృతి సేయు సాధుజను లుత్తమచిత్తులు నిత్యపూజ్యులౌ

కృపణులఁ బ్రోచువారలెడఁ గీడుఁ దలంపనివారు మంత్రముల్
జపములు సల్పువారు విరసంబులు మానిన నీతికోవిదుల్. 134

తే. కుతపవేళల వాకిటఁ గొంత సేపు, నిలిచి యతిథులు వచ్చిన నిలయములకుఁ
దోడుకొని వచ్చి కాళ్లకుఁ దోయమిచ్చి, పఙ్క్తిభుజియింప బెట్టిన ప్రమదమతులు.

మ. అని యీచందమునన్ దివాకరసుతుం డమ్మౌనితోఁ గొన్ని పు
ణ్యనిధానంబు లెఱుంగఁ జెప్పి మఱి సానందు న్విలోకించి యి
ట్లనియెన్ మత్పుటభేదనంబునకు ముఖ్యద్వారము ల్నాల్గుఁ జ
య్యనఁ గన్గొంటిరి మూఁడు దిక్కులు విలాసాయత్తచిత్తంబునన్. 136

క. దక్షిణపువాకి లింకన్, వీక్షింపం దగవు గాదు వినుఁడు మదాజ్ఞన్
శిక్షింపంబడు పాపుల, కాక్షోణీతలము నిలయ మనఘచరిత్రా. 137

క. అది దుస్తర మది ఘోరం, బది దుర్ఘట మది మహోగ్ర మది సంతాపం
బది దుష్ప్రేక్ష మది దుర్భర, మది దుస్సహ మది కఠోర మది దుఃఖదమున్. 138

క. చనరా దది వినరా దది, మనమునఁ దలపోయరాదు మఱపున నైనన్
గనరాదు మిమ్ముబోటుల, కనఘాత్మా దుర్నిరీక్ష్య మది దుర్గతులన్. 139

వ. అందు బ్రహ్మఘ్న శివఘ్న పశుఘ్న స్త్రీఘ్న గర్భఘ్న మిత్త్రఘ్న కృతఘ్న ప్రభృతి క్రూరచిత్తులును నిగమద్వేషులును నీలకంఠ దూషకులును విష్ణువిరోధులును విశ్వాసఘాతుకులును సకలఘాతుకులును స్వామిద్రోహులును మొదలుగాఁగల దుష్కర్ములు త్రుటికాష్ఠానిమేషకాలంబులైనం గాని నిలుపులేక పడనిపాట్లం బడి దుఃఖదహన దందహ్యమాన మానసులై వేదనం బొరలుచు నున్నవారలు మహానరకద్వారంబులు మిమ్మువంటి మహానుభావులు స్వప్నమందైన భావింప భావ్యంబులు గావు గావున నమ్మరులు మరువవలయు మరలుం డనిన దరహాసితముఖారవిందుండై సానందుం డరవిందమిత్త్రనందనున కిట్లనియె. 140

ఉ. పంకజబాంధవాత్మభవ పల్కురు నాదెస లేనిపోనిదు
శ్శంకలు దెచ్చిపెట్టెదవు చాలుఁ బురాణము గట్టిపెట్టు ర
మ్మింకిట విఘ్నము ల్వలుక కేమియు సర్వముఁ జూచి కాని క్షే
మంకరలీలఁ బోఁదగదు మాటికిమాటికి మాటలేటికిన్. 141

క. మేలుం గీడును రెండును, బోలన్ సరియట్లు దలఁపఁ బొందకయున్నన్
జాలింబడు నమ్మనుజుఁడు, వాలాయము గావునను దివాకరతనయా. 142

తే. అది సంకల్ప మొనరించునట్టికార్య, మందు మేలైనఁ గీడైనఁ బొందుపఱిచి
నిర్వహింపనినరుఁడు దుర్నీతిపరుఁడు, వాఁ డనామికుఁ డఖిలభూవలయమందు. 143

క. కావున నాద్వారంబున్, భావం బలరంగఁ జూపు పదపద యనినన్
నావుడు శమనుం డమ్మునితో వెంచుచు నిట్టులనియెఁ దోరపుభక్తిన్. 144

క. అయ్యా విను మవ్వాకిలిఁ, జయ్యనఁ జూపింప మానసంబునఁ గోపం
బెయ్యెడనైనం బొడమునొ, యియ్యెడనని వెఱచి తింతె యదియుంగాకన్. 145

క. మీవంటిదివ్యపురుషుల, కావాకిలిఁ జూపఁ గీడటంచు న్మదిలో
భావించితి వేఱొండొక, భావమునం గలుగఁబోదు పరహితచరితా. 146

క. ఆచ్చోటఁ గల్గునరకము, లచ్చెనఁటులఁ జూడ వేడుకైన న్నేలా
పొచ్చెములే దిఁక నావెస, మచ్చిక విచ్చేయుఁ డనుచు మార్తాండి వెసన్. 147

తే. అమ్మహాత్ముని దోడ్కొని యచటువాసి, భయదకీలల బ్రహ్మాండభాండమెల్ల
నంధకారసమాక్రాంత మైనయటులు, పసరి వెగడొందు దక్షిణద్వారభూమి. 148

ఉ. కాటుకకొండచందమునఁ గట్టెదుర న్నయనార్తికృన్నిరా
ఘాటకఠోరగోపురముఖస్థితిఁ జేరినఁ గాలభృత్యులా
స్ఫోటనఁ దత్కవాటములు బోరునఁ బెర్వగ నిల్చి కాంచి ర
క్కోటమహాంధకారఘనఘూర్ణితఘోరకరాళదేశమున్. 149

శా. ఆదేశంబునఁ గల్గునారకులయార్తారావ మాలించి యా
భూదేవాన్వయమస్కరీంద్రు చరణంబు ల్ద్రొట్రుపాటొంద లీ
లాదక్షారిని గాంచి షట్కజముఁ దుల్లాసంబునం దేవ మీ
కీదుర్వాసముఁ జూడ వేడుకయినన్ హేలావినోదంబునన్. 150

క. రమ్మని యమ్మునిఁ దోడ్కొని, యమ్మార్తాండియు విలాస మలరం జనుచో
నమ్మతి నిట్లనెఁ బాపజ, నమ్ముల కలకలము వింటె నానాథంగుల్. 151

వ. అని వెండియు దండధరుం డిట్లను దేవా యవధరింపు మమ్మహావప్రం బయోమయం
బిది చతుర్లక్షయోజనవిస్తీర్ణం బిందు రౌరవాదిఘోరనరకకూపంబులు గలవు కువల
యంబునందు దుష్టచిత్తులు మహాపాతకోపపాతకంబుల నాచరించి కడపట గర్మశరీ
రంబులు విడిచి ప్రేతకళేబరంబువలనవిముక్తులై యాతనాశరీరంబులు గైకొని మ
దీయకింకరులు దోడ్కొని వచ్చుమార్గంబునం బెక్కువస్థలంబడి యచ్చటఁ గల్గువైత
రణిప్రవాహంబు దాఁట శక్యంబుగాక మునుంగుచుం దేలుచు నీఁదుచున్న కొంత
కాలంబునకు మదాజ్ఞారూపంబున నప్పాపాత్ముల నీడ్చి తెచ్చి యిచ్చటియధిపతులు
సేనానాయకులు కావలివాండ్రు నేయు పారుపత్యంబులు విచిత్రంబులై యుండుఁ
గావున సకలజంతుకోటులు మద్భటకోటులచేత బాధింపఁబడి యిందు శోకంబులఁ
గుందుచుండుదు రనుసమయంబున. 152

క. రాజుల రాకలు గని భటు, లోజం దమనేర్పు నెఱుపు టుచితముగాఁగ
న్రాజగుయమునిందూతస, మాజము వీక్షించి సంభ్రమంబున ఖలులన్. 153

చ. పదములఁ ద్రాళ్ళు గట్టి యసిపత్త్రవనంబుల నీవలావలన్
మెదడులు మాంసఖండములు మేదినిఁ దైళ్ళఁగ నీడ్చి కొందఱం
గుదియలపాలుచేసి యొకకొందఱఁ గాలిసబండరాళ్ళపై
నుదుకుచు గొందఱం దఱముచుండఁగ గొందఱఁ గొట్టి యుద్ధతిన్. 154

సీ. కడువాడి బాడిసెల్ గైకొని కొందఱ చరణముల్ గొందఱ నఱకి నఱకి
తళ తళ మనుబల్లెములు ద్రిప్పి కొందఱఁ గొమ్ముల గ్రుమ్ముచు గ్రుమ్మి క్రుమ్మి
మెఱుఁగు నారసముల మేనులు దూలంగ నోలించి వళ్ళాఱఁ జొనిపి చొనిపి
ఱోళ్లలోఁ బడఁవైచి రోకండ్లఁ గొందఱఁ బోలుపార నలియంగఁ బొడిచి పొడిచి
తే. సానదీరినకత్తులఁ బూని వేగఁ, గొందఱిని బట్టి నాలుక ల్గోసి కోసి
కఱకుఱంపంబు లెత్తి భీకరముగాఁగఁ, బరువు లందంద గొందఱ దఱిగి తఱిగి. 155

సీ. కాలినగాలాలు గళమునఁ గీల్కొల్పి త్రిప్పి కొందఱ క్రొవ్వు దీర్చివైచి
యుక్కుకొఱ్ఱులమీఁద నెక్కించి స్రుక్కించి కొందఱ నందంద గోడుగుడిపి
కొందఱఁ గల్లుగాగ్గులఁ బెట్టి రక్తము ల్బొబుకి లెడలంగఁ బొంకమణఁచి
... ... ... ...
ఆ. పదను గోరుగండ్లఁ బదరక గొందఱి, కండ్లునెఱికి నిమ్మపండ్లు గ్రుచ్చి
చెట్ల కంటఁగట్టి సింగాణికోలలఁ, జెండి కొంద ఱొడలు చిందుపఱచి. 156

తే. బెబ్బులులచేతఁ గొందఱఁబీచ మణఁపు, జేసి కొందఱ నలుఁగులచేతఁ గండు
మానఁజేయుచుఁ గొందఱ మహిషతతులఁ, బైని దోలింతు రధికకోపంబుమీఱ. 157

శా. శూలప్రాప్తులఁ జేసి కొందఱను సంక్షోభంబు గావించుచున్
గాలంబు ల్దగిడించి కొందఱిని గర్వంబెల్ల మాయింపుచున్
వ్యాళవ్రాతముచేతఁ గొందఱను సర్వాంగంబులం గట్టుచు
న్నేలం గొందఱ వైచి తోమరముల న్నిట్టెల్ల నొప్పించుచున్. 158

క. కొందఱ కండలఁ గోయుచుఁ, గొందఱఁ బ్రేవులనుద్రెంచి కొందఱియెమ్ముల్
చిందఱవందఱ సేయుచుఁ, గొందఱమర్మములు వీడఁగొట్టుచుఁ గడిమిన్. 159

సీ. ఇనుపముక్కులకాకు లొనఁగూడి కొందఱఁ గఱచి మాంసములు చీకాకుసేయ
గండుదుప్మెదలు నల్లడల జమ్మని మూఁగి బ్రమయఁ గొందఱ శరీరములు దొలువ
శాకినీఢాకినీ చటులభూతమ్ములు గొందఱ రక్తము ల్గ్రోలుచుండఁ
గుక్కలు చెలరేఁగి కొందఱిచిఱుదొడ లడరంగఁ బీఁకిన జడిసి పర్వ
తే. సమదశుండాలములఁ బూని చాఁపకట్టు, గాఁగఁ గొందఱిఁ బడ ద్రొక్కి గాసిపెట్టి
కొండముచ్చులు గొందఱ దుండగములు, సేయు నవ్వేళఁ గింకరుల్ శీఘ్రలీల. 160

శా. త్రేళ్ళం బ్రాఁతఱలందు జూదరిని కష్టిం బెట్టఁ బెన్బాములం
బ్రేళ్ళం గొందఱఁ జేసి యందుఁ బడమిన్ దేహంబు లంతంతకున్
గుల్లల్దిత్తులుగాఁగఁ గొందఱిని సక్రోధాత్ములై యీడ్చి పుం
డ్లెల్లం గెల్కుచుఁ గొందఱిం బహుళదుఃఖేదక్రియ ల్సేయఁగన్. 161

క. ఆకోఁతల కావేతల, కాకరకరికామహార్తి కాకాటులకా
భీకరముల కాకొట్టుల, కాకట్టులకట్టె డస్సి యతిదుఃఖితులై. 162

శా. ఆబాధ ల్బడలేక నారకులు కుయ్యంజొచ్చి శోకించువా
రీబాముల్ గడతేరవచ్చు భువిపై నిట్టిట్టుగాఁ బొర్లువా
రాబల్గాయము లట్టెచూచుకొని హాహాకారము ల్సేయువా
రీబన్నంబులఁగాక యొంటఁగలవో యేమేమిఘోరవ్యథల్. 163

వ. అని చింతింపుచుఁ దమలోన. 164

సీ. నేరమైతిమి నాఁడు నీలకంఠుని గొల్వ సేవింపమైతిమి దేవతలకు
జపియింపమైతిమి శాంభవమంత్రంబు వినుతింపమైతిమి విశ్వపతిని
విననేరమైతిమి విధుమౌళిచరితము మ్రొక్కమైతిమి శూలిమ్రోల నిలిచి
తలకొనమైతిమి మలహారుగుడిలోనఁ బూజింపమైతిమి పురవిభేదిఁ
తే. బూయమైతిమి నుదుట సంపూతభూతిఁ, దాల్పమైతిమి భస్మరుద్రాక్షమణులు
చేరమైతిమి కాశికాక్షేత్రమునకుఁ, గటకటా యిట్టితలఁపులు గలుగవపుడు. 165

సీ. మును శంభుసత్కథ ల్వినకున్నఁ జెవులలోఁ జొనుపంగ జొచ్చిరి శూలసమితి
మునుపు దానంబుసేయనిహస్తము ల్వాఁడి బాడిసె ల్జెక్కిరి గోడు గుడువ
మును దీర్థములకు బోవనిపాదములు ఱంపములఁ గోసివేసిరి మొఱలిడంగ
మును సజ్జనావళిఁ గని ప్రియంబున పల్కకున్న నాల్కలు గోసి రెన్నివగల
తే. నహహా సమబుద్ధి మున్ను గోరంతయైన, గలుగ నీపాటులందేల గలుగనేర్చు
మోసపోయిన వచ్చునే మోదసుఖము, లింక దుఃఖింప నవ్వరే యెవ్వరైన. 166

క. అనుసమయంబునఁ గింకర, జనములు రక్తాక్షు లగుచుఁ జటులకరాళ
ధ్వను లెసఁగఁగఁ బాపాత్ములఁ, గని పల్కిరి ఘోరవృత్తి గడలుకొనంగన్. 167
తే. ఇల్లుగాలంగ బావి నిర్మించినట్లు, దోఁచె మీరలు పల్కుట దోసకారు
లార మారాజుచూచిన దూఱువచ్చు, మాట లుడుగుఁడు మాకు మోమోటలేదు.

మ. అనుచుం దూతలు చుట్టుముట్టుకొని హాహాకారము ల్సేయుదు
ర్జనుల న్భీకర ముష్టిఘాతములఁ దీవ్రక్రూరశస్త్రంబులన్
ఘననారాచపరంపరాహతులచేఁ గాఱించి నొప్పింపఁగా
మునిచూడామణి చండి కిట్టులనియెన్ మోమోటలే కెయ్యెడన్. 169

శా. ఓసూర్యాత్మజ జంతుసంఘములు కుయ్యోయ్యంచుఁ గుయ్యంగ నీ
దాసశ్రేష్ఠులు నిల్వలేక బహుబాధ ల్వెట్టఁగాఁ జూచియుం
దోసంబంచుఁ దలంచి వద్దనవు నీతో మాటలాడంగరా
దీసామ్రాజ్యము నీకెగా కలదే యేదేవతాశ్రేణికిన్. 170

తే. జాతఁజేసెనో నీగుండె ధాత మొదల, నట్టివాఁడవు గాకున్న నిట్టిపట్ట
మబ్బునే నీకటన్న నెయ్యంబుదోఁప, వచ్చుకోనునవ్వు నవ్వి యాదిత్యసూతి. 171

వ. అమ్మహాత్మునిం గనుంగొని. 172

చ. బళిబళి లెస్సయంటిరి కృపారసపూరితభావ మీరు పె
ద్దలు మఱిమాకుఁ గర్తలుగదా యటుగావున నేమివల్కఁగాఁ
గలుగదు చిత్త మీఖలులఁ గన్గొనఁ బాపము కాశికేగు సు
ద్దులు ప్రకటింతురా నడుమ దోసముచేసిన లెక్కగాదుగా. 173

తే. అటులుదోఁప మీర లాడినమాటలు, ఖలులబాధ లరసి కరుణపుట్టి
మనసునిల్వలేక మందలించితి రిట్లు, వీరిపాపమెల్ల విన్నఁ దెలియు. 174

క. అనవిని సానందుం డా, యినసూనుని జక్కఁజూఁచి యేపాపము లీ
జనములు చేసిరి భూతలమునఁ దెల్పు మటన్న నతఁడు మోహాన్వితుఁడై. 175

వ. వినిపింపం దొడంగెనని చెప్పిన విని శౌనకాదు లటమీఁదివృత్తాంతంబుం దెల్పు
మనుటయు. 176

శా. గంధాంధాంధక సింధుర త్రిపుర రక్షఃకుక్షిక్షతి స్తనూ
సంధిస్థాన మహోధనోగ్ర హుతభుగ్జాజ్వల్యమానాకృతీ
సింధుప్రోద్భవ రేఖికాంకిత శిరస్స్మేరజ్జటాభృన్నటీ
సంధామాత్ర వినిర్మితాఖిల జగత్సంరక్షణాత్మస్థితీ. 177

క. దాక్షాయణీమనోహర, దక్షాధ్వర హరణదీక్ష తాపసరక్షా
దక్ష మహామహిమాస్పద, దక్షిణకైలాసనిలయ దర్పకనిలయా. 178

మాలినీవృత్తము. రాజితమాధవ కాంచనగర్భ పురందరమౌళి మనోద్యుతి నీ
రాజితపాదనిరంతర భూధర రాజసుతా హృదయాబ్జమహా
రాజతమన్మథ మేరుధనుర్ధర రంగభుజా విలసద్విభవా
రాజతశైలనివాస గిరీశ హరా త్రిపురాసురగర్వహరా. 179

గద్య. ఇది శ్రీమత్కాళికాంబా వరప్రసాదలబ్ధ సాహిత్యవైభవ సదాశివస్వరూప
సద్గురు చరణారుణరాజీవ సేవాసమాదితాద్వైతానుభవ కౌశికగోత్రసుధార్ణవ
పరిపూర్ణకైరవ బాంధవకోటి బాపనయ్యతనూభవ సవినయగుణాభిధేయ శివరామ
నామధేయప్రణీతంబైన సానందోపాఖ్యానంబును మహాప్రబంధంబునందుఁ దృతీ
యాశ్వాసము సంపూర్ణము.

# చతుర్థాశ్వాసము



క. సీతాచలకన్యా
భాసురకుచలిప్త సాంద్రపాటీర హరి
ద్రాసంకలితోరస్స్థల
హాసాస్యవివేక కాళహస్తినివేశా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలమునుల, కిట్టులనిచెప్పె సూతమౌనీంద్రచంద్రుఁ
డివ్విధంబున సానందుఁ డడుగుయుచు,బలికె సమవర్తిమధురవాక్పటిమ మెఱయ.

వనమయూరము:—

భాసురదయామయవిపాకసుగుణైకో, ల్లాస విను వీరలు ధరాతలములోనం
జేసినమహాఘములు చిత్రము పవిత్రా, భాసములుగానఁ బరిపాటి వినిపింతున్. 3

సీ. శివపూజఁ గలనైనఁ జేయనొల్లఁడు వీఁడు గిరిశేశుఁగని కంటగించు వాఁడు
భర్గప్రసాదంబు బట్టఁడెన్నఁడు వీఁడు హరునిసేవకులఁ బోనాఁడె వాఁడు
అభవపురాణంబు నంటఁ డెన్నఁడు వీఁడు గళకంఠభవనార్తికారి వాఁడు
ధూర్జటికోవెల త్రోవ ద్రొక్కఁడు వీఁడు కానూరితీర్థము ల్గనఁడు వాఁడు
తే. మునుపొనర్చు ధర్మములఁ బాడుగావించి, యశము దనకుఁ గల్గునంచు జీర్ణ
మైనదేవళంబు లందున్నకంబము, లొండు గుడికిఁ బెట్టుచుండు వాఁడు. 4

క. విష్ణుకథ లాలకింపక, విష్ణుస్థానంబుఁ జేరక విష్ణులసద్భ్రా
జిష్ణు లగువారిఁ గూడక, విష్ణుద్వేషం బొనర్చె వీఁడు ధరిత్రిన్. 5

క. బ్రాహ్మణులఁ బూజసేయక, బ్రాహ్మణదూషకుల పాలుపడి నిరతంబున్
బ్రాహ్మణులఁ బాధవెట్టుచు, బ్రహ్మద్వేషి యగు పరమపతితుఁడు వీఁడే. 6

క. గోవుల సతులం బేదల, దైవసమానులగు తల్లిదండ్రులఁ గని సం
సేవలు గావింపనిదు,ర్భావుం గనుఁగొంటె వీనిఁ బావనచరితా. 7

మ. పలలంబు ల్భుజియించె వాఁడు పరుల న్బాధించు వీఁ డూరకే
కులకాంతం ద్య[illegible]ంచె వాఁడు స్వకృతోఁ గొండెంబులం జెప్పె సా

ధులఁ బెక్కండ్రకుఁ గీడుసేసిన మహాదుష్టుండు వీఁ డన్నద
మ్ములకెగ్గు ల్దలపోయు నన్యవనితామోహాంధకారుం డిలన్. 8

ఆ. నీరుఁ బూరి మాన్పి నిర్దయస్వాంతుఁడై, పసుల బంజెఁబెట్టు పాపి వీఁడు
మొసల దారవోయు నది విప్రుఁ డడిగినఁ, బరిహసించునట్టి భ్రష్టు వాఁడు. 9

ఉ. మానవదానవుండు కసుమాలము వీఁడు నిరంతరంబు క
య్యానకుఁ గాలుద్రవ్వి తిరుగాడు మహీస్థలి వాఁడు మానితా
నూనఫలప్రవాళ సుమనోహర పుష్పనిధానభూజము
ల్వాని హరించు వీఁడు బలుపోకిరి వాఁడు వివేకభూషణా. 10

ఉ. ఏమిని చెప్పుదుం జటికులేశ్వరశేఖర యెల్లవానికిం
దామస మిష్టమిత్రుఁడు మదం బభిమానవధూటి లోభ ము
ద్దామసహోదరుండు పతితత్వము శౌచముగా మెలంగి దృ
క్సీమలయందు నిప్పుకలు చిందఁగ నుండుచు నుండు నెల్లెడన్. 11

క. పలుగాకుల నడకలు తాఁ, బలుమరు నతిముంచి పాశుపతుల మహాని
ర్మలచిత్త మిచ్చగించని, ఖలులకు శ్రేష్ఠుండు వీఁడు కారుణ్యనిధీ. 12

తే. సత్యమెన్నఁ డెఱుఁగఁ డేశాడనైన, శాంత మెప్పుడు రాదు కాసంతయైన
శౌచ మెటువంటిదో యనుజన్మమెత్తి, నాఁడు విశ్వంభరాస్థలి వీఁడొకండు. 13

తే. విధినిషేధంబు లెఱుఁగని వెడఁగు వాఁడు, మద్యకాంతలఁ బొందంగఁ దొడఁగు వీఁడు
గాసిఁబెట్టును బెద్దలకాసుకైన, వాఁడు వర్తనమాలిన వాఁడు వీఁడు. 14

క. మొగ మంబుజపత్త్రము వగ, నగవులు పాటీరశైత్యనవనీయోక్తుల్
దగ హృదయము కత్తెరవగ, నగణితవినయమున ధూర్తుఁ డగు వీఁ డనఘా. 15

వనమయూరము:—

పెద్దలకు దండములు బెట్టఁడొకనాఁడున్, వద్దనఁడు విప్రధనవారములు వాఁడున్
బుద్ధిచెడి యింటికడఁ బోరలిడు వీఁడున్, గద్దరితనంబుఁగల కష్టమతి వాఁడున్. 16

వ. మఱియును నిఖిలప్రాణహింసాపరాయణులును నన్యాంగనాలింగనక్రియాధురీణులును శునకసూకరబిడాలాది వధాసక్తులును నిఖిలాగమజేగీయమాన వళక్షరతూభద్రాక్షభూషణులును నుదరపోషణార్థ నానావికార సేవవేషభాషణులును సర్వకాల తైలాభ్యంజనమనోరంజనులును గురుపరిత్యాగులును గుటిలబోధులును విషప్రయోగులును ద్యూతక్రీడావినోదులును సకలజనవివాదులును బాలవృద్ధగురులోకంబులకు మున్నుగా భుక్తింగొన్న వ్యంజనాభిముఖులును సంగరరంగపరాఙ్ముఖులును. మొదలుగాఁగల దుర్మార్గుల వేర్వేఱంజూపి తత్తత్పాతకంబు లొకకొన్ని ప్రసంగవశంబునం జెప్పి యచ్చోటు వాసి యమ్మహానుభావుం డొడ్డొకని శ్రాద్ధ

దేవుండు పురోభాగంబున కరుగ మున్ను బాధలంబడు కర్ములకంటె నిరుమడి ము
మ్మడి యవస్థలంబడుచున్న యవస్థలంజూచి విస్మయమానసుండై సానందుం డున్న
సమయంబునఁ గింకరులు నిరంకుశభయంకర ప్రచారులై నీచమతులం గొందఱం
బట్టిధట్టించి దహనజ్వాలాజాల దందహ్యమాన లోహస్తంభంబు లిమ్ముగా నొక్కు-
మ్మడి గాఢాలింగనంబులు చేసికొమ్మనియును ఘోరవ్యథలంబెట్టుచుఁ గొందఱ
నిప్పులగుండంబులం బడనెట్టుచుఁ గొందఱఁ దైలఘటంబుల నుడికించుచుఁ గొందఱ
నుల్కాపాతంబుల పాలుపఱుచుచుఁ గొందఱఁ బాజులెత్తి కాల్చుచుఁ గొందఱ
మంటలకడం బెట్టి కమల్చుచుఁ గొందఱ చరణాంగుళుల నేరండతైలసిక్త వస్త్రఖం
డంబులంజుట్టి దివియలు ముట్టించియుఁ గొందఱఁ దప్తవాలుకారాసులమీఁదఁ
బొరలింపుచుఁ గొందఱ జ్వలనపరిపక్వచూర్ణ పాషాణమండలంబుల నెరియ విరి
యింపుచు మచ్చరంబున విచ్చలవిడి చిచ్చుకుండలఁ దగిలించి యాఁచిచ్చున మండి
పోవం గొందఱి మెడవట్టి నూకుచు నఖాండప్రచండ గండోపలంబులం గొందఱి
వైచి ఖండణఁగించుచుఁ గొందఱి పిచండంబులు మండిపడ సీసంబు గాఁచి
పోయుచుఁ గొందఱ మంటపర్వతంబుల నెక్కించుచుఁ గొందఱఁ గ్రిమికీటకని
బిడదుర్గంధమహాకూపంబునం ద్రోచి తద్వేదనలకు సహింపక తలలెత్తి మాచినఁ
జూడకుండ ఱాళ్ల ఉర్వుచుఁ గొందఱి నానావిధ బాధాపరంపరల గాసిఁ బెట్టి
బెట్టులిక్కి నేలంబడువారును మూర్ఛల మునుంగువారును రోదనంబు సేయువా
రును హాహాకారంబుల సేయువారును భటులబొటునవ్రేల్గ గఱచికొని యడుగుల
మీఁద వ్రాలువారును కట్టల్కం బట్టవచ్చిన నిట్టట్టుగాఁ దప్పించుకొని యొం
డొరుల మరుపు సొచ్చువారును కట్టడి గట్టుకొని యాఁకచ్చిన నీడిగిలంబడి లేవ
లేనివారును క్షుధావేదనలకోర్వక చతికిలంబడి మోఁదుకొనువారును ముందర మంద
బుద్ధిని నిటలాక్షునివాసంబు పాదరక్షల మెట్టితి మియ్యెడ దత్పాదంబులఁ
గఠిన క్రకచంబులం ద్రోయనాయెఁ గదా యని పలవించువారును బూర్వంబున
గర్వందొట్టి గట్టుబిలుకాని కోవెలముందర నరవిరద గంధులతో గంధర్వ వినో
దంబు లాచరించితి మిప్పు డీప్పాపంబున నిరుపమాంగలంబుల సర్వాంగంబులు
వేఁపంజొచ్చి రనువారును మునుపు నీలకంఠనిర్మాల్యం బాఘ్రాణంబు సేయనిదురితం
బున నీయవసరంబున నిశాతహేతివ్రాతంబుల నాసికాచ్ఛేదంబుఁ గావించి రనువా
రును వెనకటికి గనకరఘ ధుర్ధర కుసుమదామంబు లిచ్చం జొచ్చి నానాప్రసూన
వితానంబు లపహరించి ముడుచుకొన్నదుష్కృతం బిచ్చోటికిందెచ్చి తన్మస్తకంబు
లుక్కునారసంబులం జెక్కులుసేసి రనువారును దొల్లిపరపల్లవాధరల సుధా మధు
రాధర పానంబుసేసితి రని పరేతనేతదూతలు క్రోధాన్వితులై దంతభగ్నంబులు

గావించి హేయంబైన విషంబులు ముఖగహ్వరంబులం బోసిరని యాక్రందనం
బులు సేయువారును బరభామాలావణ్యంబులఁ గామాతిరేకంబునఁ జూచితిరని గో
రుగంట్లం గ్రుడ్లువ్రక్కలించి కనువారును బరకాంతల కుచప్రాంతంబుల నఖాం
కురంబు లుంచితిరని కాలినసబ్బనంబులు గోళ్ళలో చురులం గ్రుచ్చి రేఁగాగుతాళ
వచ్చు నదువారును బరవేదండగమనల కౌఁదం బుండ్రేక్షుకోదండక్రియలఁ బ్రొద్దు
లువుచ్చితిరని మండలాగ్రంబుల నండయుగ్మసహితంబుగా మేఢ్రంబులం దునిమి
రేభంగి నిల్వరింపనేర్తు మనువారును విబుధులంగని యాసనంబుల న్విడిచి లేవని
నాఁటి క్రూరకర్మంబుల ననలశిఖాప్రచ్ఛన్నాయస్తరంగంబుల నెక్కి కని యింతట
నైనం బ్రాణంబులువాయకున్న నమువారును మొండిప్రాణంబు లెవ్విధంబునం బోవ
నువారును వంటయిల్లునొచ్చినకుండే లెందుఁబోవు భూనాగసంయోగంబగు గాలం
బునఁ దగులుపడిన మత్స్యంబుతెఱంగున శరీరం బెఱుంగక చేసిన ఘోరపాపంబు
లొకటి సహస్రంబులై యనుభవింపఁజేయుచున్న వనువారును వెక్కసంబుగా వెక్కి
వెక్కి దుఃఖించువారును మఱియు నానావిధయాతనాసమేతులైన యప్పాపజా
తులు దూతలం గనుంగొని. 17

క. ఈశోకంబుల కీరోఁతల, కీశాల్పుల కీయవస్థ కేమోపుదుమే
మీకన్నబిడ్డలము మా, కీకాలము దిక్కుమీరె యింకఁ బ్రోవఁదగున్. 18

సీ. ఓధర్మమతులార యొక మాటుతో ఖడ్గధారలఁ బరిమార్పఁ దగవుగాదె
యోవీరవరులార యొకమాటుతో నగ్నికీలలఁ గాల్చుట కీర్తిగాదె
యోదయాపరులార యొకమాటుతో శూలములఁ జించివ్రేయుంట సుళువుగాదె
యోసాధుహితులార యొకమాటుతోఁ దైలపక్వంబు గావింపఁ బాటిగాదె

తే. పలుతెఱంగుల వేదన ల్వడయవశము, గాదు మీవంటికాయము ల్గావు మమ్ముఁ
గడఁగి యింకనైన మీగొనగాలఁ దన్ని, విడిచిపెట్టిన మేలు వివేకులార. 19

మ. అని ధర్మప్రభుఁ గాంచి యిట్లనిరి దేవా రాజవర్యుం డెఱుం
గని పాపంబె గదా యటంచు మది సంకల్పింప రాకుండనో
గనుట ల్భాగ్యము మీపదాబ్జముల నింకం జూచుపుణ్యంబు మా
కనురక్తిం గలిగెన్ దయాంబునిధి యీయారాటము ల్మాన్పవే. 20

శా. చాలు న్రాజ్యము చాలు భోగములు భాస్వత్సత్సభ ల్చాలు వా
గ్జాలత్వంబులు చాలు పాపములవంకం బోక పుణ్యంబులే
వాలాయం బొనరింతు మింక మముఁ గావన్నేలు ధర్మాత్ములన్
లీలం బ్రోచుట కీర్తిగాదు కృపణాళిం బ్రోచుటే ధర్మముల్.

మ. అని సానందమహర్షిపుంగవులదిక్కై మ్రొక్కి యోయయ్యలా
రనవీనార్తకులార యీనరకఘోరవ్యాధి మాన్పంగ వ
చ్చిన సిద్ధప్రభుఁ డో యెఱుంగ మిట మీ శ్రీపాదముల్గాంచినం
తనె ప్రాణంబుల కింత సౌఖ్య మనురెం సత్యంబుగా నీయెడన్. 22

తే. అమ్మహారాజుతోడ మీరైనఁ గాని, తెలియ వినిపింపరయ్య బాధింపవల్వ
దంచుఁ జెప్పినఁ గొంత మన్నించి భటులు, ప్రోవఁ జూతురుగాని యోపుణ్యులార.

క. ఇవ్విధమున దుఃఖమున, న్నివ్వటిలెడి దుష్టజనుల నిష్కారుణ భటు
ల్నొవ్వంజేయుచుఁ బల్కా, రివ్వగ మీ రటవఁ బాడియే యని పెలుచన్. 24

ఉ. రాజ్యము గీజ్య మొల్లము తిరంబుగ ధర్మము చేతుమంచు బ
ల్వ్యాజ్యము లాడఁ జొచ్చితిరి వారక మీకిఁక నేడ సౌఖ్యసా
మ్రాజ్యము ముక్కులో కుసుపు మానినవాఁటికి దాసరయ్య తాఁ
బూజ్యతఁ బొందునప్పగిదిఁ బో యిపుడెన్నిన మీవచస్థితుల్. 25

తే. నెమలికన్నీరు వేఁటకానికిఁ బ్రియంబు, గాదు గావున మీరెంత గాసిపడిన
మాకు దయరాదు మాయొద్ద మందునైన, గరుణ గానమయో దుష్టకష్టులార. 26

క. తిటిని తలఁ గొట్టఁ బంచిన, చెవులకు మందడుగురీతి సిద్ధం బాయెం
గవకూడి మీరు పల్కుట, యవివేకస్వాంతులార యదియును గాకన్. 27

క. ఈచిల్లర నీతలకే, వాచాలవ రోర్వశేక వల దుడుగుఁ డహో
సూచీముఖాదినరకము, లాచంద్రార్కంబులైన వని యెవ్వరికిన్. 28

ఆ. మనఁదిఁ జెప్పఁబోయి పెనుగొడవలు దెచ్చు, కొన్నరీతిఁ దోఁచ గన్నుఁగవల
నిప్పు లుప్పతిల్ల నప్పుడు భటకోటి, ఖలులఁ బీడవెట్టఁ గడఁగి మఱియు. 29

శా. బాధింపంగని యీశ్వరాయని కృపాపాథోధిసానందుఁడుక్
మేధావైఖరి చండికిట్లనియె భూమి స్వీర లెంతేని పా
పాధీనుల్ బహుళార్తి గుందెదరు నెయ్యంబారఁ జెప్పంగదే
యోధర్మాత్మ యనం బరేతపతి పూర్ణోత్సాహియై వెండియున్. 30

చ. వినుము బుధేంద్రచంద్ర పృథివీస్థలి వీర లొనర్చు పాపముల్
గొనకొని నోటను న్నుడువఁగూడదు గావునఁ దోఁచినట్టులం
బనిబని విన్నవించెద నపాలకుఁడై యట నీచభావుఁ డే
పున ధరణీసురోత్తముని బొల్పడఁగించె ధనానురక్తుఁడై. 31

సీ. కొండెంబుఁ జెప్పితే కులహాని పరహాని కొండెంబు విన్నంతఁ గోపమొదవుఁ
గోపంబు పుట్టుట పాపంబు హేతువు పాపంబు నరకకూపంబుచెలిమి

కొండెంబు విసువారుఁ గోపంబు గలవారు మాచేతఁ జిక్కక మానలేరు
కొండెంబు విసువారు కుండగోళకులని బుధు లెన్నుకొందురు బుద్ధిలోన
తే. గొండెగాండ్రను జేర్చిన కుపలయేశు, రాజ్యమెల్లను శీఘ్రకాలంబునందు
నష్టమైపోవుఁ గాన మానవవరుండు, తెలిసి భూలోక మేలినఁ దేజ మొసవు. 32
శా. రాజ్యం బేలుచు ధర్మముల్ వదలి దుర్మంత్రానురక్తిన్ సదా
పూజ్యస్వాంతులసంప్రదాయకులనుం బోనాడి దుష్టాత్మకు
ల్రాజ్యత్వం బొక యింతసేయని ధరాధ్యక్షుండు గోరుం జుమీ
రాజ్యాంతే నరకం ధ్రువం బనెడియాలాపంబు తథ్యంబుగన్. 33
తే. దుష్టభూపాలకులకు గతులుఁ గలవె, గల్గువారలకును నరకములువరుస
నటులు గాదె త్రిశంకుభూపాలుఁ డాది, మానవేంద్రుల కబ్బె స్వస్థానపదవి. 34
శా. ఈదుర్మార్గుఁడు రాజ్యగర్వమున విప్రైణేక్షలం దెచ్చి శం
కాదోషంబులు లెక్కవెట్టక యనంగక్రీడలే ప్రౌఢ మ
ర్యాద ల్దప్పి యొనర్చినందులకుఁ బ్రాయశ్చిత్త మిచ్చోట నా
నాదుష్పాపకఘోరయాతనల దైన్యం బొందు నేకాలమున్. 35
సీ. రణభీతులై శిబిరములు సొచ్చినవారి వెఱపు పెన్గొనఁ బారి గఱచువారిఁ
గోఁచవారుచును బల్ కోన దూఱినవారి మసలక కైదువుల్ మఱచువారి
విచ్చలవిడిఁ దలవీడఁ బాఱినవారి బద్ధులై యడుగులఁ బడినవారి
బెట్టులిక్క యిట్టట్టు గట్టు లెక్కినవారి బ్రతుకాసఁ జెట్లకుఁ బ్రాఁకువారి
తే. మరుగుచేరినవారి నేమఱినవారిఁ, గావఁజాలక సంగరాంగణములందు
వెదకి భీతులఁ బరిమార్చు మదసమేతు, లానృపాలాధములఁ గంటె మానివర్య. 36
క. పాపాత్ములైనపురుషుల, కేపున మణియంబు లిచ్చు నీకష్టుఁడు దు
ర్వ్యాపారంబున మడిసం, తాపింపఁ దొడంగు సంతతము వీఁ డనఘా. 37
సీ. నలినగమ్యాగమనం బొనర్చినవారు గొతుకక మద్యంబుఁ గ్రోలువారు
ధరలోన ధర్మంబుఁ దప్పఁ జెప్పినవారుఁ గినుక బంగారు దొంగిలినవారు
ముఖ్యులపై నింద మోపి పల్కినవారుఁ గోరి పుణ్యం బమ్ముకొన్నవారు
నయమేది భవనాంగణములు గాల్చినవారు గరళ మన్నంబులోఁ గలుపువారు
తే. నాగ్రహంబున దేవతావిగ్రహముల, నఱికి కరఁగించువారు మన్మథవిరోధి
భూషణద్రవ్యచోరులై పొట్టపెంచి, నట్టిమాహాత్మ్యకులు వీర లనఘచరిత. 38
క. పశువధయుం జేసె వీఁడుం, దశపాతకి యల్లవాఁడు దాక్షిణ్యకళా
విశదస్వహీనుఁ డీతఁడు, శిశుహత్య యొనర్చె వీఁడు సిద్ధప్రవరా. 39

క. వృజినంబులన్ని వెఱవక, గజదానములెల్ల గొన్న గద్దరి వీఁడున్
రజకాంగనలం గలసిన, కుజనుం గనుఁగొంటె వాని గురుపుణ్యనిధీ. 40

తే. జనకుఁ డీల్గిన జనని వృద్ధసక పట్టి, చిచ్చులోఁ బడ నూకినచెనఁటి వీఁడు
నాలితోఁ బోరు పెట్టుక యాత్మహాని, నాచరించినఖలుఁడు వీఁ డమలహృదయ. 41

క. తరుణులు రాత్రులు నిద్రా, పరవశలై యున్న మానభంగము సేయం
దొరకొన్న ముష్కరాత్ముని, బరికించితె వాని భక్తపాలనవర్తీ. 42

క. మృడమందిరోత్సవంబులు, నడకుండం బాడుపఱచి నగచాపుని పె
న్గుడిరాళ్లు పెఱికి యిండ్లం, గడపలఁ బొసఁగింపఁ దలఁచు కష్టుఁడు వీఁడే. 43

చ. వెలఁదులమాట నమ్మరు వివేకులు వారలు చెప్పినట్ల యే
తులువలు చేసిరేని బలుదుర్గతులం గృశియింతు రీజడుం
డలికులవేణిపల్కులు ప్రియంబుగ నెంచి కులంబువారిపై
నలిగి నిజాన్వయచ్యుతవిహారకుఁడై కడుఁ గ్రూరుఁడై మనెన్. 44

ఆ. వఱలు బలిమికలిమి వరుసబహిర్జల, కేళిసల్ప కింటఁ బాలుమాలి
యుష్ణజలములాడ నుద్యోగ మొనరించి, నష్టశౌచుఁ డితఁడు నయవిచార. 45

ఆ. చెంతనుండునట్టి శిష్టుల యనుమత, మైన దేవయోగ్య మైనఁగాని
యోదనంబు గుడువ నుత్సహించినపుణ్య, హీనుఁ డల్లవాఁడె మానివర్య. 46

క. తానేర్చు పూజ్యవిద్యా, శ్రీనిధి నెవ్వరికి నెలవుసేయని దుష్టా
నూనాభిమాని చదివిన, శ్వానం బనఁబఱఁగు వీఁడు జగతీస్థలిపై. 47

వ. అని యిత్తెఱంగున నారకుల ఘోరకర్మంబు కాక కొన్నిచెప్పిన విని మానిసం
క్రందనుం డాశ్చర్యమానసుండై భానుసూనుం గాంచి ధర్మాత్మా సమర్థుండ వట్ల
గుటం జేసి నీవేమిచేసిన వలదని వారింప బ్రహ్మేంద్రాదులతరంబుగా దీజీవులు పడు
దురవస్థలు సర్వేశ్వరుఁ డొక్కం డెఱుఁగుఁగాని యితరులకుఁ దెలియంబడ
వట్టుండని మ్మింకొక్కసందేహము డెందమునం బొడముచున్న దది యెయ్యది
యంటేని. 48

క. ఏసినఁ ద్రోసినఁ దునుకలు, సేసినఁ గోసినను గాసి చేసిన నరకా
వాసకు లేమిటఁ బొలియరు, యసాధ్యం బేమొకాని యెఱిఁగింపు తగన్. 49

తే. భూమిపైఁ గాల్చివేసిరి బొందులన్ని, దేహబంధంబు లెబ్భంగిఁ దెచ్చుకొనిరి
వీరిఁ గాంచిన విస్మయమై రహించు, చున్న దదిగాక సందియ మున్నదొకటి. 50

వ. నీవు త్రికాలవేదివి సర్వజంతుకోట్ల మర్మకర్మంబులు నీచేతఁ జిక్కియున్న వటుగా
వున నీవెఱుంగని రహస్యం బొండేమియుం లేదు జీవశరీరసంబంధం బెబ్భంగిం బ్రవ
ర్తించు జీవస్వరూపం బెయ్యది దేహస్వభావం బెటు పిండోత్పత్తి యేచందము

తచ్ఛరీర బంధమోక్షం బెవ్విధంబునం బ్రాపించు నివి మొదలైనరహస్యంబులు మాకుం దెలియ నెఱింగింపుమనిన నమ్మునిసత్తమున కంశుమత్తనూజుం డిట్లనియె.

సీ. విన్నవించెద విను విశ్వంభరుండు పరంజ్యోతిస్వరూపుండు శుద్ధసత్త్వుఁ
డఖిలజగత్కల్పనారక్షసంహారకారణుండును జిదాకారుఁ డాది
మధ్యాంతశూన్యుండు మంగళదాయకుం డప్రమేయుండు భవుఁడైనశంభుఁ
డష్టమూర్తియుఁ గాన నమ్మహాపురుషుని యవయవంబులఁ బూర్ణమై వెలుంగు
తే. సకలభూతప్రపంచంబు స్థావరంబు, జంగమంబును జీవసంచయము లొప్పు
నట్టిజీవాత్మ పరమాత్మ యై తనర్చు, భేద మింతైనఁ జేయ మర్యాదగాదు. 52

వ. అట్లగుటం జేసి యమ్మహాదేవునియందు వటబీజన్యాయమున వహ్నియందు స్ఫులింగంబులు పొడమినవడువున మహేశ్వరుని యంశభూతంబులని జీవులం దెలియము రజ్జువందు సర్పభ్రమ పుట్టువిధమున నిరుపాధిక పరబ్రహ్మంబునందు మాయాసంబంధంబున జీవస్వభావము ప్రసిద్ధంబయ్యె నట్టిజీవుం డిట్టివిశ్వంబున శాంభవీమాయామోహితుండై యనాదికర్మవశమునం బ్రారబ్ధం బెవ్విధంబునం బ్రవర్తించు నవ్విధంబున సచరాచరశరీరములెత్తి సుఖదుఃఖంబులు జీవాత్మకు లేకున్నవైనను మహదహంకారభూతంబులైన కామక్రోధలోభమోహమదమాత్సర్యములం బ్రమత్తుండై వృథాకృతంబున సుఖదుఃఖముల ముఖంగు దోషంబాత్మకుఁ గలుగనేరదు విద్వాంసుండైన భూసురోత్తముండు సురాపానంబు సేసి యొడలెఱుంగనిచందంబున దుర్జయంబైన మూలప్రకృతివలన నైనభ్రాంతిం జేసి జీవకోట్లశ్వమేధాది సుకృతవిశేషముల స్వర్గంబును బ్రహ్మహత్యాది మహాపాతకంబులం జేసి నరకంబు ననుభవింతు రిట్టి సర్వప్రపంచము మిథ్యాభూతంబని యెఱింగి పండితులు జరాయుజాండజ స్వేదజోద్భిజ్జంబులు జంగమంబులందుఁ బశుపక్షిమృగాది తిర్యగ్జంతువుల కభివ్యక్తి లేకుండుటం జేసి యవి పుణ్యపాపములం బొందవు చతుర్విధ జన్మంబులలోన జరాయుజంబ ముఖ్యం బందు మానుషదేహంబు దుర్లభంబని చెప్పంబడుం దదుత్పత్తిక్రమంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 53

సీ. క్షితిమీఁద మదవతుల్ ఋతుమైన నాల్గునాళ్లవెనుక మజ్జనమాడి విభునిముఖము
దర్శించు టుత్తమధర్మంబు తరుణికి నన్యులఁ జూచిన యట్టిరూప
వంతుఁడౌపుత్త్రుఁ డవశ్యంబుగావున సతులు సల్పుదు రట్టి సద్వ్రతంబుఁ
బదియాఱుదినములు పడఁతికి ఋతుకాల మని చెప్పుదురు పెద్ద లందుఁ జేసి
తే. దినమునను గర్భమొదవినఁ దెఱవ పుట్టు, సరిదినంబున నిల్చినఁ బురుషుఁడగును
మిశ్రవేళలఁ బొందు గామింప నందుఁ, బుట్టు నొక్కట దోడ్తో నపుంసకుండు. 54

క. పదియాఱగు దివసంబున, మదవతికిఁ గర్భమైన మానవపతియై

యుడవయుండు బురుషసింహుఁ, డని పరమరహస్య మరయ నెన్నుదు రార్యుల్. 55

సీ. వినవయ్య పురుషునివీర్యంబు హెచ్చిన పురుషుఁడై జన్మించుఁ దరుణిశోణి
తం బెక్కుడైనను దరుణియై పుట్టు నొక్కటొ సరియైన శిఖండి యగును
గుడిప్రక్కఁ బురుషుండు కుదురుగాఁ బొదలును వామభాగము రాజవదనకిరవు
నానట్టనడుమ బృహన్నలస్థానంబు మగవాని గనఁబోవు మగువకు మది

తే. బొడముఁ గార్యాదిభావము ల్పడఁతియైన, భయము లజ్జయుఁ దోఁచు నప్పగిదిరెండు
భావముల మిశ్రగుణములఁ బ్రబలెనేని, పుట్టు తద్గర్భమునను నపుంసకుండు. 56

ఉ. కారణ మింతలేక యొకకార్యము గల్గదు గాన పూరుషుం
డారయ లేమఁ బొందుసమయంబున శుక్లము భావమన్మథా
కారములోన జాఱిన సుఖస్థితి రక్తము గూడి యొక్కటం
జేరును సూక్ష్మచర్మమున భీతమృగేక్షణ కుక్షిలోపలన్. 57

ఆ. మొదటిమాసమందుఁ బదనుగా బుద్బుద, భాతి నుండు నాల్గుపక్షములకుఁ
బిండరూపమగుచుఁ బెంపొంది మూణ్ణెల్ల, కవయవములు పుట్టు ననఘచరిత. 58

ఉ. నాలవమాసమందుఁ జరణంబులు హస్తము గక్షయుగ్మము
న్వ్రేలుఁగఁ గర్ణరంధ్రములు నోరును ముక్కును సంభవించు న
క్కాలములోన జీవులకు నప్పుడు గొంతవిచారబుద్ధి దుః
ఖాలయ మైనగర్భమున నాపదఁ బొందుఁ గ్ఘోరవేదనల్. 59

క. విను మైదవమాసంబున, మన మధికస్ఫురణఁ జెందు మాంసము రక్తం
బు నరము లెముకలు నఖములు, జనితములగు రోమములును షాణ్మాసమునన్. 60

క. బలము స్వర్ణము నేడవ, నెలయందుం గలిగి పుట్టి నెలకొని వెలుచన్
లలితవివేకము వొడమిన, విలపించున్ గర్భనరకవేదనవలనన్. 61

తే. జనని జఠరాగ్నికాల్పులఁ దనువు దూలి, ప్రక్కటెముకలు అంపాలపగిది నోఁక
శోణితముఁ జీముఁ గ్రోలుచు సూక్ష్మమైన, క్రిమిచయము ముండ్లవలె మేనుఁగినిసికఱవ.

క. మలమూత్ర పైత్యరసములఁ, దులదూఁగుచు నుల్కిపడుచు దుఃఖించుచుఁ జే
తులఁ జెవులు మూసికొని పద, ములసందుల కేలుదోయి ముడుఁచుకపొదలున్. 63

శా. ఆవేళం దలపోయఁ బూర్వజననవ్యాపారము ల్గొన్ని దుః
ఖావేశంబున మున్నుఁ బొందు నరకప్రారంభ దుర్గంధబా
ధావిస్ఫూర్తి పరంపరాబహుళ మీఁదారి న్మహాఘోరమై
భావోపద్రవ మొందఁజేయుటెవి పో ప్రారబ్ధసంబంధముల్. 64

మ. అని శోకించుచు దైవమా భయదగర్భాగారదుఃఖంబు మా
న నుపాయస్థితి యెట్టు చాలు నిఁక ధన్యస్వాంతముం జేసి యీ

జననాంత్రంబులు లేనిపోవ గనుటల్ సౌఖ్యం బటంచున్ మదిన్
జనితంబైన వివేకసంపదను మోక్షధ్యానపారీణుఁడై. 65

సీ. అట్టున్న శిశువున కష్టమాసంబున జ్ఞానోదయం బయి కర్మ మొదవ
భద్రమైయుండుఁ బానము సేయఁ రక్తంబు జీవనంబునకు సంజీవనంబు
తన్నిమిత్తమునఁ గదా మాతృగర్భంబు చంచలత్వంబుఁ బ్రాపించుటెల్ల
నక్కాలమునఁ బీడితాంగుఁడై మావిచేఁ బొదువంగఁబడి యింత మెదలలేక

తే. ప్రాణములు లేనివాని వైభవముగాంచి, జనని భక్షించు నన్నరసంబు హృదయ
నాడిముఖమున దిగజాఱి నాభిచెంతఁ, బొందుకతమున బ్రదికి విస్ఫూర్తిఁ జెందు. 66

వ. అంత నవమాసమున ప్రసూతిసమయమునం బవనవశంబున కీకసయంత్రంబుల విముక్తుండై కుక్షిమార్గము వెలువడి మేదోరుధిరసిక్తాంగుండై దుఃఖించుచు నధోముఖముగా సూక్ష్మద్వారమున వెడలి జంత్రపుసూత్రమువలనం దప్పి జాఱిన బొమ్మవిధమున భూపతనంబైన పూర్వజ్ఞానంబంతయు మఱచి సారమేయ భైరవ బిడాల జంతుసంతానదంష్ట్రలం బాలుపడకుండ దండహస్తులచేత రక్షితుండై తన్ను నెఱుంగమి దనుజుం గనుంగొని జనకుండని తలంచుచు మోహినీభూతము పొడకట్టిన జననియని భావించుచుఁ గాయశోణితంబుల జ్ఞానమున సోలక త్రావుటం జేసి శైశవంబు దీర్ఘకష్టంబని యార్యులుచెప్పుదురు దేహంబుల గల నాడులు శ్లేష్మవిహితములైయుండు నట్లుగావున సుషుమ్ననాడియందు శ్లేష్మ పూరంబు నిర్వాణంబగునం దొకసువ్యక్తము నాడశక్తిలేదు దానం జేసిగదా గర్భస్థుండు గర్భగోళంబున రోదనము సేయ సమర్థుండుగాఁ డివ్విధమున మూఢభావమున బాల్యకౌమారంబులు గడచనినపిమ్మట యౌవనోద్రేక నిర్నిద్రుండై భద్రేభయానలం గాంక్షింపుచు మన్మథజ్వరవిహ్వలుండై వృథాయాసంబునం గొంతకాల ముత్తరించినయనంతరంబ సంసారమోహపాశములం గట్టువడి యీషణత్రయబాధితుండై వ్యర్థంబు లగు కుటుంబపోషణార్థంబుగా సకలమాయోపాయసంశయములం బరిభ్రమించుచుం గొన్నివర్షంబులు చనిన నటమీఁద జరాభారంబువచ్చిన భ్రాంతికి మూలంబై సంతాపించుచు సర్వేంద్రియముల సాంద్రవిలాసము దప్పి శ్లేష్మ వాతాదిఘోరరోగములం బీడితుండై ప్రాణావసానకాలమున విహంగపుంగవుచేత గ్రహింపంబడు భుజగంబు తెఱంగున మృత్యువుచేతం బ్రాణంబులు గ్రహింపఁబడినవృక్షం బాశ్రయించినపక్షులు వృక్షమును విడిచి తమతమద్రోవలం బోవురీతి దేహంబు దిగనాడి పన్నగంబు కుబుసంబూడ్చి స్వచ్ఛంబగుభాతి యాతనతనువుం గాల్చిన యజ్జీవుని మదీయదూతలు దోడ్కొని తెత్తు రట్టిపాపకర్ముల నిచ్చో నెల్లంగి బాధించినం బ్రాణంబులు కాయములం బాయవు బాసెనేని నిందు సంజీవని

యను గాఢ్పుగలదు గావున నమ్మహానిలంబు సోఁకిన బునర్జీవితులగుదు రింతియ కాని వీరలకు మరణముగలుగనేర దది యనాదికల్పితం బని తెలియందగు మరణమునకు బీజంబు జన్మము జన్మమునకు బీజంబు మరణము సిద్ధం బిమ్మహావ్యాధిమాన నాయనాశిభిషగ్వరుండగు మహాదేవుండుదక్క తక్కినవారలకు శక్యముగాదు జన్మమరణములు మహాదుఃఖకరంబని పెద్దలు చెప్పుదు రింక దేహనిర్ణయము జెప్పెద నాకర్ణింపుము. 67

సీ. నిర్లేపుఁ డీశుండు నిర్వికల్పుఁ డనంతుఁ డాద్యుఁడు నుత్తముఁ డప్రమేయుఁ
డమలభావుఁడు సచ్చిదానందవిగ్రహుఁ డగుమహాదేవునియందు విద్య
శక్తి కాద్యస్ఫూర్తి కోభిల్ల నవి మున్నె దృష్టాంత మధికవిస్పష్టమగును
తెలిసితి నది గాన దేవదేవుని మాయ వాగ్బుద్ధులకుఁ జెప్ప వశముగాదు

ఆ. నేను దెల్పినట్టి దిది తారకంబును, సాత్వికంబు రాజసంబుఁ దామ
సం బనంగ మూఁడుసంజ్ఞలు గుణములు, వానిలక్షణములు వరుస వినుము. 68

సీ. సత్త్వగుణంబు విజ్ఞానంబు భాస్వరమై శుభ్రవర్ణమై యలరుచుండు
రాజసం బతిచంచలవ్యథామూలమై లోహితరూపమై రూఢిఁ జెందుఁ
దామసంబు జడప్రధాని కోపోద్రేకమై శ్యామలాభమై యలరుచుండు
సౌఖ్యసుజ్ఞానభాస్వద్భాస మంధకజనము లజ్ఞానభాజనములయ్యె

తే. నిజముగానొకపురుషుండు నియతిచిత్తుఁ, డై మోక్షసామ్రాజ్యగతిరహించుఁ
బాంచభౌతిక మఖిలప్రపంచమగును, దెలియఁ దగువాని నెఱిఁగింతు ధీసమేత. 69

తే. తల్లిదండ్రులు భక్షింపఁదగినయన్న, పానరసమున షట్కోణపరవశముగ
గాయముదయించు జనకునికతనఁ గల్గు, మజ్జయును గోరు లెముకలు మానివర్య. 70

వ. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లైదు జ్ఞానేంద్రియంబులు తద్విషయములు శబ్ద స్పర్శరూపరసగంధంబులు వాక్పాణిపాదపాయూపస్థలైదును గర్మేంద్రియములు తద్విషయంబులు వచనదానగమన విసర్గానందములు మనోబుద్ధ్యహంకారచిత్తంబు లంతఃకరణచతుష్టయము త్రిగుణభేదంబని చెప్పంబడు సత్త్వమునం బరిశుద్ధగుణంబును బ్రసన్నత్వంబును నారోగ్యమునుం బుట్టె రాజసగుణమున రాజసభావంబు పుట్టెఁ దమంబునఁ గామక్రోధలోభమోహామదమాత్సర్యంబులు నాలస్యంబును నిద్రయుం బ్రమాదంబును వంచనగుణమును మొదలైనవిపుట్టె శరీరము పాంచభౌతికంబుగావున నందుఁ బుట్టినగుణము లంతఃకరణముచేత వరియింపఁబడుచున్న యవి కర్ణేంద్రియమువలనవినఁబడుశబ్దంబాకాశమునం బుట్టె తద్బలముంగూడికొని యాకాశమువలన వాయువుపుట్టె వాయుగుణము స్పర్శముగావున నందుఁ ద్వగింద్రియముపుట్టె నోయుట పడుట వచ్చుట పోవుట ముడుఁగుట యివి వాయుగుణ

ములు ప్రాణాపానవ్యానోదానసమానము లనియెడి పంచప్రాణములు నాగకృకర కూర్మదేవదత్తధనంజయములనుపది వాయువు లిద్దశవాయువులందుం బ్రాణవాయువు ముఖ్యంబని చెప్పంబడు నవ్వాయువు కంఠగోళమునకుఁ గ్రింద నాభిప్రదేశము నకు మీఁద సంచరించుచు నాసికారంధ్రముల నాభీకుహరమున హృత్పద్మమున వ్యాపించియుండునదిగదా భాషాశక్తికి మూలకారణ మపానవాయువు గుదస్థానమున మేఢ్రమునఁ గటిస్థలమున జంఘాయుగ్మమున జఠరంబున నాభీప్రదేశమున వృషణముల నూరుల విహరించునది మలమూత్రవీర్యవిసర్జనమునకుఁబ్రధానము వ్యానవాయువు దృక్శ్రోణము కర్ణరంధ్రముల జంఘల నాసాపుటంబుల మెలంగి ప్రాణాపానవ్యాపారములం గూడియుండు నమ్మూఁడువాయువులం దేకభావముగా సమానవాయువు జఠరాగ్ని సహచరత్వముగైకొని యన్నపానాదిరసములు దేహంబందు సమముగాఁ బంచిపెట్టును సర్వనాడిమార్గంబులం దిరుగాడు నుదానవాయువు కరచరణాద్యవయవములం జరియించుచు దృష్టాత్మబాధావ్యథలు మొదలైనవి పుట్టించుఁ జర్మరోమరక్తమాంసమేదోస్థిమజ్జాది సప్తధాతువులయందును నుపవాయువులు విహరించియుండు. 71

సీ. పావకువలన రూపవ్యక్తి దీపనశక్తి ప్రకాశము శౌర్యరూఢి
 తేజోవిలాసము ధీవిశేషము సూక్ష్మభావము కోపము ప్రబలుచుండు
 వనకల్పితము జిహ్వయును శైత్యమును శరీరద్రవమును జలం బధ్రువంబు
 ఘ్రాణంబు గంధము గౌరవస్థైర్యము లివి భూమిగుణములం చెఱుఁగవలయుఁ
తే. దత్త్వములలోనఁ బృథ్విప్రధానభూత, మదిగదా సస్యములకెల్ల నాలయంబు
 దానఁ బుట్టినవస్తువుల్ మానవులకుఁ జీవనోపాయములు గావె సిద్ధవర్య. 72

క. కావునఁ బృథ్వీభూతము, కేవలముఖ్యం బటంచుఁ గీర్తింతురు చి
 ద్భావులు త్వగాదిధాతువు, లావిర్భావంబుఁ జెంద నవనిం దోలుతన్. 73

ఆ. జఠరవహ్నివలన జంతువుల్ భక్షింపఁ, బడినయన్న మంత్యభాగ మగుచుఁ
 బక్వమైనఁ బరఁగుఁ బంకపురీషమై, గర్భగోళమందు ఘనవివేక. 74

తే. అన్నసారంబు మద్యాంశమాయె మాంస,మందు సూక్ష్మాంశమున మనంబాయెగాన
 నన్నమయమని మనము ప్రఖ్యాతినొందె, నుదకసారంబుమూత్రమైయొప్పుచుండు.

తే. అందు మధ్యాంశమున రక్తమాయెదాని, సూక్ష్మభాగంబు ప్రాణంబు సువ్వెయట్లు
 గానఁ బ్రాణంబు భువనాత్మకం బనంగ, మాన్యులెన్నుదు రఖిలసమ్మతముగాఁగ. 76

సీ. అగ్నికనిష్ఠమా యనఁగ శల్యంబుల మధ్యభాగంబున మజ్జయొదవె
 సూక్ష్మభాగమున వాక్స్ఫురణోద్భవంబయ్యె నట్లుగావునఁ దేజ మఖిలలోక

మున కభిన్నాత్మకమని చెప్పఁబడుశోణితంబునఁ బొడమె మాంసంబు దాన
మేదోద్భవంబయ్యె మెదడున కీకసములు గల్గె నందున వెలసె మజ్జ
తే. యట్టిక్రొవ్వున శుక్లంబు బుట్టె వీర్య, మందు వాతాదిధాతువుల్ గందళించి
యందు మాంసంబున నరములయ్యెఁజుమ్ము, మునిజనశరణ్యసానందమునివరేణ్య. 77
వ. మఱియు శరీరమున బదిదోసిళ్ల జలంబును దొమ్మిదిదోసిళ్లరసంబును నెనిమిది దోసిళ్లరక్తంబును నేడుదోసిళ్లపురీషంబును నాఱుదోసిళ్ల శ్లేష్మంబును నైదు దోసిళ్లపైత్యంబును నాల్గుదోసిళ్లమూత్రంబును మూఁడుదోసిళ్లమజ్జయు రెండుదోసిళ్ల మేదఃపంకంబును నర్ధాంజలిశుక్లంబును గలదు తద్వీర్యంబుగదా దేహమునకు మూలంబు నదియునుంగాక జలంబురుచికరంబులుఁ దరుణంబులు నవకంబునఁ జతుర్విధంబులై షష్టిశతత్రయశల్యంబులుం గలిగి యుండునని బుధోత్తములు చెప్పుదు రస్థిసంధులు నన్నూటపదిగల విపిరౌరవంబులు బ్రసవంబులు సేచనంబులు నులూఖఖండంబులు సముద్గమంబులు మండలంబులు శంఖంబులు ఘాతంబులు వాయసతుండంబులనం బేరుకొన్నకీకసంబులంగూడి కాయం బష్టవిధాస్థిసంధులం జెన్నొందు సర్వాంగములమీఁద మూఁడుకోట్లు నేఁబదిలక్షల రోమకూపములు విలసిల్లు భువనత్రయంబున నిట్టిశరీరముకంటె సారంబైనపదార్థం బెయ్యది దేహాభిమానంబునం బట్టువడి సాహంకారులై ప్రాలుమాలి మహాపాతకోపపాతములు సేయుచున్నవార లిట్టి దేహలక్షణంబు మోక్షాపేక్ష గల్గినమాన్యులకుంగాని యన్యులకు ధన్యులుపన్యసింపంబోరు మహాత్మా నీకతంబున నిమ్మహనీయరహస్యము ప్రకాశంబయ్యె నింక జీవస్వరూపముం జెప్పెద వినుము. 78
మ. నిరహంకారుఁడు జిన్మయాత్ముఁడు సదానిర్వాణసంధాయకుం
డురుతేజోవిభవాభిరాముఁడు మహాయోగానురక్తుండు శ్రీ
హరిపద్మోద్భవకీటకాంతపరిపూర్ణానందభావుండు శం
కరుఁ డర్కానలచంద్రనేత్రుఁడు జగత్కల్యాణహారీణుఁడై. 79
క. ఆడించువాఁడుఁ దానే, యాడెడుపురుషుండుఁ దానె యన్నియుఁ దానై
క్రీడించు విశ్వపురుషుని, వేదకలుగ నెంచఁబడు వివేకులమతముల్. 80
తే. జగములకు నెల్ల యోనిబీజప్రధానుఁ, డచ్యుతుఁడు శక్తిసహితుఁ డాద్యంతరహితుఁ
డఖిలలోకాధినాయకుం డైనశివుని, మాయ దాఁటంగశక్యమె మానవులకు. 81
తే. ఏనరునియందుఁ గరుణ యవ్వానిచేత, పుణ్యములు సేయఁబనుచు నేపురుషుమీఁదఁ
బ్రీతిగల్గదో వానిచేఁ బాతకములు, సేయఁ బంచు భూతేశుండు సిద్ధవర్య. 82
తే. సంశయాత్మున కెందు మోక్షఁబు లేదు, గాన సందేహమానాభిమాన మెల్ల
విడచి వేదాంతవాసన యొదవెనేని, వానిచేలిదె కైవల్యవైభవంబు. 83

తే. అట్టిపురుషుండు వినఁడు భయంకరోగ్ర, మామకీనలులాయసంబంధవిప్రుల
ఘంటికానేకకలితభీకరరవంబుఁ, బరమపావనమూర్తిస్వప్నమున నైన. 84

క. వేదాదిముఖ్యవిద్యా, స్వాదను లగువారు పాపసంఘములను వే
పోఁదోలి ముక్తికాంతా, శ్రీదళుకొత్తంగ మహిమఁ జెలఁగుదు రెలమిన్. 85

ఉ. ఎందునఁ బోనిపాతకము లించుక నెప్పుడుఁ దత్త్వబుద్ధిలో
నం దలపోసినంతట వినాశము నొందు మహాఘసంతతుల్
సందియ మేలఁ దూల గిరిసంఘములం దొకకొంతనిప్పుసో
కం దుదిముట్టఁ గాలినవగన్ భవబంధము లూడు జ్ఞానికిన్. 86

క. దర్పణములోన రూపు స, మర్పణముగఁ దోఁచు నాసమంబున జగముల్
దర్పకభంజనుమాయా, దర్పంబునఁ గల్గి వెలయుఁ దాపసవర్యా. 87

క. ఆశంభుమాయఁ గడువ ర, మేశాంబుజభవులుఁ జాల రీభువనంబున్
శ్రీశర్వునిమయమని యో, గీశులు దలపోతు రాత్మ నెక్కాలమునన్. 88

శా. ఆయోగీంద్రుల నెల్ల శంభుఁడు దయాహ్లాదంబు పుట్టింపఁగా
శ్రేయోధైర్యవిలాసలక్షణకళా శ్రీమంతులం జేసి మో
దాయత్థానసుఖం బొసంగు నిజ మట్లౌటన్ విచారించి మి
థ్యాయాసంబులు మాని మానవులు చేయంబోలు రుద్రార్చనల్. 89

సీ. సంసారబంధంబు సమసిపోవదు శంభుదాస్యంబుచేఁ గాని ధన్యమూర్తి
తాపత్రయంబులు దలఁగిపోవవు శివధ్యానంబుచేఁ గాని మౌనివర్య
దేహాభిమానంబు తెగిపోవ దీశ్వరభక్తిచేఁ గాని తాపసమృగేంద్ర
సకలసంశయములు జడిసిపోవవు శూలికీర్తనచేఁ గాని కీర్తివిహిత

తే. తనివిదీరనియాశలఁ దగులలేక, నిర్మలాద్వైతభావసన్నిహితుఁ డగుచు
రూఢి కెక్కును బుణ్యపురుషుఁడు నెందుఁ, గేవలానందభావనికేతనంబు. 90

తే. వలదు దానంబు ధర్మంబు వలదు తపము, వలదు జపనిష్ఠ వలదు సర్వంబు వలదు
కాయసంతాప మొనరించుఁగాని దాన, ముక్తి గల్గునె శంకరభక్తిలేక. 91

క. అవగుణశతములు వితరణ, మవలీల హరించురీతి యధమునకైనన్
భవభక్తి యింతగల్గిన, భవబాధంబులకుఁ బాలుపడఁ డా నరుఁడున్. 92

చ. దురితము జేసియైనఁ దుది ధూర్జటిపాదసరోజచింతనా
స్ఫురణముఁ జెందెనేనిఁ బరిపూర్ణచిదంబరమందె చేరు నా
పురుషుఁడు కోటిజన్మముల పుణ్యఫలంబునఁ గాని పుట్ట దీ
శ్వరపదభక్తి సిద్ధ మిపి శంభునిఁ గొల్వ భవంబుగల్గునే. 93

శా. ఈసంసారము దుఃఖహేతు వన సర్వేశాంఘ్రి పద్మార్చనా
శ్రీసంబంధము లాచరించిన నరశ్రేష్ఠు న్విలోకించి మ
ద్దాసానీకము భీతిపుట్టి చూర రాస్థానంబుగాన న్నమ
శ్శ్రీ సాంబాయ శివాయ యంచు నొడువన్ జేకూరు గైవల్యముల్. 94

తే. అభవుఁ డానందమూర్తి దేహములలోన, లీనమైయుండు జీవనిధానముగను
దానిమర్మంబు నీకు విస్తారఫణితిఁ, దెలియ వినిపింతు వినవయ్య ధీసమేత. 95

సీ. శ్రీమహాదేవుఁడు జీవస్వరూపమై జగమున వ్యాపించు సర్వగతుల
బ్రహ్మాదులకుఁ బట్టువడనిపరంజ్యోతి సచ్చిదానంద ప్రశస్తమూర్తి
సకలధర్మములకు సాక్షియై వెలుఁగును వేదాంతవేద్యుఁడు విశ్వమయుఁడు
విషయంబులకు నెల్ల వెలియైనపురుషుండు నిత్యుఁ డనంతుండు నిర్మలుండు

తే. నిర్గుణుం డమ్మహాత్ము వర్ణింపఁదరమె, యతని నెఱిఁగినవాఁడు మోహాంబువలన
విడువఁబడి మోక్షసామ్రాజ్యవిహితుఁ డగును, నిజము గావున శివభక్తి నెగడవలయు.

క. సకలము మాయాకల్పిత, మొకటైనన్ సత్య మనుచు యోజింపక భా
వుకముం గా నెటు లన్నను, బ్రకటాశ్చర్యంబు స్వప్నపదముఁ బోలెన్. 97

క. కలలోఁ గన్నపదార్థము, లలవడునే మేలుకనిన నగ్గతి మాయా
విలసనము మాన్పి తలఁచిన, వెలుఁగొందుం దానె తాను విశ్వాత్మకుఁడై. 98

వ ఇవ్విధమున విశ్వేశ్వరుండు విశ్వమయుండని భావింపఁదగుఁ బరమాత్మకు శరీరములు భిన్నంబు లనున్యాయంబున నానావిధజీవత్వము వహించియుండు జ్ఞానేంద్రియపంచకంబును నంతఃకరణచతుష్టయంబునుం గూడి యేకోనవింశతితత్త్వంబుల లింగశరీరంబయ్యెం దల్లింగశరీరమునం బ్రకృతికలితచైతన్యంబు ప్రతిబింబించుటం జేసి వ్యవహారమున జీవుం డనంబడియె నజ్జీవునకు క్షేత్రజ్ఞపురుషనామంబు లిహపరసుఖంబులు జాగ్రత్స్వప్నావస్థలుంగల వెట్లంటివేని ముకురమాలిన్యంబు వలన ముఖము మాలిన్యంబగు తెఱంగున మనోబుద్ధ్యహంకారచిత్తములం బొందిన దోషంబుల జీవాత్ముఁ డాలోకించుఁ దదన్యసంబంధమున జీవాత్మలకంతఃకరణంబునకు మాలిన్యదోషసంప్రాప్తి యయ్యెఁ దదభిమానంబునం దేకీభావంబైన దేహాదులకుఁ బరుండగు జీవాత్ముండు సుఖదుఃఖములంబొందు మధ్యందినమార్తాండకిరణము మరుభూములంజరించిన మూఢాత్ములకు జలంబై తోఁచుకైవడి గ్రహింపంబడని సూర్యుండు గ్రస్తుండగురీతి జీవాత్మనిర్లేపప్రభావుండయ్యును సుఖదుఃఖమ్ములు లోనగు తెఱంగునఁ దోఁచు టదియ విద్యాదోషంబని తెలియందగు పిండాండమున నఖశిఖపర్యంతము వ్యాపించి జీవాత్మ భ్రూమధ్యమునం దేజరిల్లుపురం బనునభిధానము గలమాంసపిండముల నాభికుహరంబునకుం బొడవుకంఠనాళమునకుం గ్రిందు

మధ్యాస్థిహృదయంబు గావునం దన్నాళమునం గూడుకొని సారసకోశముటీయున
నధోముఖంబైనదాని సూక్ష్మద్వారంబునం బత్ప్రకాశంబని చెప్పంబడుం దన్మహనీయ
ప్రదేశంబున. 99

క. వాలాగ్రముమెల్లనం బఱి, కేలాసము లగుట పంచశతసహస్రాం
శేల నుండుజీవుం, డాలీలనె సూక్ష్మరూపమై యుండుండున్. 100

ఆ. అట్టిప్రత్యగాత్ముం డవ్యయుండు కదంబ, పుష్పకేసరములపోల్కి హృదయ
నలినమందు వెడలి వెలుఁగును నానాము, ఖంబులై కళేబరంబు లొదవు. 101

వ. కావున నాడులు శరీరహితకరంబు లట్టినాడులు డెబ్బదిరెండువేలు గలవని మహా
యోగిశిఖామణులు వక్కాణింతు రందు ముఖ్యనాడు లేకోత్తరశతం బవి దశేంద్రి
యంబులం బ్రవేశనాడులు తద్విషయంబుల కభిముఖంబులై యనాదికర్మహేతు
వునం జేసి స్వప్నాదినీచభోగంబు లనుభవించుకొఱకు మహానదులు తీర్థంబు లనుభ
వించు నం దొక్కనాడి యూర్ధ్వగతం బై యంతంబులేక సుషుమ్నాఖ్యంబునం
ప్రసిద్ధం బై యుండు. 102

క. ఆనాడియందు జీవముఁ, బోనాడినవాఁడు పుణ్యపురుషుఁడు ముక్తి
స్థానంబుఁ జేరుయోగులు, ధ్యానింతురు వాని చిన్మయంబుగ జీవున్. 103

తే. తెలియ వినవయ్య రాహు వదృశ్యుఁడయ్యుఁ, దరణిమండలమున దోఁచుకరణి జీవుఁ
డణఁగియున్నాఁడు లింగదేహంబులోనఁ, గానరాకుండ వ్యాపకుం డైనవాఁడు.

క. ఘట మొండుచోటి కరిగిన, ఘటమండల నభముఁ గూడఁ గదులుం గాదే
ఘటభిన్న మైనగగనము, పటుగతి యాకాశమందె పరఁగినభంగిన్. 105

సీ. లింగదేహంబున లీనుఁ డౌ జీవుండు పూర్ణమహత్త్వంబుఁ బొందియుండి
కాయంబు లిడుచుఁ దత్కాల మారోపణ మాత్రమే కాని ధర్మంబుకాదు
కమలాప్తుఁ డఖిలలోకంబుల వెలిఁగించు సరణి జీవాత్మసుజ్ఞానరూఢి
ఘటసంశయంబునఁ గర్మసంప్రాప్తిభోగాదులఁ గడువేడ్క ననుభవించు

ఆ. కొఱకు బొందెఁ గాన విలసిల్లుఁ దల్లింగ, తనువుచెడదు ముక్తి గనుటదాఁక
కర్మరహితమైన కైవల్యసుఖము పక్, జెంద నడుగు దేహబంధకములు. 106

ఆ. వినుము ఘటము సంభవించుట నాకాశ, మునకు నొక్కట ఘట మనఁగ పేరు
వెలసినట్లు లింగవిగ్రహసంగతి, నవ్యయాత్మ జీవుఁడని చెలంగె. 107

శా. ఆలింగాంగము భంగమైనతఱి జీవాత్ముండు నిర్లేపుఁడై
హేలానందతభాసమానుఁ డగుసర్వేశప్రభావంబునన్
వాలాయం బిది వాసనాస్థితుల జీవభ్రాంతిమాత్రంబటం
చాలోకించుట మేలుగాదె మునిచంద్రా సాంద్రతేజోనిధీ. 108

వ. వినుము విజ్ఞానంబువలన స్థూలసూక్ష్మకారణశరీరంబులు నిర్మూలంబు లైన జీవాత్మ స్వయంజ్యోతిర్మయుండగు సూర్యుం డొక్కరుండు సర్వభూతంబులం దెబ్భంగిం బ్రేరకుండై విహరించునట్టిచందంబున దేహేంద్రియాదులకుం బరుండగు పురుషుం డివ్విధంబున జననమరణదుఃఖంబులు గలిగి మెలఁగినట్లు మాయాసంబంధంబునం బరిభ్రమించు నట్టిది స్వప్నతుల్యంబని భావింపందగు దేహేంద్రియంబుల నాత్మ బయలయ్యె మోహమాత్రంబునం గలసినట్లు దోఁచు స్వస్వరూపజ్ఞానేంద్రియం బయ్యేనేని స్వయంప్రకాశమానుండై వెలుంగు సత్యం బిత్తెఱంగున నాచేతం జెప్పం బడిన పరమరహస్యంబు దొల్లి దండకారణ్యంబున రాఘవునకు విశ్వరూపకుండై శివుం డానతిచ్చిన వేదాంతసారంబగు నీమహనీయాఖ్యానం బెవ్వరేనియుం బఠియించిన వినినం బుస్తకంబున లిఖించినం బుణ్యపురుషుల కాత్మజ్ఞానంబు కరతలామలకంబై యుండు దీనిసందేహించిననరుం డెన్నిమార్గంబులం దలంచిన బవిత్రుండు గానేరం డని వేదశాస్త్రంబులు ఘోషించుం గావున సహజంబై యొప్పు మీ రెఱుంగని బ్రహ్మవిద్యావిశేషం బెద్దేనియుం గలదె ప్రౌఢపురుషుండు డింభకుని యవ్యక్తమృదుమధురవాక్యంబుల కౌతూహలోపేతుండై వినంగోరినతీరున నన్నడిగితి రత్యంత సంతోషంబయ్యె నింక నెయ్యది కర్తవ్యం బనిన విని సానందుం డాత్మగతంబున. 109

క. నిజ మీతనివాక్యంబులు, త్రిజగద్గురుఁ డైనశివుని దివ్యవిలాస
ధ్వజములని తెలియఁ దగినవి, వృజినాత్ములబాధఁ గన వివేకము చెదరెన్. 110

క. కావునఁ గార్యాద్వైతము, భావింపనివాని బురుషపశువం డ్రు జనుల్
భావాద్వైతమునరులకుఁ, గావలెఁ గార్యములు తలఁప గాదు సమముగన్. 111

క. పరుఁ డొకఁడు బాధపడఁగాఁ, బరికించుచుఁ బరమశివుఁడుబాధించును ద
ద్దురవస్థఁ బడును దానని, యరసినమానవుఁడు మానవాధముఁ డనినన్. 112

వ. అని కొండొకతడవు చింతించి దండ్రి కిట్లనియె. 113

క. నీవాగ్విభూతిసత్యము, నీవర్తన మఖిలశుభము నిర్వాణముఖ
ప్రావీణ్యం బగుసత్కథ, నీవైభవ మలర మాకు నేర్పితి వఁఘా. 114

క. నీచే వినినచరిత్రం, బాచంద్రార్కముగ వెలయు నాత్మజ్ఞమనో
గోచరసౌఖ్యము లెసయఁగ, నీచతురంబోధియుఁ తమహీవలయమునన్. 115

ఆ. ఇమ్మహారహస్య మెఱుఁగఁ జెప్పితి వందు, కతన హృదయవీథి గౌతుకంబు
సాట్యమాడఁదొడఁగె నళినబాంధవపుత్ర, నిన్నువంటిధన్యు లెన్నగలరె. 116

ఆ. వినుము ధర్మరాజ మనములో దాఁపక, తెలియఁజెప్పవలయుఁ దేటపడఁగ
వాఁడె చచ్చుదాఁక నయ్యాళి గలుగునె, మొఁనసి వీరి కింక ముక్తి యెపుడు. 117

వ. అనిన విని మందస్మితవదనారవిందుండై యరవిందమిత్రనందనుం డిట్లనియె. 118

మ. అమరేంద్రద్రుహిణాంబుజోదరుల కుయ్యాలింప లోకోపకా
రముగాఁ దాల్చినకాలకూట మిఁక భారంబంచుఁ గాత్యాయనీ
రమణీపీనకుచాగ్రగంధఘనసారస్ఫారవక్షస్స్థలుం
డు మముం జూచినవాఁడు వీరలకు మోక్షోపాయము గల్గెడున్. 119

క. సురగరుడోరగవిద్యా, ధరకిన్నరవరులుగూడి దంతిముఖునకుం
బరిణయము సేయునాఁటికిఁ గరుణాకర నారకులకుఁ గలుగుసుఖంబుల్. 120

క. అపరావనీధరంబున, దపనుం డుదయించి పూర్వధరణీభృచ్ఛృం
గపరిస్థలమునఁ గ్రుంకిన, విపులత నావేళఁ గల్గు వీరికి ముక్తుల్. 121

ఆ. వీతిహోత్రుఁ డొడల శీతలం బూనిన, నాఁడు లవణజలధి నవ్యమధుర
మైననాఁడు గల్గు మౌనీంద్ర వీరికి, దేహబంధమోక్షదివ్యపదవి. 122

క. భైరవుఁడు గోఁచిగట్టినఁ, గైరవమిత్రునకు జాడకరకిరణంబుల్
వారంబుల లేకుండిన, నారకులకు ముక్తిగల్గు నాఁడు మునీంద్రా. 123

క. అనిచెప్పి యూరకుండిన, మునిపతి మందస్మితాస్యమునఁ దనలోని
ట్లనియెన్ భాస్కరసూతికి, ఘనమైన విశేషబుద్ధి గలుగ దదేమో. 124

సీ. శైవాగమాంతవాసన లేదు గాఁబోలుఁ గలిగిన నిబ్భంగిఁ బలుకఁబోఁడు
సహజమద్వైతవాసన గాంచువారికిఁ గర్మకాండప్రసంగం బదేల
పరులకు బుద్ధిఁ జెప్పఁగ నేర్చుపెద్దల కుండకపో దొక్కయుంలిపిగుణము
నదిగాక యీపుణ్యుఁ డనవరతము పాపజనములఁ దెచ్చి భంజనమొనర్చి
తే. శాద్రనిర్నిద్రరాజ్యగర్వమున మెలఁగు, చున్నప్రేతాధినాయకుం డెన్నఁ గలఁడె
యఖిలపావనశైవరహస్యమహిమఁ, గాన శివమంత్రమున బోనికలుషమెద్ది. 125

సీ. శతకోటిపాతకశైలేంద్రనిర్ఘాత శతకోటితారక శంభుమంత్ర
సుజ్ఞానచపలగాఢాంధకారకఠోర చండాంశుకరము శ్రీశంభుమంత్ర
మాపత్పరంపరాటోపకాలంబున ఝుంఝూనిలంబు శ్రీశంభుమంత్ర
మభవవిరోధివర్గానార్య దుస్సహజ్వలనకాలంబు శ్రీశంభుమంత్ర
తే. మఖిలవేదాంతవేదమధ్యప్రకాశ, మానసాయకమంత్రంబు మంగళంబు
సప్తకోటిమహామంత్రసార్వభౌమ, మట్టిపంచాక్షరియుం జగంబుదుఁ గలుగ. 126

క. నరులకు నరకము లెడలును, బరికింపఁగ శివకథాప్రకాశితపంచా
క్షరి విన్నఁ బఠన సేసినఁ, బురుషతతికి జన్మదుఃఖపుంజము గలదే. 127

సీ. పంచాక్షరంబుచేఁ బ్రబలురుద్రాధ్యాయ మది వెలింగించి విఖ్యాతిఁ గాంచె
యర్థకాండము దాన సార్థకమై సప్తకాండము ల్భాసిల్లుకతనఁ జేసి

సర్వయజుర్వేద మర్విఁ బ్రకాశించు రుక్సామమధ్యమై రూఢిఁ గాఁగ
గావునఁ బంచాక్షరీవైభవమున వేదంబులకెల్ల జీవంబుగల్గె
తే నట్టిపంచాక్షరియు నగస్త్యావనీసు, తాధినాయక తారక మఖిలదురిత
హారము తన్మంత్రమాహాత్మ్యమరయ లేఁడు, కటకటా కాలుఁడెట్లదిక్పాలుఁడయ్యె.
క. ఆమంత్రం బీనరులకు, శ్రీమంతులఁ జేయలేదె చెప్పఁగనేలా
యీమాడ్కి ననుచుఁ బ్రేత, గ్రామణికిని మానిరాట్ఛిఖామణి మఱియున్. 129
మ. జలదశ్యామలకంఠపూజసరియే చర్చింపఁ జిన్మూర్తిపై
జలముల్ జేరెఁడు జల్లిపత్తిరిడు నాసర్వజ్ఞవంశస్థుల
న్విలసత్కీర్తిరమాభిరామగరిమావిర్భూతులం జేయుఁ ద
త్ఫలమంచున్ వినరో పురాణములు చెప్పన్ వీర లర్కాత్మజా. 130
సీ. అర్కశశాంక శుక్రాక్షు నారాధింపఁ గాంచనసుమమైనఁ గలుగదేమొ
శశిమౌళి రాజిలు శివుశిరంబునఁ బూన్ప దూర్వాంకురంబైన దొరకదేమొ
కాంచనాచల లసత్కార్ముకుఁ బూజింపఁ గాంచనసుమమైనఁ గలుగదేమొ
దూర్వాసముఖ్యస్తుతుని శిరంబునఁ బూన్ప నర్కపుష్పంబైన నబ్బదేమొ
తే. పత్రములనైన సూనసంపదనునైన, శ్రద్ధనైనను గేవలాశ్రద్ధనైన
హరునిబూజించువారు నీపురముఁజూడఁ, బోరు వీరల కాపాటిపాలుపు గలదె.
క. కలిగిన నరకోపద్రవ, మలవడఁబో దింత భసితమయినను లేదే
తెలిబూతి నొసల నలఁదిన, నలఘుస్వాంతులను బొంద వఘసముదయముల్. 132
సీ. భద్రమై కాలాగ్నిరుద్రోపనిషదర్థముల భస్మమహిమంబు వెలుఁగుచుండుఁ
దొలుత కాలాగ్నిరుద్రునివీర్య మని చెప్పుభసితంబు తద్భూతి ఫాలదేశ
మందు ధరించు పుణ్యాత్ముని కోవిదుల్ వీర్యవంతుండని వినుతిసేతు
రదికాక విప్రుని హరియించు కలుషంబు కల్లుద్రావినపాతకంబు గురువ
తే. ఘూటితోఁ బొందు దోషసందోహమైనఁ, దొలఁగఁ బాయును బావనాత్మునిగఁ జేయు
భస్మధారునిగాన నబ్భస్మ మింత, వీరి కేటికిఁ బుట్టదో విశ్వమునను. 133
క. రుద్రాక్షధరుని లీలా, రుద్రుం డని జెప్పఁబడును రూఢి చదువులన్
రుద్రాక్ష మొందఁదాల్పను, పద్రవములు వీరికేల పాటిల్లెనొకో. 134
తే. కోటిభూసురహత్యలు కోటిపరవ, ధూటికాగతిదోషము ల్దొలఁగిపోవు
నరుని నూఱేండ్లలో నొకపరి మహేశ, శివశివా యనఁజాలు విశేషమదియె. 135
చ. ఒగి శివరాత్రి జాగరణ మొయ్యనఁ జేసినపుణ్యశీలునిం
బొగడుదు రుత్తమోత్తములు భూతపతిప్రతిమానుఁ డంచు సా

సుగుణము వీరియందుల విశుద్ధిగఁ గల్గదొ యట్టులైన ని
వ్వగ నరకార్తిఁ బొందుదురె వారిజమిత్రకుమారశేఖరా. 136

తే. దోషములఁ బొందఁబోరు ప్రదోషశీల, మానసులు సోమవారసమ్యగ్వ్రతస్థు
లష్టమూర్తిపశంకరు లైనవార, లావిశేషంబు వీరల కబ్బ దకట. 137

క. అరుణాచల మరుణాచల, మరుణాచల మని పఠించునాతఁడు పొందుం
గఱకంఠులోకసౌఖ్య, స్ఫురణం బది వీరి కేల పొడవదొ బుద్ధిన్. 138

క. శ్రీమచ్చిదంబరేశ, స్వామిని దర్శింప శంభుసామీప్యకళా
ధాములుగారా వారలు, పామరులగు వీరి కేలపసుపడ దదియున్. 139

క. గోకర్ణయాత్ర నడచిన, శ్రీకాశీస్థలము ద్రొక్క శ్రీగిరిశిఖరా
లోకనచేసిన పుణ్యా, శ్లోకులు ముక్తులని వినరె సొలవక వీరల్. 140

చ. పశువులు నూఱుకోటులును భవ్యతురంగము లైదుకోటులుం
బసిఁడియుం మేరువంతకలభంబులు నాలుగుకోటులుక్ మహా
యశు లగువిప్రకోటికి నయంబున దానమొసంగుపుణ్యము
బశుపతి నొక్కసారి గని ప్రస్తుతిచేసినవారి కబ్బదే. 141

క. అపూర్ణపుణ్యనామం, బీపాపధ్వాంతులం దొకించుక యైనన్
జూపడదేమో యన న, త్తాపమునకు నిట్టులనియె దండాయుధుఁడున్. 142

చ. మునివర నీదువాక్యము లమోఘము లాగమధర్మశాస్త్రసం
జనితము లైనప్రశ్నలు నిశాకరశేఖర భక్తిసూక్ష్మ మీ
జనుల కొకింతగల్గిన విచారము సేయక వెట్టివాఁడనా
వినుతపురాణవేదముఖవిశ్రుతభాషలు గల్లలందునే. 143

చ. విను మును జారకాంతకు నవీనసుమంబులు దెచ్చుచోటఁ గ్ర
న్నన నొకపువ్వు దప్పిపడినం గని లేమకుఁ గా శివార్పితం
బనినమహత్త్వ మీశ్వరకృపాతిశయంబున శ్వేతనాముఁ డే
పున మహనీయుడై భవముఁ బొందఁడె నిర్జరబృంద మెన్నఁగన్. 144

క. మీరిపు డెన్నినప్రశ్నలు, సారంబులుగాన వానిసందేహంబుల్
దీరఁగ వినుమితిహాసం, బారయ వినిపింతుఁ జిత్రమై యలరారన్. 145

వ. అనవుడు నయ్యార్యకులవర్యుండు తత్కథాశ్రవణకుతూహలుండై యడిగె నని
చెప్పిన శౌనకాదు లటమీఁదివృత్తాంతంబు దెలుపుమనుటయు. 146

మ. కలుషధ్వాంతపతంగ తత్త్వపరవాక్యచ్ఛేద వేదండమం
డలదిత్పూరిత ధామ ధూసరమహాటోపస్ఫులింగచ్ఛటా

వలయూదాకృత పీఠభూషియన దుర్వారస్ఫురజ్వాలికో
జ్జ్వలకోలాహలకాలకూట హరణవ్యాపారపారాయణా. 147

క. హరిహయసన్నుత పదయుగ, హరిబాణా త్రిపురరాక్షసాధిపహరణా
హరికులభూషణ గౌరీ హరిణదృశామిత్ర భాస్వదమలచరిత్రా. 148

మాలినీ. నిగమచయతురంగా నిత్యకల్యాణతుంగా
భగనయనవిఘాలా భక్తహృత్సాదుఖేలా
జగదభినుతకీర్తీ సచ్చిదానందమూర్తీ
నగభృదజవిశేషా నాగదైతేయశోషా. 149

గద్య. ఇది శ్రీమత్కాళికాంబా వరప్రసాదలబ్ధ సాహిత్యవైభవ సదాశివస్వరూప సద్గురుచరణారుణరాజీవ సేవాసమాసాదితాద్వైతానుభవ కౌశికగోత్రసుధార్ణవ పరిపూర్ణకైరవబాంధవకోటి బాపనయ్యతనూభవ సవినయగుణవిధేయ శివరామ నామధేయప్రణీతంబైన సానందోపాఖ్యానంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

# పంచమాశ్వాసము



మత్తుంగతురంగా
కామితగంగాప్రవాహ కంపితశోణ
స్తోమజటాధరకంధర
శ్యామలచిత్కాళి కాళహస్తిపురీశా. 1

తే. అవధరింపుము శౌనకాద్యఖిలమునుల, కిట్టులని చెప్పె సూతమౌనీంద్రచంద్రుఁ
డవ్విధంబున సానందుఁ డడుగుటయును, జిత్త మిగురొత్తమఱియు నిశ్చింతతోడ. 2

క. విను కాంపిల్యపురంబున, ననఘాత్ముఁడు యజ్ఞదత్తుఁ డనువిప్రుఁడు స
జ్జననుతచరితుఁడు విద్యా, వననిధి పావనమహాసవనదీక్షితుఁడున్. 3

చ. అసమకళావినిర్మితగుణాతిశయంబులకెల్ల శాంతమై
యొసఁగును బ్రహ్మవంశమున కెల్లను వజ్రకిరీటమో యనం
గుసుమశరోపమాన నిజకోమలదేహ లసద్విలాస మా
రసి కను లేమ లాత్మభ్రమరంబులకుం దగు చంపకాకృతిన్. 4

క. ఆతనికులసతి సాక్షా, చ్చేతోభవజనని సకలశృంగారకళా
స్వీకృతమహనీయ శీలస, మేత విమల యనెడిపేర మేదిని వెలయున్. 5

క. శుభములగుతత్పురంబున, నుభయమతంబులకు నొప్పుఁ బుట్టఁగ నెపుడున్
శోభాకారుఁడు గుణనిధి, సౌభాగ్యోదయవిలాస సంచితరతుఁడై. 6

వ. పెంపొందునందనునిం గురుం డుపనీతుం గావించి యాచార్యునొద్దం జదువం బెట్టిన. 7

మ. చదువం బోవఁడు వేదపన్నములు శాస్త్రంబుల్ విలోకింపఁబోఁ
డుదయంబౌ తటి స్నానమాడఁ డసమానోదంచితబ్రాహ్మణా
స్పదగాయత్త్రి జపింప నొల్లఁడు దురాచారైకబుద్ధిన్ సదా
మదనామ్నాయవిచారదక్షజనసంబంధంబుఁ గావించుచున్. 8

మ. పురమందున్ విహరించు వారవికచాంభోజాస్యలిండ్లన్ విటో
త్కరముల్ దా నొడఁగూడి జూదములు నిత్యంబాడి యేప్రొద్దు వే

గరతిక్ దిండికి వచ్చు నింటికి వివిక్తవ్యక్తవాచాసుధా
స్ఫురణం బేర్పడఁ దల్లి కిచ్చకపుమెచ్చుల్ చెప్పుచుం బోవుచున్. 9

ఆ. గొడ్డు వీఁగికన్న బిడ్డఁడు గావున, వానిమీఁది ప్రేమ మానలేక
సుతునిదుష్టతనము సూచింప దింతయుం, సోమయాజితోడ సోమిదమ్మ. 10

క. గారాబుపట్టి యాత్మా, గారంబునఁ గల్గు మౌక్తికంబులు హీర
స్ఫారాంగుళీయకంబులు, చీరెలుఁ బోగులును ధనవిశేషం బెల్లన్. 11

ఆ. కొల్ల వెట్టుచున్నఁ దల్లి యేమనఁబోదు, తండ్రి భార్యనడుగఁ దనయుఁ డెందుఁ
బోయెననుచుఁ జదువఁబోయె బిడ్డఁడు భోజనంబు నేసి యని దినంబు పలుకు. 12

వ. అంత నొక్కనాఁడు జనయిత్రి గారాబుకుమారుని కూరిమిమీఱం జేరంజీరి తండ్రీ మీతండ్రి మహాకోపియని యెఱుంగుదువుగదా సాదురేఁగినఁ దలపోలం బునఁగాని నిలువఁ డనువిధంబున నీదుర్వర్తనం బద్దీక్షితుఁ డెఱింగిన నీకు నాకును బ్రాణంబులకు వచ్చుం బుడమిఱేనికి వినంబడెనేని మనమాన్యక్షేత్రస్వతంత్రంబులకు హానివచ్చుం గావున భవదీయవంశకీర్తియు గణియించి యపకీర్తి రాకుండ దుర్మార్గసంసర్గంబు నిగ్రహించియుండు మింక మంకుతనంబుమాని యింటంగల పదార్థంబును వ్యర్థంబులు సేయవలదు తక్కువపడ నొకపూట కిన్ని దావాంబిచ్చు వారునుం గలరే యని యనేకప్రకారంబుల బోధించిన విని వినయములు సేసి కొని శీఘ్రంబుగా భోజనవాలాయంబులు దీర్చి యెందేనియుంబోయె నద్దినంబు ప్రొద్దున సోమయాజి నదీతటంబున కేగి ప్రాతరుచితకృత్యంబు నిర్వర్తించి వచ్చు నెడ ధౌతవస్త్రంబు తొదల ప్రసన్నంబుగాఁ జుట్టి సమిత్కుశపత్రంబులు సంపాదించు కొని మార్గంబున వచ్చుచు. 13

సీ. ఒకపల్లవుని కేల నుంగరం బుండిన నటునిల్చి ఱెప్పవేయకను జూచి
తనకుండలము లూఁగఁ గలయూఁచి తలయూఁచి యిది వీనిచేతికి నెట్లు వచ్చె
భూపతి మును దానపూర్వకముగ నిచ్చినట్టి హీరాంగుళీయకము గాదె
తెలియ శోధింపక కళవళపడరా దటంచు నవ్విటుని నేపారఁ బిలిచి

తే. యోరి యుంగర మెటులు నీకొదవెఁ జెప్పు, చెప్పకుండిన రాజుతోఁ జెప్పి నీకు
బుద్ధి చెప్పింతు ననిన నప్పోకిరీఁడు, వెఱపుహృద్వీథిఁదోఁచి యవ్విప్రుఁ జూచి.

ఉ. దండముస్వామి యేమిటికి దండన సేయుదురయ్య మీతనూ
జుండు విటప్రవర్యుఁడయి జూదము లాడఁదొడంగుఁ గాన మే
మొండొరుపందెముల్ చఱచి యోటమిగెల్పులనాడొకొన్న నా
తం డటులోడి యుంగరము దక్కిన నాకొసఁగెన్ ద్విజోత్తమా. 15

తే. మీసుతుని మట్టుపెట్టక మీఱఁబెట్టి, యెవరి బెదరింపవచ్చినా రెవ్వరిండ్లు

పుచ్చుకొనెంచినారు మీపుణ్య మిట్లు, మాటలాడంగవల దంచు మసలకరిగె. 16

వ. అంత నాగృహస్థుం డచ్చోట నిలువ సైరింపంజాలక నిర్భరకోపానలంబునం బెటిలిపడుచుఁ గుటిలభ్రుకుటిచటులకటతటుండై గొణుఁగుచు నాడుఁగఱచుచుఁ గాఁపురంబు పోయెనని చాలవేగంబునం జని నిజమందిరంబుఁ జొచ్చి పాదప్రక్షాళనం బాచరించి కడిపోవతులు దండెంబునం దగులవైచి రోషవిషాదంబులు తెలియంబడకుండఁ దనభార్యామణి నాలోకించి. 17

శా. ఔనే పల్కుపు రాగదే యిటకు వాక్యంబున్న దీవేళఁ ద
మ్మానాయుంగర మేలతామసము పొమ్మా దానిఁ జేకోక నీ
శానారాధన మాచరింప ననినన్ స్నానంబు హోమంబునుం
గానీ భోజనమైనపిమ్మట నలంకారించుకోనిచ్చెదన్. 18

ఆ. కుడుపవేళగానఁ గొంద ఱభ్యాగతుల్ వచ్చి కాచుకున్నవార లగ్గి
డాఁకినారు వీర లాఁకొని చిన్నవాఁ, డిదిగొ వచ్చు వెండి యొంతపడవు. 19

ఉ. నావుడు సోమయాజి నలినాక్షిఁ గనుంగొని చెల్లునే భళా
నీవగలెల్లఁ గంటి మిటు నేర్చితివా, యతివా కుమారుఁడున్
నీవును గొంపఁ గూల్చితిరి నేర్పరికాఁతలు చాలుఁ జాలు నే
త్రోవలఁ బోయెనో యొడలితో నొనగూర్చిన వస్తుసంఘముల్. 20

తే. అతివవా కావు దానవురాల వీవు, పుత్రుఁడా వీడు నాపాలిశత్రుఁ డరయఁ
బొండి మీరిద్ద ఱిఁక వెళ్ళిపోకయున్నఁ, జావనఱుకుదు మీపొత్తు చాలుఁ జాలు.

క. అని విప్రవర్యుఁ డాత్మభవనమునఁ గలభూషణములు వస్త్రచయంబుల్
ధనములు రత్నము లారసి, కన నేనుఁగుదిన్న వెలఁగకాయవిధమునన్. 22

వ. సర్వవస్తుశూన్యం బయినమందిరం బాలోకించి ధైర్యంబు జిక్కబట్టలేక చతికిలంబడి పెద్దయుం బ్రొద్దునకు లేచి వేఁడినిట్టూర్పు లడర సంతాపసముద్రంబున మునింగి కనుంగొని నిప్పు లుప్పతిలి కనలిపడి వేణుదండంబుఁ గేలం గైకొని యిల్లాలి నిల్లువెళ్ళం దఱిమిన మిడిమిడిమధ్యాహ్నంబునఁ గాళ్ళ గాలి పెల్లు దుఃఖించుచు నక్కలువకంటి పుట్టినింటికిం బోయిన. 23

శా. ఆవృత్తాంతము యాజ్ఞదత్తి విని శోకాయత్తుఁ డై యింటికిన్
బోవన్ రా దిఁక యేదిత్రోవ యని యాప్రొద్దొక్కచో డాఁగి రా
జీవేశోదయమైన లేచి పరదేశంజేసితే దైవమా
యేవిద్యావిభవం బెఱుంగ నకటా యెవ్వారలం జేరుదున్. 24

శా. విద్యావంతులు వందనీయు లఖిలోర్వీరాట్సభాభూషముల్
విద్యాధీనులు పుణ్యమూర్తు లనఁగా విందుం బురాణంబులన్

విద్యాపీఠులు నెందు నొక్కసరియే వెయ్యేల నుద్యత్కృపన్
విద్యాశూన్యుని నన్ను మజ్జనని మన్నించుం గదా త్ర్యంబకన్. 25

ఆ. తల్లి మొదటి వేల్పు ధర్మశాస్త్రంబుల, దల్లిలేనివానితను వదేల
తల్లియుండవలయుఁ దనయుని కటుగాక, దల్లివలయు మనుజతతులకెల్ల. 26

క. సరిచెల్లనికా స్సైనను, పదికింపఁగ జేతలేదు పరభూములకుం
జరుగక యుండిన భూపతి, యరికట్టఁడె తన్ను చోరుఁ డని కోపమునన్. 27

క. గుణనిధి యనునోటను దుర్గుణనిధి యనుకొనరె గురితెఱుంగుజనంబుల్
క్షణమిందు నిల్వరాదని, మిణుకుచుఁ గన్నీరుదొరుఁగ మెల్లన నరిగెన్. 28

వ. ఇట్లు పురంబు నిర్గమించి దక్షిణాభిముఖుండై రెండామడదూరంబు కడచి చండకర చండకిరణంబులకాఁకసోఁకోర్వక వీఁకచెడి యొకానొకటిచిచ్చునం దేఁకువదప్పి పల్లవ పత్రశిఖాశ్లాఘనీయ శాఖావృత శీతలచ్ఛాయాసమేతం బగు నొక్కవటమహీ జాతంబు క్రిందం గూర్చుండి. 29

చ. కర మనిశంబుఁ దల్లి కుతుకంబున జేపటివేళ గిన్నెలోఁ
బెరుగును వంటకంబు వడపిందెలు వెట్టుట లెంచి పిమ్మటన్
సురుచిరశాకపాకములు సూపము నోగిర మప్పడాల్ మనో
హారములు దొన్నెనెయ్యి పరమాన్నముఁ బచ్చడులుం దలంచుచున్. 30

క. ఈచందము దనకెవ్వరు, వాచవులుగఁ బెట్టుదురు శివశివాయనుచున్
లేచి యపరాబ్ధి మునిఁగెడు, నాచందము బుద్ధిఁ దోచునటు రవిగ్రుంకెన్. 31

క. దివియను శంభునిగుడికిన్, శివరాత్రికి జాగరంబు సేయగ శోభా
ధవళవిభూతి ధరించుక, శివభక్తులు వచ్చినట్లు చెలఁగెం దారల్. 32

క. శివరాత్రి నుపవసించిన, వేవురుల శరీరగుహల వెలువడునహో
నివహోచ్ఛభల్లములగతి, భువనంబులు నిండెఁ దిమిరపుంజము వెలుచన్. 33

శా. ఆవేళన్ విమలాత్మనూభవుఁడు శౌర్యాటోపధైర్యస్థుఁడై
పోవం దత్పురరాజమార్గమున శంభుం గొల్వ శైవద్విజ
గ్రైవేయం బతిభక్తిభావము చెలంగం దెచ్చునై వేద్యపా
త్రావిర్భూతసుగంధగంధవహ మాఘ్రాణించుచున్ మెచ్చుచున్. 34

శా. ఆశైవద్విజువెంట నేగి కనియెన్ హర్మ్యప్రభోదారమున్
వైశంపాయనసంయమిప్రముఖనిర్వాణక్రియాసారమున్
వేళగ్రామహిరణ్యహీరమణిరాడ్విఖ్యాతశృంగారమున్
కౌశల్యప్రతిహారవార మభవాగారప్రతీహారమున్. 35

వ. ఇవ్విధంబున మహాదేవు గోపురద్వారంబుఁ గాంచి యమ్మహాత్ముల వెంటఁ బ్రాకారంబు

లు సొచ్చి పోయి కొన్ని మండపంబులు గడచి దేవలంబుం జేరి యమ్మంజుళసరసపదార్థ సంపన్నంబయినయన్నం బాహారంబు నా కేటీరునదొరకునో యని విచారించి యొక్క చక్కి వసియించి యుండె నద్దినంబు శివరాత్రి గావునఁ బాంథలోకంబు లోకేశ్వర సన్నిధానంబున జాగరణం బొనరించి మించిన పుణ్యంబు సంపాదింపఁ దలంచి నిర్మలచిత్తులయి పుణ్యతీర్థంబుల మునింగి ధౌతోత్తరీయంబులు ధరియించి భస్మ రుద్రాక్షమాలికాలంకృతులయి శైవంబగు ప్రసాదపంచాక్షరీజపంబు గావించి ప్రదక్షిణనమస్కారపూర్వకంబుగాఁ బంచమస్తోత్రపవిత్రాననులయి భయభక్తి సంభ్రమంబు పెనంగొనఁ గొంద ఱఖిలేశ్వరపూజానుషంగు లగువిప్రపుంగవు లమ్మహాగర్భగృహంబు సొచ్చి నయనారవిందంబులు కందళింప సందర్శించి రప్పుడు.

ఉ. కాయజగర్వభంగము వికాసశుభాంగము నిందిరామనో
నాయక పంకజాసన సనాతనయోగినికాయమానసా
బ్జాయత మత్తభృంగము కృపాబ్ధితరంగము భక్తరక్షణో
పాయపరప్రసంగము శివాతనుసంగ దివ్యలింగమున్. 37

వ. సేవించి పావనపూజాద్రవ్యంబులు కట్టి వేదవాదంబులు చెలంగ బహిర్ద్వారంబున భేరీమృదంగ కాహళ నిఖిలవాద్యవిశేషంబులు ఘోషింపం బరమోత్సాహంబున. 38

సీ. అభిషేక మొనరించి రభినుతి ప్రియునకు నంబరం బొసంగి రాశాంబరునకు
గంధం బలందిరి గంధేభదనుజారి కక్షతలిడిరి ఫాలాక్షునకును
సుమము లర్చించిరి సుమశరవైరికి దీపమెత్తిరి జగద్దీపకునకు
నగరుధూపముఁ ద్రిప్పి రగజాధిపతికి నైవేద్య మిచ్చిరి వేదవేద్యునకును
తే. చారుమతు లట్లు వివిధోపచారవిధుల, నిందుశేఖరుఁ బరితృప్తిఁ బొందఁజేసి
నిటలవిన్యస్తహస్తులై నిటలనయను, భజనసేయంగఁ దొడఁగిరి భక్తియుక్తి. 39

శా. శ్రీకంఠాయ మహేశ్వరాయ సుజనక్షేమాయ భీమాయ గౌ
రీకాంతాసుహితాయ వీతమదనోద్రేకాయ రుద్రాయ వి
ద్యాకల్పాయ మునీంద్రసంస్తుతమహాదేవాయ భర్గాయ వి
శ్వాకారాయ నమోనమో యనుచు నుద్యత్స్తోత్రపారీణులై. 40

వ. ఇట్లనేక భంగుల గౌరీమనోహరుం గైవారంబులు సేయువారును ఫాలాక్షునకుఁ బ్రదక్షిణంబులు గావించువారును నిందుధరునకు సాష్టాంగదండనమస్కారంబులు సమర్పించువారును నందికేశ్వరు పెఱుందనిలిచి కరధారితకర్ణవిహారులయి నృత్యంబులు సలుపువారును బంచాక్షరీమహామంత్రరాజంబు జపియించువారును బంచముఖుని హృత్పద్మంబున ధ్యానముసేయువారును బ్రతియామంబునం బరమేశ్వరుపూ

ణ్మయలింగంబుల నావాహనంబుసేసి బిల్వపత్త్రార్చనాదిషోడశోపచారంబులఁ బూజించువారును శివనామాంకితగద్యపద్యంబులు పాడువారును బావనశైవపురాణంబులు చదువువారును దత్ప్రసంగంబులం బ్రొద్దుపుచ్చువారును శైవరహస్య మహిమాతిశయంబులం గలంచి యోజించువారును నై బ్రహ్మక్షత్త్రవైశ్యశూద్రు లమ్మహాకాలంబు వేగునంతకు జాగరణంబుసేసి కొందఱు మాటలాడుచుఁ దబ్బిబ్బులాడువారును గొందఱొండొరులమీఁదఁబడి శరీరంబులు మఱచువారును గొందఱు నక్షత్త్రంబులు దర్శించి వచ్చికూర్చుండి గుమిగూడువారును గొందఱావలించుచు దూఁగితిననిలేచి పదంబులు త్రొక్కుపడ నవలావలందిరుగాడువారును గొందఱిట్లు నిద్రజెందుటకా రుద్రస్థానంబునకు వచ్చుటలని యెకసక్కెంబులాడినం దిగ్గునలేచిపోవ నచ్చోటున విశ్రమించువారును గొంద ఱింతపర్యంతంబు మేలుకొని క్షణప్రయాసంబున కోర్వఁజాలక వ్రతభంగంబు చేసికొనవలదనిన మీరెట్లు తూఁగితిరనువారును మఱియు నానాప్రకారంబులం బ్రజలు సొక్కిపడి సోలినవీఁకను సంపంగితావికి భృంగంబులతెఱంగున నిద్రాపరవశులయి యున్నకతంబున. 41

సీ. తత్క్షణంబున యాజ్ఞదత్తియు వే లేచి తామసింపఁగ నీకఁ దగవుగాదు
నిఖిలజనంబులు నిద్రించుచున్నవా రిది వేళ యని నేల పదములూన
నీక మెల్లనఁబోయి శ్రీకంఠు గుడితల్పు నోరవాకిట దేహ మొదిఁగి చొచ్చి
దీనదశకువచ్చు దీపంబుఁ గని తనపంచకొంగు బిరానచించి వత్తి

తే. దాల్చి నెయిపోసి దీపంబుఁ దనరఁజేసి, పానవట్టంబు తుదనున్న ఫలరసాన్న
కలితకాంచనపాత్త్ర మొక్కటి గ్రహించి, తర్లిపోవఁగ నపుడు బల్తత్తరమున.

ఉ. నుగ్గుగఁ ద్రొక్కె నొక్కని గనుంగొని యంతట వాఁడు ప్రజ్ఞతో
దిగ్గనలేచి చూచె నలుదిక్కులు చోరుఁడు గొంచుఁ బోవుచో
నిగ్గులపళ్ళెరం బరసి నివ్వెఱఁగంది మహేశుసొమ్ము వీఁ
డగ్గలికన్ గ్రహించుక రయంబున నేగె నటంచు నుగ్రుఁడై. 43

చ. తలవరులార లెం డిపుడు తస్కరభూసురుఁ డీశుపళ్ళెరం
బలవడఁ గొంచుఁబోయె నన నందఱు గొబ్బునలేచి రాతఁడున్
దలవరు లట్టె ముట్టి బెడిదం బగువింటనిశాతమార్గణం
బులు సమకట్టి బాణములఁ బొల్పెడలించిరి భూసురోత్తమున్. 44

ఆ. ఇట్టిదుష్టమతికి నెబ్భంగి తనలోక, మిచ్చువాఁడొ శంభుఁ డీవిచిత్ర
మరయవలె నటంచు నాసక్తుఁ డయివచ్చు, కరణిఁ బూర్వశిఖరిఁ దరణి దోఁచె. 45

వ. తదనంతరంబ మదీయదూతలు దూరదూరంబున నిల్చి భయభక్తిసంభ్రమంబులఁ బ్రణమిల్లి బహువారంబుల జైవారంబులు చేసి యిట్లనిరి. 46

సీ. ఓమహామహులార సోమకింకరులార యీదుష్టమతికడ కేలవచ్చి
నారు వీఁ డన్వయాచారవిహీనుండు జనకవాక్యద్వేషి చౌర్యధుర్యుఁ
డభవనిర్మాల్యాపహారి జూదరి పరస్త్రీవిహారక్రియాభావనుండు
కాలలోకార్హుండు గాని కాలాంతకుమీఁదను దయదల్పలేదు గాన
తే. కష్టమానవుమీఁదను గరుణ పుట్టు, కరణి వరియింప వలదనవరమె మాకు
ధరణి ధరణీశు లెన్నరు ధర్మపక్షము, గాన చెల్లించుకొందు రేకార్యమయిన. 47

క. పంచాక్షరి జపియించెనొ, పంచాననమూర్తిపాదపంకేజంబుల్
పంచత్వవేళఁ దలఁచెనొ, పంచాస్త్రవిరోధిపూజ భక్తిఁ జలిపెనొ. 48

క. ఈసూక్ష్మ మిందుఁ గలదా, యీసత్యవిరోధియందు నెఱిఁగింపుఁడు మీ
దాసానుదాసు లగుమా, కీసంశయ మనిన బ్రమథు లిట్లని రెలమిన్. 49

క. ఓశమనదూతలార మ, హేశాత్మకధర్మసూక్ష్మ మెఱుఁగఁ దరంబే
కేశవలోకేశభుజం, గేశసురాచార్యనిర్జరేశులకైనన్. 50

ఆ. తెలిసినట్లయుండుఁ దెలియకయుండును, దెలియఁబడకయుండి తెలియుఁ బిదప
నిమ్మహాత్మునందు నేపార నొకమహా, పుణ్యపాప మది యగణ్య మనియె. 51

వ. అది యెట్లంటేని. 52

సీ. అన్నంబు దొరకకయైనను శివరాత్రి నాఁ డుపవాసనిర్ణయముగలిగె
శ్రీకంఠుపూజ తాఁ జేయకుండిన నరు లర్చింపఁగాఁ గన్నులారఁ జూచె
నశనంబుకొఱకు రుద్రాలయంబున నిల్చి వేగునంతకుఁ జల్పె జాగరంబు
నన్నపాత్రావలోకార్థమై దీపంబు శంభుసన్నిధికేగె నసఁగఁ ద్రోసె
తే. లింగమూర్తిని గాంచె ననంగవైరి, కథలు వీనుల వినఁబడెఁ గాలగతిని
హరుని మొగసాల నేల దేహంబు విడిచె, నింతకంటెను సుకృతంబు లెవ్వి జగతి. 53

ఉ. కావున నిమ్మహాత్ముఁడు జగన్నుతుఁ డీశ్వరభక్తకోటిలోఁ
గేవలముఖ్యుఁ డంతకు సకిల్బిషలోకముఁ జూడ నర్హుఁడా
భావభవారిభవ్యపదపాత్రుఁడు సత్యము చూడుఁ డంచు నా
జీవుని దివ్యదేహమునఁ జేర్చిరి శంకరకింకరు ల్దగన్. 54

ఉ. వచ్చినత్రోవఁ బట్టుకొని వారకపోం డిక నీడఁ జెల్లునా
తచ్చనలాడ నేల జగదంతపరీక్షలు మీ కటంచుఁ బల్
మచ్చిక నమ్మహాత్ముని విమానపదస్థునిఁగా నొనర్చి వే
పొచ్చములేని వేడ్కఁ గొనిపోయిరి శంకరరాజధానికిన్. 55

తే. అంత మాకింకరులు విస్మయాంతరంగు, లగుచు సర్వేశుమాహాత్మ్య మభినుతించి
తెలియ నిబ్భంగి వర్తించు ద్విజునకబ్బె, నవ్యయస్థానసౌఖ్య మేమనఁగవచ్చు. 56

క. అని వచ్చి చెప్పి రంతయు, మును మాకింకరులు నాసముఖమునఁ దనరన్
మునిచంద్రుఁడ విను మిక్కథ, జనములు వినిరేని మోక్షసౌఖ్యము గల్గున్. 57

వ. కావున నీయుపాఖ్యానంబు పరమపవిత్రం బని చెప్పి మఱియు నిమ్మహాశివరాత్రి
ప్రభావంబున భిల్లవల్లభుం డమృతపదంబుఁ జెందెఁ దదీయకథాసంవిధానంబు నాక
ర్ణింపు మని మునిపతికిం బితృపతి యిట్లనియె. 58

సీ. శాకలవిపులదేశంబున మంచకీలుఁ డనుగిరాతనాథుఁడు గలండు
కఠినాత్ముఁ డఖిలమృగప్రాణపవమానదందశూకుండు దోర్దర్పశాలి
వాఁ డొక్కనాఁడు దివాకరోదయవేళ నడవికిఁబోయి వేఁటాడఁ దలఁచి
వాలకంపజుంజుఱు తలపీఁకబొమిడికెతోలు చల్లడముపై నీలిదట్టి
తే. పిల్లమెట్టులు మొలవంకి చిల్లకోల, చలిదిచిక్కంబు తడవిండ్లు సాయకములు
పోగుచుట్టలు దీమముల్ పులుఁగువలనఁ, జిగురుఁగండెలు నురులును దగరహింప. 59

వ. ఇవ్విధంబున శరశరాసనాదిసాధనసమేతుం డయి నిటలతటంబున జిగురువెట్టుకొని
నిజకుటీరంబు నిర్గమించి సకలమృగపక్షిసంకులం బగు నొక్కమహారణ్యంబు దరియం
జొచ్చి యందు. 60

సీ. బాణబాణాసనపాణియై ఘోణులఁ దఱిమి చిక్కకయున్న మరలవచ్చు
దీమముల్ పాదులుదీర్చి పుల్గులఁ ద్రోల నవి వ్రాలకుండిన నట్టె యేడ్చు
జిగురుఁగండెలు చెట్ల దగిలించి యటుగాంచి విహగము వ్రాకున్న చిన్నఁబోవుఁ
బోలములోపల వడిఁ బొదరిండ్లలోఁ దూఱు కుందేళ్ళ వడకున్నఁ గొంత గుందు
తే. తడికమాటున నొకమాటుతనువుదాఁచు, బోను లురిగోల నొక్కటఁ బూనితిరుగు
వేఁటవేవులఁ బలుమాఱు విడిచిపెట్టి, బూమె లందందచేసి తాఁ బొద్దుచూచు. 61

ఆ. ఇట్లు విపినభూమి నెఱుక వేఁటాడంగ, దైవయోగ మేమొ తాపసేంద్ర
యొట్టుపెట్టినట్ల యొక్కమెకం బైన, నొక్కపక్షియైనఁ జిక్కదాయె. 62

వ. అయ్యవసరంబున. 63

తే. చదలహంసాహ్వయుని దన్నుఁగదిసిబోయ,వెంటఁబడునోయటంచుభావించివెఱచి
యరిగెననుమాడ్కిఁగమలాప్తుఁడస్తమించె,యెఱుకుముఖలీలముకుళించెసరసిజములు. 64

క. సమయపుళిందుఁడు ఖగదే, హముగల ఖగునేయ నప్పు డంబరగతి ర
క్తమెగసె నన సంధ్యారా, గము జిగి చరమాద్రి దిక్కుఁ గప్పెను జెలువై. 65

తే. మృగజిఘాంసఁ జరించు నామ్లేచ్ఛవరుని, హింస సేయంగవచ్చు గంధేభరాజు
మేని జిగివోలె జగమెల్ల మెండుకొనియె, గటికచీఁకటు లంతంత ఘనముగాఁగ. 66

క. వనచరునివలనిభయమున, వనభూజములం బకాళి వ్రాల వెఱచి మి
న్ననియెడి వటమునఁ జేరిన, యనువున తారకలు దోఁచె నాసమయమునన్. 67

వ. నిషాదుం డాహ్లాదంబు దప్పి విషాదంబున నిట్లని వితర్కించె. 68

క. తనమార్గణాళి భువిఁ జ, య్యన లోభినివేఁడు మార్గణాళి కరణి యీ
దినములు వ్యర్థములయ్యెఁ గ, మునువనికిఁ గారాదె మృగసమూహ మణఁపనే. 69

క. కరఖడ్గ మేమిటికి భీ, కరఖడ్గం బొక్కటైనఁ గలుగదు మఱి యీ
శరభంబేల భయంకర, శరభం బొండయినఁ జేవఁ దను జేరదుగా. 70

ఆ. ఎట్టివేళ నేను సిలుపెళ్ళినా నొక్క, పంది వలనఁ దగిలి పాఱిపోయె
జింక యురికిఁ దగిలి చిక్కక యఱిగెను, నేమి నేతు దొరక దెలుఁకయైన. 71

సీ. గహనాభిధానరాక్షసునిపై జిగివోలె గుజములఁ జీఁకట్లు కుమురుకొనియె
మిడిగ్రుడ్లుఁ బొడమిన మిఱుఁగుర్ల రీతి నల్గడల ఖద్యోతసంఘంబు లడరె
భుజములచందాన భుజగదంపతులు వల్మీకరంధ్రంబులు మీఱి వెడలె
వికటాట్టహాసంబు వెలపున భూతనాదంబు లాదంద భీమంబులయ్యె
తే. నిట్టిరాతిరి పోయి నేనేమి నేతు, సోటసోటలు వోయె నాఁకట స్రుక్కి నొడలు
యింటనిల్లాలు బిడ్డలు నెదురు చూతు, రకట నే నిందునుండ నేమందురొక్కొ. 72

ఉ. వారు మహార్తిఁ బొందెద రవశ్య మటంచును గొంప కూరకే
చేరిన మాంసమేది యనఁ జెప్పుదు నేమని యాత్మ పత్నికిం
గూరిమిబిడ్డ లాఁకటులఁ గుందియు నందఱు తోడుకాడ నే
తీరునఁ జూడనోపుదు మతిభ్రమదీర దిదేమి నేయుదున్. 73

ఉ. ఇంటికిఁ బోవనేల చెలి కిత్తెఱఁ గంతయుఁ జెప్పనేల నా
వంటి కడింది బోయ బలవంతులు చింతన లంద మానునే
కంటకగుప్తిఁ జాపవిశిఖంబులు దాలిచి వేగువాత నే
నొంటి మెయిం జరింప మెక మొక్కటియైనను జిక్కకుండునే. 74

వ. అని విచారించి నిఖిలసాధనంబులు నొక్కట డించి కోదండంబు ధరియించి దవా
నలకీలలవెలుంగున నందంద తొలంగుచుఁ జనిచని ముందట. 75

సీ. కలహంసపక్షిసంఘము తీరుగోవుల మహనీయ కనకచామరలుగాఁగఁ
బ్రకటోక్తి బహువిధ బకనినాదంబులు వందిసంతాన స్తవంబుగాఁగ
రతివియోగరథాంగరావంబు లభిరామగాయకగీతి కాకలనగాఁగ

... ... ... ...

తే. ముకుళితాబ్జంబు లవనినాయకులుగాఁగ, నమితకవిజీవనప్రదుం డయిన రాజు
కొలువువలెనున్న యొకమంచికొలనుజూచి, మనమురంజిల్లఁ గొంతసేపునటు మాచె.

ఆ. చూచి చోద్యమంది శూలిభక్తులమాన, సంబులట్లు నిర్మలాంబు లొప్పె
నీసరసిని బద్మినీసంగమం బిట్టి, సరసులకును గాక దొరకు టెట్లు. 77

వ. అని కిరాతుం డక్కాసారంబు కైవారంబుచేసి నీరంబునకుఁ జేరు మృగవారంబుఁ
సంహారంబు చేయుదు ననువిచారంబునఁ దత్తీరజాతమాలూరభూరుహశాఖా
రోహణం బాచరించి యెడనెడఁ గల్గుకంటకంబు లడంచి వెనువెంటఁ గ్రొవ్వాడి
తూపుసంధించి సుఖాసీనుండయి మృగాన్వేషణంబు సేయుచు నేకాగ్రచిత్తంబున.

ఆ. కుజనివాస మితరకుటిలసాధనదూర, మేకధర్మరతి జితేంద్రియత్వ
మిష్టమార్గదర్శనేచ్ఛ వర్తిల్లు యోగీంద్రుపోల్కిఁ దనరె నెఱుకుఱేఁడు. 79

ఆ. వానరీతి మంచు సోనఁగాఁ గురియంగఁ, దాన తానమాయఁ దనదుదృష్టి
కడ్డమయినదళము లందందు మునివ్రేళ్లఁ, ద్రెంచి పాఱవైచెఁ దిగువఁబడఁగ. 80

క. ఈగతి బిల్వదళంబులు, వేగమె భువిప్రేయ నచటి విధుమౌళిశిఖా
భాగమునఁ జేరె నది పూజాగరిమం బయ్యె శైలజావరుకరుణన్. 81

చ. అటుశివరాత్రి నామృగయుఁ డట్లు వనాంతరభూమిలోఁ జరిం
చుట లుపవాసనైష్ఠికత చొప్పడె నిద్రయు లేకయుంట నా
కుటిలున కబ్బె జాగరను కుంఠితమై యలబిల్వపత్రముం
దటుకున గిల్లి వైచుటలు దర్పకభంజనుపూజలై తగన్. 82

మ. తలఁపం గావునఁ గొంతకాలమున కంతం బొంద నవ్వ్యాధుని
బలిమి న్మద్భటు లేగిపట్టుకొను నప్పాట న్మహాదేవదూ
తలు వే వచ్చి యుదారపుష్పకముమీఁదం జేర్చి గొంపోవ ని
ర్మలచారిత్రులఁ గాంచి యిట్టులని రస్మత్కింకరుల్ గొంకకన్. 83

చ. నిలునిలుఁ డెందుఁబోయెదరని న్మముమీఱి కిరాతునిం జలం
బలవడ గొంచుఁబోవుఁడని యడ్డముదాఁకిన రోషయుక్తులై
మలహరుభృత్యు లంకుశసమాజము లొక్కటఁ ద్రిప్పివైచినం
బలములుదూలి పాఱఁగని పల్కిరి వారు దయానుసారులై. 84

సీ. కోటిసంవత్సర ఘోరతపోనిష్ఠ సరిమించు శివరాత్రి జాగరంబు
నూఱుయజ్ఞంబులఁ గేరిపల్కఁగవచ్చు శివరాత్రియుపవాసశీలమహిమ
గంగావగాహమంగళ మెంతయనఁ జెల్లు శివరాత్రి శంభుదర్శించుఫలము
శంఖపద్మద్విజార్చనసాటి శివరాత్రి శివుబిల్వదళపూజ చేయుగరిమ
తే. గాన శివరాత్రి మీ ఘనునియందుఁ, జేరిఫలియింప వల్వ దాచారవిధము
మీదొరకుఁ జెప్పు డిమ్మాట మీకుఁ దెలియ, దీరహస్యంబులని వార లేగిరంత. 85

వ. అట్లగుటం జేసి సకలవ్రతోత్తమంబయిన యిమ్మహాశివరాత్రివ్రతం బెఱుంగక
లభ్యంబయిన యతనికి శివమహోత్కృష్టసుకృతం బావహిల్లె నెఱింగియుఁ దద్వ్ర
తం బాచరించిన పుణ్యవంతులభాగ్యం బేమని చెప్పంగలవాఁడ నింక నొక్కవిశే
షంబుగల దవి విచిత్రంబైయుండు నెట్లంటిరేని. 86

సీ. మున్ను మహారాష్ట్రమున వేదనాథుఁడన్ విప్రోత్తముఁడు జగద్విదితయశుఁడు
కలఁ డమ్మహాత్మునికాంత దుశ్శీలాభిధాన ధర్మద్వేషదానహీను
రాలు జారేచ్ఛాభిలోలయై వర్తిల్లి యత్తమామలఁ బెట్టు నలుకఁబెట్టుఁ
గనుసన్న చేసన్నలను భుజంగులఁ బచ్చుఁ బ్రొద్దు కొక్కొక్కకై పురు ఘటించు
తే. నాత్మనాథుని గనుఁగొని యవరసైచు, దోషమెన్నక తిరుగాడు దుడుకులాఁడి
యంతఁగొన్నాళ్లకొకశూద్రు వంతవేసి, కొనియెనయమంచువానితోఁగూడిచనియె.

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని మదోన్మత్త చిత్తయై క్రొత్తాళని నెత్తుకొని యుత్కళ
దేశంబునకుంబోయి యుండు. 88

ఉ. చేరువకాని కుబ్జకకుశేశయలోచన మాటిమాటికిం
జీరలుగట్టు భూషణవిశేషములన్ ధరియించు గంధ మిం
పారఁగఁ బూయు గుబ్బ లెదఁబట్టఁగఁ గౌఁగిటఁజేర్చుఁ దేనెలుం
గాఱఁగ మాటలాడుఁ దనకమ్మనివాతెఱ మేలుచూపుచున్. 89
ఆ. ఇటులు వానితోడ నేవేళ రతికేళి, నోలలాడి కొంతకాల మరుగఁ
బోయె నొకనిఁ దగిలిపోయె నా గయ్యాళి, మొదటివటుఁడుకూడ మొఱలిడంగ.

ఉ. ఆగతి శూద్రుఁడేగి తరలాయతలోచన యింతనేతురా
రాఁగదె ముద్దుగుమ్మ పరిరంభణ మీఁగదె మందయాన నీ
భోగము నమ్మియుంటిఁగదె పుష్పసుగంధి కిరాతుఁజేరి న
న్నాగడ మేలచేసితి వటంచుఁ బిఱుందన మందవేగుఁడై. 91

క. చనుదేరఁ గాంచి మ్లేచ్ఛుని, గనుగీఁటిన వాఁడుఁ దీవ్రకాండంబుల న
ద్ధనికుని గడతేర్చిన న, వ్వనిత శబరుఁగూడి యొక్కవనముం జేరెన్. 92

శా. అంతం బ్రావితభిల్లవల్లభుని గాఢాలింగనక్రీడలన్
స్వాంతోత్సాహము పుట్టఁజేసి మృగసంహారంబు గావించుచుం
జెంతన్ సోలుచుఁ జొక్కుచుం బలలముల్ సేవించుచున్ మద్యముల్
భ్రాంతింగ్రోలుచుఁ గొంతకాల మిటు లప్పద్మాక్షి వర్తిల్లఁగన్. 93

క. ఆయెడ నొకవిధభూసురుఁ, డాయడవికి రాఁగ నావయారి మనోజ
స్మాయత్తచిత్తయై కని, డాయంజని యతనితో నొడంబడఁబల్కెన్. 94

క. ఆసన్నసైగ లారసి, భూసురసతి నిల్లువెడలి పొమ్మని మృగసం
త్రాసకు డడిచిన నద్దియె, వాసియనుచు మది దలంచి వానిన్ రోసెన్. 95

క. తదనంతర మావిప్రుని, సదనంబున కరిగి యతని స్మరతంత్రములం
గదియించి సౌఖ్యమందుచు, వదలక వర్తించెఁ గొన్నివర్షము లందున్. 96

క. ఆపాఱుఁ డన్యవసితా, వ్యాపారుం డగుట యెఱిఁగి వంచించి విష

ప్రాపితభక్ష్యము లిడి యా, బాఁపత హరియించె నతనిప్రాణానిలమున్. 97

తే. అతఁడు పంచత్వమొందిన యచటువాసి, యొక్కపురిఁ జేరి యింటింటఁ గుక్కచక్కి-
మెలఁగి యెఱుఁగని విధవకామినుల కెల్లఁ, గాముకులఁ జేర్చు బోకార్చుఁ గడుపులయిన.

వ. ఇవ్విధంబున నవ్విలాసిని యెవ్వరుం జేయరాని పాపంబు లనేకంబులు చేయుచుఁ
గొన్ని సంవత్సరంబు లందు విహరించుచున్న నప్పురంబునం గల్గు నానావర్ణంబుల
జనంబులు శివరాత్రిమహోత్సవంబునకు శ్రీశైలంబునకుం బోవు నెడ వారల వెంబడి
దుశ్శీలయుం దవిలిపోయె శ్రీశైలశిఖరాలోకనంబు పుణ్యశ్లోకులకుం గాని క్రూర
కర్ములకు లభ్యంబు గాదు కావున నమ్మార్గమధ్యంబున నక్కంఠీరవమధ్యకు నేత్రం
బులదృష్టి మధ్యంబయిన నడచుటకు సామర్థ్యంబు లేకున్నం గూడివచ్చినవార లొం
డువిధంబున నమ్మహాస్థలంబుఁ జేర్చిన నయ్యంధురాలు శ్రీమల్లికార్జున మహాదేవు
సన్నిధివీథిలోనం గూర్చుండి యాలాపంబుల నన్నపానంబులఁ బుణ్యపురుషుల నెలుం
గెత్తి వేఁడుకొనిన నద్దినంబు శివరాత్రి యగుటం జేసి యెవ్వరేనియు నన్నోదకంబు
లియ్యరయిరి. ప్రదోషకాలంబున నొక్క శివభక్తుండు మహేశ్వరపూజార్థం
బుగాఁ దీర్థంబులు శ్రీఫలదళంబులుం గొంపోవుచు మొఱపెట్టుచున్న యత్తెఱవదో
యిటం బుడిసెఁడుజలంబును బిల్వపత్రంబునుం బెట్టిన యది యాహారయోగ్యంబు
గాకుండు టెఱింగి దూఱుచు దూరంబునం బాఱంజల్లినఁ బత్త్రోదకంబు లచ్చటి
సనాతన శివలింగమూర్ధాగ్రంబునం బూజార్హంబులయి చెన్నొందె నిత్తెఱంగున
శివరాత్రి పేలుపగళ్ళను జాగరణోపవాసంబులు గల్గుట బిల్వపత్రంబున శివలింగా
ర్చనలు చేయుటయు శ్రీపర్వతంబునకు వచ్చుటయు నిట్టిమహాపుణ్యంబులం జేసి యా
కాంత దేహాంతంబున శంకరకింకరులు మదీయకింకరులం బాఱఁద్రోలి దివ్యవిమానంబు
మీఁద నద్దివ్యసుందరి నిడికొని సర్వసుపర్వమునిగణంబు లాశ్చర్యంబునొంద శివలో
కంబునకుం దోడ్కొనిపోయి రీచందంబున మున్దొక్క చండాలాంగనకు గోకర్ణస్థల
మాహాత్మ్యంబున శివరాత్రి ప్రభావంబునఁ గాక తాళన్యాయ శివపూజావిశేషం
బున ఘోరపాపంబువలన విముక్తయై ప్రాణాంతంబున గౌతమాదిమహర్షిపుంగవ
సంఘంబు విస్మయంబంది చూచుచుండ నయ్యింతికి శివలోకసౌఖ్యంబు సిద్ధించెం
గావున శైవధర్మంబు లిబ్భంగి ప్రకాశమానంబులయి వెలుంగు నింకొక్క రహస్యేతి
హాసంబుం జెప్పెద. 99

చ. వినుము కళింగదేశమున వీరుఁ డుదారుఁడు దుర్మదాంధసం
హననుఁ డశేషరాజ్యమహిమాతిశయుండు కళింగనాథుఁ డా
తనికులకాంత సుందర సుధాకర బింబనిభాస్య విస్ఫుర
ద్వనజదళాయతాక్షి వసువర్ధని నాఁ బరఁగుఁ ధరాస్థలిన్. 100

క. ఆమానిని దుర్భావం,బీమహి లెక్కింపరా దహీనవిలాసా
కామాతుర యగుకర్మిణి, యీామతిఁ గామాంధయూర్తి లేక్షణమతియై. 101

వ. ఉండునెడ. 102

క. పౌరోహితుఁ డొయ్యన నొక, పారి మహీధవుఁడు లేనిపట్టున రాజా
గారమునకు వచ్చిన న, వ్వారిజముఖి యతని జారవాంఛం గవిసెన్. 103

శా. ఆవిప్రాత్మజుతోడ సూనశరవిద్యాక్రీడ లింపార రా
జీవాక్షిస్థితు లిచ్చలోఁ దెలిసి వర్జింపంగఁ జింతించు నా
భూవర్యుం డొకనాఁడు సర్వవిభవంబు ల్మీఱఁ గొల్వుండఁగా
నావేళం బోడఁగానవచ్చి రటకున్ వ్యాధుల్ వినోదంబుగన్. 104

తే. వచ్చి భూపాలునకుఁ దాము తెచ్చినట్టి, కానుకలొసంగి వినిససంఘములు తెలిపి
యున్నబోయలలోపల నొకనిఁ బిలిచె, సౌధమునను
ండు నుయ్యెంతి సైగచేసి. 105

క. పిలిచియుఁ బిలువకమునుపే, యళుకక యాబోయ పోయి యయ్యింతికడన్
నిలిచిన వానికి నొసఁగిర, మళికుంతల తనియఁ బెట్టి యాతనిరతికిన్. 106

ఉ. రమ్మని వానిఁ దోడ్కొని కరం బనురాగముమీఱఁ జిత్రబం
ధమ్ముల నేలుమంచు విశదమ్ముగఁ దెల్పి సహింపరానిమో
హమ్మున శయ్యమున్న వగ లామనుజేంద్రుఁడు గాంచి శాతఖ
డ్గమ్ము ఝళిల్లఁ దీసి యెదఁ గ్రమ్మెడురోషము పిచ్చలింపఁగన్. 107

ఉ. చంపిన జీవహత్య యని చంపక వారల నూఱువెళ్లిపో
నంపెను ధర్మబుద్ధిని మహాత్ముఁడు గావున రాజవర్యుఁ గీ
ర్తింపుచు సింహసామజపరిస్ఫుటకాననసీమ కేగి వ
ర్తింపుచు నుండి రంత సరసీరుహలోచన కొన్నినాళ్లకున్. 108

ఉ. బోయకు గర్భమై యలరుఁ బోఁడియు మాంసము మెక్కి మద్యమున్
రోయక త్రావు మన్మథునిరూపవినోదములందు వల్లభుం
బాయ దొకప్పుడైన నరపాలకభామిని రాజభూతికిం
డాయక నీచవర్తన కొడంబడెఁ బూర్వకృతంబు దప్పునే. 109

సీ. ఇట్లున్న నొక్కనాఁ డేణాక్షి కాసారమునకుఁ దీర్థంబాడఁ జనఁగ నచట
వీక్షించె నవమారు విప్రకుమారుని దనివిదీరక మన్మథజ్వరార్తి
కోర్వక యుర్వీసుపర్వునిపైఁ బడ నాతఁడు సురతేచ్ఛ నతివఁ గూడెఁ
బూర్ణగర్భాంగనఁ బొందినదోష మాద్విజుఁ డీల్గె మృత్యువు తెవులు సోఁకి

తే. నేలఁబడియున్నబ్రాహ్మణుఁ బోలఁజూచి, భయములోపల దోఁచి యప్పద్మగంధి
బిడ్డఁగనెఁ దత్క్షణమున నాబిడ్డ నొక్క, చెట్టుకడవైచి యరిగె నగ్గట్టువాయి. 110

వ. అంత నప్పల్లవాధరి భిల్లవల్లభుకడ కరిగి యథాప్రకారంబున విహరింపుచుండె నక్కాసారతీరంబున నిర్గతాసుఁడయిన భూసురవృత్తాంతం బెఱుంగక యతని సహోదరి యగువిధవాంగన తనమనంబున. 111

ఉ. తమ్ముఁడు తానమాడఁ జని తామసమాయె వనంబులోన వ్యా
ఘ్రమ్ములబాధఁ జెందెనో ప్రకంపముఁ బొందెడు దేహమెల్లఁ జి
త్తమ్ము గలంగఁ జొచ్చెఁ బరితాపము పుట్టె నిదేమి యంచు మా
ర్గమ్మున జాడఁ బట్టుకొని గ్రక్కున వచ్చె విషాదవేదనన్. 112

ఆ. అవఘాటి యిట్టు లరయుచుఁ జనుదెంచి, విగతజీవుఁడయిన విప్రుఁ జూచి
మోఁదికొనుచు దుఃఖమునఁ గ్రుంకి మూర్ఛిల్లి, తెలివి కొంతవడికిఁ దెలిసి మఱియు.

ఉ. హా యను దమ్ముఁడా యను గృహంబున కేటికి రావయో ననున్
బాయఁగ బాడియే యను నిబద్ధిగ నమ్మితి నీదుప్రాపు నే
నేయెడ కేగుదాన తన కెయ్యది దిక్కిఁకఁ జొచ్చినిల్లు ని
ట్లాయెఁగదా విధాత పరమాయువు నీ కొనఁగూర్పఁడే యనున్. 114

వ. అని బహుప్రకారంబుల శోకించి తనకుఁ దాన యుపశమించుకొని యయ్యరణ్యంబున నీరసేంధనంబులం జితి పేర్చి యతని కగ్నిసంస్కారం బాచరించి యంతఁ దటాకంబున మునింగి నిజగృహంబునకు వచ్చునెడ నచ్చటం బడియున్న చిన్నికుమారునిం జూచి తలయూఁచి విస్మయంబంది యబ్బాలు నెత్తికొని జలకంబార్చి యమ్మహారణ్యంబున డింభకుం డనాథుం డయ్యెండెం గావున వీఁడు మ్లేచ్ఛకులసంభవుండు గాఁడని నిశ్చయించి సంకరజాతుం డగుటం జేసి వాని శంకరుం డను పేరం బిలుచుచు మందిరంబునకుం దెచ్చి పెంచుచుండెఁ దదనంతరంబ. 115

క. వసువర్ధని చెంచాతని, పస వ్యర్థం బనుచు రోసి పయనంబై తా
నసదృశగతి ద్వీపంబులు, వెసఁ జూడఁగవలెనటంచు వేడ్కం గదలెన్. 116

ఆ. ఓడయెక్కి పోవు కోడెకాండ్రనుగూడి, నీటిమీఁదఁ బోయె నీరజాక్షి
జలధిమధ్యమునను ఝంఝూనిలోద్ధతి, నొడ్డగిల్లి చెదరి యోడ మునిఁగె. 117

క. అపడవలోనఁ జచ్చిన, పాపాత్ములఁ బట్టి వరుణపాశంబుల సం
తాపింప నట్టిమద్భుటుః లేపారఁగఁ జోడితేర నీశ్వరుదూతల్. 118

చ. తలతలమంచుఁ బుష్కరపథంబున నిల్చినదివ్యరత్నని
స్తులమహనీయపుష్పకముతోడఁ దదీయవిలాసవిద్రుమో
జ్జ్వలఘనవేషభాషలకు జంకియుఁ మాభటు లూరకున్న నా
జలజదళాక్షిఁ దోడుకొని శంకరకింకరు లేగి రయ్యెడన్. 119

క. మాదూతలుఁ గూడం జని, యీదోషికి శంభులోక మియ్యందగునా
యేధర్మ మెఱిఁగి చేసె న, హో దివ్యస్వాంతులార యొగిఁ దెల్పనగున్. 120

వ. అని బహువిధంబుల వేఁడుకొన్న దరహాసవికాసాననలోకభాసమానులయి కృత్తి
వాసునిభృత్యులు నాభృత్యులం గనుంగొని. 121

క. శంకర శంకర యనునా, కింకరులకు ముక్తి గగనకేశుఁ డొసఁగుఁగా
శంకరనామునిజననికి, శంకరపురిగాక కలదె శమనుపురంబున్. 122

క. కొమరుపకొడుకు శంకర, నామంబున బిలచెఁ గాన నాతనిదేరం
గామారి మమ్ముఁ బంచిన, నే మరుపెంచితిమి చెల్వఁ జెడి మీదూరకున్. 123

వ. అని చెప్పి రుద్రభృత్యులు రుద్రలోకంబున కవ్విప్రుమాధవుం దోడ్కొని పోయి
రటుగావున మహాదేవు దివ్యనామోచ్చారణమాహాత్మ్యం బేమని చెప్పంగలవార
మింకొక్క విశేషవ్యాఖ్యానంబు వినిపించెద వినుము. 124

క. యమునాతటినీతటమున, రమణీయసువర్ణసౌధరాజితలీలా
విమలశ్రీకలితం బయి, యమరుం బురి యొకటి కాంచనాకర మనఁగన్. 125

క. ఆపుర మేలు సుధామ, క్ష్మాపాలుఁ డుదారకీర్తి సాహసదోర్ద
ర్పాపరిమితపటుశౌర్యో, ద్దీపితుఁ డనఁ బ్రౌఢిఁ గనెఁ గళింగక్షితిలోన్. 126

క. ఆనరపతిపుత్రుఁడు వే, శ్యానూతనపంచబాణుఁ డయి త్రిభువనస
మ్మానిత మోహనలీలా, శ్రీ నెలకొని వెలయు రాజశేఖరుఁ డనఁగన్. 127

తే. రాజశేఖరనామధారణము విడిచి
జనులు విటశేఖరుండు వీఁ డనుచుఁ బిల్వ
బోజుఁగువేడుకకాండ్రతోఁ బొత్తుగాంచి
దినము వెలయాండ్ర వెనువెంటఁ దిరుగు నతఁడు. 128

సీ. మృగమదశ్రీకళామిళితమై వాసించు తులలేని గోణాము మొలధరించి
సిగవేసి కేలఁ బట్టుగుబ్బొందు పైఁ జుట్టు జిలుఁగురుమాల యోవల గదించి
పేరురంబున గంధసారకర్దమరుచుల్ చెందఁ గస్తురిపట్టె లందగించఁ
బైతినీచలువదుప్పటి భుజద్వయముపై నీటుగన్పడ వలెవాటువైచి
తే. ఇటులు పరిహాసకులు నటు ల్వెంట నడువ, మేలు జగజంపుగిలుకుపావాలు మెట్టి
భయమునెగ్గును లేక భూపాలసుతుఁడు, శీవిమీఱంగ వేశ్యవాటికల మెలఁగు. 129

ఉ. అందొకవేశ్య పద్మముఖి యద్భుతరూపవిలాసవైభవా
నంద శుభాభినంద శుకనందముఖాఖిల మానిమానస
స్యందవచోమరంద ఘనసారసుధారసహాసచంద్రికా
బృందవచోమిళింద విహరించు సునంద యనంగ నందమై. 130

తే. ఆమగువమీఁద మిక్కిలి ప్రేమగాంచి, కృతకధాత్రీధరంబులఁ గేళివనుల
వీడఁబాయక రేవగల్ వితతరతులఁ, దగిలి విహరింపుచుండు సుధామసుతుఁడు. 131

క. ఈలీల మెలఁగుచుండఁగ, నాలో నొకనాఁడు వారిజాననతో రా
చూలి పొలయల్క పైకొని, యాలసభావమున నింటి కరిగెం గలకన్. 132

తే. అలిగి వచ్చినతనుఁ బిల్వనంపకున్న, మాన్యభామిని చిత్తకాఠిన్యమునకు
వగచి విరహాగ్నివేదనఁ దగిలి పొగిలి, విరులపాన్పున నొంటిమైఁ బొరలుచుండె. 133

క. తనగోత్రంబునఁ బుట్టిన, జనపతిపుత్రకుని కమలశాబకుహుతభు
గ్జనితార్తిఁ జూడనోల్లక, జనె నన నపు డినుఁడు చేరెఁ జరమాచలమున్. 134

శా. సాలంకారమహానురాగరసపూర్ణానందమై యయ్యెడన్
నాళీకద్విషిగాఁగ మెచ్చ మదిలోనం గోరు దద్వారుణీ
నాళీకాయతలోచనామణి శిరోన్యస్తాబ్జరాగప్రభా
జాలోన్మీలన భానుఁ డొప్పెసఁగె నస్తగ్రావకూటంబునన్. 135

సీ. కంకేళిసౌభాగ్యగరిమంబు నిరసించి సిందూరవిఖ్యాతిఁ గ్రిందుపఱిచి
కాశ్మీరలక్ష్మీవికాసంబు నిందించి బంధుజీవప్రభాపటలి నణఁచి
మాణిక్యసౌందర్యమహిమ మేలంబాడి కింశుకశ్రీపరిక్రియ హసించి
విద్రుమోన్నతకళావిభవంబు కలఁగించి దాడిమప్రసవబృందముల నణఁచి
తే. హల్లకారుణదీప్తులు పల్లవముల, సిరులు పదియాఱువన్నెబంగరు మెఱుంగు
లెంతలేవని వాదాడు వింతజిగిబె, డంగు గలసంజకెంజాయ చెంగలించె. 136

చ. సురపథదాడిమాగమునఁ జొప్పడి పండిన భానుఁడన్ ఫలం
బరుదుగఁ బశ్చిమాద్రిశిఖరాగ్రమునం బడి పెక్కువ్రక్కలై
యొరుపడి చెట్లపై నెగయు నుజ్జ్వలబీజములో యనంగ బం
ధురతరభంగి నల్గడలఁ దోఁచె నభోదితసాంధ్యతారకల్. 137

చ. దివి కెగఁబ్రాఁకు నూర్పులిడు దిక్కులఁజూచు రసాలసాలప
ల్లవములఁ జేరు నల్గడ మెలంగు సరస్సరసీరుహంబులం
గవియు జలంబులన్ మునుఁగుఁ గ్రమ్మఱ లేచి కలంగు నొక్కజ
క్కనచెలి పజ్జ వల్లభునిఁ గానక ఘోరవియోగవేదనన్. 138

తే. ప్రియసఖి వియోగవేదన బెగ్గడిల్లి, పనవుచున్న సుధామభూపాలసుతుని
మదనమాయావిభూతి మార్మలసె ననఁగ, వెల్లిగాఁ జిమ్మచీఁకటు లల్లుకొనియె. 139

ఉ. కాలసమాఖ్యచే నలరు కంచరవాఁ డొకతామ్రపాత్రము
ద్వేలసుధారుచిం దనరు వెన్నెల సీసముఁ జేతు నంచుఁ బ్రా

ర్మాలక తోఁపఁగా వెడలు మస్తన సర్వదిశాంతరంబులన్
మూలతమస్సమూహములు ముందఁకొనెన్ మఱియు న్సమగ్రతన్. 140

క. హరచరణాంబుజభజనా, పరతంత్రుల మన్మథోగ్రపాతకరాసుల్
చెరలు తెఱఁగున నలుగడఁ, బరికింపఁగ సాంద్రతిమిరపఙ్క్తులు విరిసెన్. 141

సీ. తొలిదిక్కు జవరాలి కులుకుపాలిండ్లపైఁ దళుకొత్తు వజ్రాలతాళి యనఁగ
కామరూపభృదబ్ధి కామిని ఫాలాగ్రఘనసారమయచిత్రకం బనంగ
గగనేందిరాసతీ కరతలవిన్యస్త కమనీయపుండరీకం బనంగ
మరుదిశాభామ సీమంతభూషణ మధ్యలాలితముక్తాఫలం బనంగ
తే. విటవిటీలోకమృగముల వేఁటలాడు, కొఱకుఁ జీకటిగమిచేసి కుదురుపఱచి
శంబరద్వేషి పట్టినచక్ర మనఁగఁ, గుముదపతిపొడిచె నపుడు ప్రాక్కుధరసీమ. 142

వ. ఇట్లు చంద్రోదయంబయిన నిస్తంద్రచంద్రికాసముదయంబులు నలుగడలంగడలు
కొని గిరీశగిరివర సురతరుసురభిశతారశారతారాపటీర కర్పూరచ్ఛాయాకదంబం
బులవిడంబింపుచు ప్రాగ్దిగ్భామినీకుచరుచిరముక్తాహారంబులసారంబుఁగొనుచు దక్షిణ
దిశాసుందరీకందళితమందమందస్మితమందారకుందబృందమ్ములం గ్రిందుపఱచు
చుఁ బ్రతీచీకకుబంతజీవంజీవ నయవాలలాటన్యస్తవిస్తులప్రశస్త హీరవలయాకార
కాంతిసంతానంబునం బంతగింపుచు నుత్తరదిశామత్తకాశినీధమ్మిల్లలంబమానప్రఫుల్ల
మల్లికాదామంబులఁ దోఁచుచు బ్రహ్మాండకరండంబు వెండిమలాము చేసినచందంబున
దిక్కోణంబులు సంకుదోమిన పోలికె భూతలంబు మౌక్తికరంగవల్లికలఁ గైచేసిన
కైవడి గగనభాగంబు పాలగారచేసిన తెఱంగునఁ బరితపరితంబులయి పరంపరా
కారంబులయి జారచోర హృద్భీషణంబులయి పూర్ణకౌముదీసముదయంబులు ధాళ
ధళ్యప్రభాస్ఫురితంబులయి సర్వజగంబు నాక్రమించి ప్రకాశమానంబులయ్యె
నట్టియెడఁ గమలకుడుంగంబులపై వేఁడివెన్నెలలు చిటచిటంగాచినఁ బటపటం
గమలి భుగభుగం బొగలెగయుఁగతిఁ దదుపగత గంధాంధశంబరడింబకంబులు
బిఱబిఱఁ బైకి నిగిడె మఱియును జుఱుకువెన్నెల కార్చిచ్చు విరహిణీజనమనోనీర
సారణ్యంబుల్లు దఱికొనఁ జొచ్చిన మిగుల దిగుల దిగులునఁ బొగలుమగువల మన్మథాగ్ని
తాపప్రశాంతంబుగాఁ గమలపత్రశయ్యాతలంబునను గుందమందార జాతిప్రసూన
దామాలంక్రియా విశేషంబులను గమలసరోవర గ్రహణంబులను హిమాంబు
శ్రీగంధకర్పూరలేపనంబులను శీతలమృదువ్యజన విసరంబులును బ్రియసఖీజనులు
దేర్పం దెలివి గొనఁజాలక మదనజ్వరంబునఁ జెటిలిపడుచుఁ జంద్రపాదాదులం
బెనఁగియుం రాజధర్మంబుగాదని దూఱువారును వనవిహారంబులు సేయువారును
జక్రచక్రాంగ శుకపిక మధువ్రత మయూరకలకలంబులకుం గలంగువారును నై

కామినీకాముకజనంబు విరహాగ్ని తాపంబున విలపించుచుండి రయ్యెడం గన్నేరుల మొమ్ముట్టు మల్లెవిరుల జానంబువు మంకెనపూటంకవన్నెలు సువాసనంబుల సక్కియంచు కలువపూవు పల్లంబుఁ గురువేరువారులును దమ్మితూండ్లకక్కులక్లైంబులును గల పచ్చతెక్కులహుమాయిపైఁ జివ్వనెక్కి చక్కురవిలుకాఁడు మలయమందసమీరవసంతులం గలసి కోకిల మయూరకీర సారసమధువ్రతబలంబులు గొలువ దుంటవిల్లుగొని గొనయంబు సారించి కాముకజనమనస్థలంబులం గుసుమశరవర్షంబులు గురియు నవసరంబున రాజశేఖరుండు వేఁడినిట్టూర్పు నిగిడించుచు సునందా విలాసాయత్తచిత్తుండై యుత్తలంబంది. 148

క. విరహాజ్వరతాపంబున, విరిపాన్పున నొరఁగి కలువవిల్తుని కెందా
మరపూల యలుగుటంపర, పరిభవముం గాంచి హృదయపద్మమునందున్. 144

మ. హరిణాక్షీమణిమీఁది మోహమున నిద్రాహారము ల్మాని రా
ద్వరపుత్రాగ్రణి పూర్ణశుభ్రకర దుర్వారోగ్రతాపోద్ధతిస్
స్ఫురితస్ఫారశిఖాస్ఫులింగగణసంభూతార్తికారిక్రియా
భర మోర్వంగ వశంబుగాక మిగుల న్భావంబునం గుందుచోన్. 145

తే. వైభవంబుందు భూపతనూభవునకుఁ, జింత యింతైనవలదంచు సిద్ధుఁడొసఁగు
భామినీవశ్యమోహనీభస్మగుటిక, సొబగుగాఁ దూర్పుదెస వేగుఁజుక్క మొలిచె.

తే. మాసె వెన్నెలక్రొన్నిగ్గు మదనబాహు, మండితోద్దండగతి కొంత మట్టుపడియె
వరుస వనముల విహగరావంబు లెగసె, నల్లనల్లన దిక్కులు దెల్లనయ్యె. 147

సీ. అభ్రేందిరాభిషేకార్థపూర్వదిగేభగకరహేమమయవారికలశ మనఁగ
వేలావధూమణీవిమలాబ్జరాగభృత్కమనీయహస్తకంకణ మనంగఁ
బ్రాగబ్ధిగర్భనిర్గతదందశూకేంద్ర ఫణకనద్రమణీయమణి యనంగఁ
గ్రీడానిమిత్తసంభృతశోణిమాకీర్ణశక్రనందనపాణిచక్ర మనఁగఁ

తే. జక్రచక్రనిరంతరావక్రమోద, కరనిజోజ్జ్వలకరవిభాక్రాంతదిక్త
టాంతరుం డటు పూర్వనగాగ్రసీమఁ, జిత్రభానుండు దోఁచె విచిత్రలీల. 148

ఉ. ఆనగరైక సౌధశిఖరాగ్రనిశాగ్రవిచిత్రనూత్నర
త్నానుపమానమానిత నవారుణకాంచనకుంభజృంభిత
శ్రీ నిరసించి సర్వసరసీరుహరాజి వికాసమందఁగా
భానుఁడు దోఁచి శీఘ్రగతి భాసిలె నంత వియత్తలంబునన్. 149

వ. ఇట్లు సూర్యోదయంబున రాజనందనుం 'డొక్కచందంబున ధైర్యంబు చిక్కంబట్టి కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సునందావిలాసవిభ్రమంబులు దలంచుచు నొక్కరుం డొక్క రాజమార్గంబునం బోవుసమయంబున. 150

సీ. మడిచినజగజంపుజడల క్రొంజిగిఁజాల నొడల భస్మచ్ఛాయ గడలుకొనఁగ
మువ్వన్నెమెకముతోల్ దువ్వలువఁగాఁగట్టి మెడను రుద్రాక్షతావళము లడర
స్ఫటికాక్షమాల హస్తంబున శెల్వొంద డాకేల నొకకమండలము పూని
పాదాబ్జముల యోగవాగాలు గదియించి కలియ సందిట మాలికలు రహింప
తే. జనులు ప్రత్యక్షశంభుఁడో యనఁగ నిలిచి, వెఱఁగుపడి చూచుచుండఁగ వీథివెడలి
దేహకాంతులు నలువంకఁ దేజరిల్లఁ, జేరఁగావచ్చె నందొక్కసిద్ధుఁ డపుడు. 151

క. వచ్చినసిద్ధుని గనుఁగొని, యచ్చెరువడి రాజపుత్త్రుఁ డాతనిమదిలో
మెచ్చుచుఁ గేల్మొగిచి ప్రియం, బచ్చొత్తఁగ మధురసాహసాదరఫణితిన్. 152

క. ఎందుం డెచ్చటి కరుగుచు, నిం దరుదెంచితివి నామ మెయ్యది యంచున్
విందై యడిగిన యోగా, నందుండగు సిద్ధుఁడనియె నరపతితోడన్. 153

తే. అరుణగిరినుండి తుహినాద్రి కరుగువాఁడ, వినుము స్వచ్ఛందుఁ డనుసిద్ధవిభుఁడ నేను
ఫలిసె నీచింత చింతాప్రతిష్ఠగరిమ, నాలిఁగొనవేల నింకొక్కమేలు నీకు. 154

క. ఒకచెలిపై భ్రమపడి యా, సకి పిలువక యున్న మోహసంగతమతివై
వెకిలిపడుచుంటి వదియుం స, మకుఱుక్ వగవంగవలదు మనుజాధీశా. 155

క. వెస భసితఘుటిక నీ కే, నొసఁగెద నీకోరఁదగినయువిదల వెస నీ
బసుమము నొసలం దిడినను, నసవృశగతి వశ్యులగుదు రాచెలులధిపా. 156

వ. అని యిట్లు హితోపదేశంబుచేసి తన కక్షపాలం దాఁచిన యపూర్వభసితఘుటికయ తనికరతలంబునం బెట్టి సిద్ధుం డెందేనియుం జనియె నంత రాజకుమారుం డమ్మహాత్ము నుద్దేశించి ప్రస్తుతించుచు నిజనివేశంబున కరిగి ప్రహృష్టమానసుండయి యిష్టాహారంబుల సంతుష్టిం గాంచి విచిత్రగంధమాల్యాంబర భూషణాలంకృతుండయి కర్పూరతాంబూలంబు సేయుచు నారాత్రి సునందామందిరంబున కేకతంబ చను సమయంబున. 157

తే. కొన్ని తెరువులు గడఁ యక్కుంవరదన, నెలవుచేరువఁ జనఁగ సన్నిహితమగుచు
నొకభుజంగంబు బొటనవ్రే లొడిసిపట్టి, కఱచె గరళాగ్నికీలలు గడలుకొనఁగ. 158

ఆ. అటులు సర్పదష్టుఁ డగుచు నిష్టాంగనా, సంగమంబునకును భంగమయ్యె
వేగమ చని సురతభోగంబుఁగని చత్తు, ననుచు వెలఁదియింటి కతఁడు చనియె. 159

క. చని యటు తనచే దాఁచిన, ఘనభసితము నొసలఁ దాల్చఁ గని తమకమునన్
వనితారత్నము కౌఁగిట, బెనఁగిన నొండొరులు రతులఁ బెనఁగిరి వేడ్కన్. 160

ఆ. భుజగదష్టుఁడయిన భూపాత్మజునివీర్య, ముఖ్యముగా విషంబు ముదిత కెక్కె
సుదతితోడ నతఁడు సురతాంతమున జీవ, మెడలె శూలిదూత లేగుదేర. 161

క. మామాత్ర లేఁగి కాంచిరి, యాదంపతు లొడల భస్మ మమరుటఁ దమలో

వాదించి భస్మసహితుల, నేదాని ముట్టవచ్చు నీక నని భీతిన్. 163

వ. కలంగి దొలంగి చనిరి గావున భస్మధారణ మహత్త్వంబువలన నక్కాముకుల విమానంబుమీఁదఁ బెట్టుకొని కామారిదూతలు కైలాసంబున కరిగి రింకొక్క విశేషంబు వినుము. 163

తే. తొల్లి శివభక్తుఁ డొక్కఁడు వల్లెకొంగు, నందుఁ గట్టినరుద్రాక్ష మరయ మఱచి
కోక చాకికి వేసినఁ గొంచుఁ బోయి, చాకిరేవునఁ జూచిన కోకముడియు. 164

క. ఆమాట విచ్చి రజకళి, రోమణి యందున్న భద్రరుద్రాక్షము తా
నేమరక పాగచెఱఁగునఁ, దా ముడిచికొని దగ యుందికె నందలిచీరల్. 155

ఆ. అట్టు లుదికి కోక లాఱిచి పెనుమూటఁ, గట్టి భార్య కెత్తి కదులు మిదిగొ
వత్తు నడవికేగి వంటకట్టెలు గొని, యనుచుఁ జెప్పి రజకుఁ డడవికేగె. 166

ఉ. కేల కుఠారమూని వనికిం జని యెండినమ్రాను గొట్టి ని
ర్మూలము సేయఁజొచ్చిన సమూలముగాఁ దెగి భూజ ముర్విపై
వ్రాలుచు వానిపైఁ బడిన వాఁడు మహాభర మోర్వలేక వే
తూలి శరీరముఙ్ విడువ ధూర్జటికింకరు లేగుదేరఁగన్. 167

క. మాభటులుఙ్ వారలఁ గని, లోభి చెడుగు వీఁడు మీరలుఙ్ రాఁదగునా
శ్రీభవు లోకార్హుఁడు గాఁ, డే భవ్యతగలిగె మాకు నేర్పడఁ జెపుడా. 168

తే. అనినఁ బ్రమథులు మందస్మితాస్యులగుచు,వినుమురజకుఁడు గాఁడు పావనుఁడువీఁడు
తలను ధరియించినాఁడు రుద్రాక్షమొండు, గాన శివలోకసౌఖ్యంబు గను నితండు.

వ. అని చెప్పి యారజకుఁ బరమవిమానంబుమీఁదఁ బెట్టుకొని రజతాచలస్థానంబునకుం దోడ్కొనిపోయి రదియునుం గాక. 170

ఉ. మున్నుఁ బుళిందదేశమున మూకుఁడనంగఁ గిరాతనాథుఁ డ
త్యున్నతి నొక్కనాఁడు నరుణోదయవేళను మేలుకాంచి చ
ద్దన్నము మెక్కి శాతవిశిఖాసనసాయకసాధనంబులం
బన్నుగఁ బూని ఘోరగహనంబునకుం జని వేఁటలాడఁగన్. 171

ఉ. అంచితవేగుఁడై చని శరాసన మెక్కిడి సాయకంబు సం
ధించి వరాహసంఘములఁ దీవ్రత నేసిన నిట్టునట్టుఁ ద
ప్పించుక పాఱిపోవు మృగబృందము లుర్లకుఁ జేరరావు తాఁ
బంచినసారమేయములు బల్వడిఁ గ్రమ్మఱి వచ్చు నూరకన్. 172

క. ఏకరణి వేఁటలాడినఁ, జీకాకయిపోవుఁగాని చిక్కవు మెకముల్
మూకుం డంతట మదిలో, శోకింపుచు నున్నతఱిని సూర్యుఁడు గ్రుంకెన్. 173

శా. ఆవేళం గలహంస మంబరరవవ్యాపారలీలం జనం
గా వన్యాటుఁడు గాంచి మార్గణము వీఁకన్ వింట సంధించి మూ
ర్ధ్వాక్షివిర్భ్యాతరవంబునన్ విడువ సాహంసాస్యకుం డాఁకఁ జం
చూవిన్యస్తహిరణ్యపద్మవనవృక్షాగ్రంబునన్ వ్రాలినన్. 174

ఆ. హంసవక్త్రగోళమందున్న కాంచన, జలజకమల మచటికంభులింగ
శిరముమీఁదఁబడియె శరముతో సమ్మగా, శంబు గూలె నయ్యలాశలమున. 175

వ. అంతఁ గాలాంతకుండు కరుణారసభరితాంతరంగుఁడయి యమ్మహాలింగమధ్యంబున
నుండి. 176

చ. హరి పురుహూత పద్మభవులాదిసుపర్వు(లు). రుద్రసూక్తి భా
సురపఠనానుభావములు శోభిలికొల్వ మునీంద్రులాగమ
స్ఫురణలసత్పవిత్రహితభూరివచోగతిఁ బ్రస్తుతింప సుం
దరవృష మెక్కి పర్వతసుతాపతి తోఁచి ప్రసన్నమూర్తియై. 177

తే. శబరవల్లభ నిన్ను నేఁ జాలమెచ్చి, నాఁడ సీక్షిప్త మెయ్యది వేఁడు మింత
కాల మిందున్నఁ బూజ సీకతనఁ గలిగె. వనజముదకంబు నాశిరంబునను వ్రాల. 178

తే. చల్లనయి దేహమెల్లను బల్లవించె, బహుయుగంబులు గడచెనే బట్టబయిట
నుండి కొణితెఁడుజలమైన నొండుపువ్వు, మైన మాకిచ్చువారలఁ గాన మిందు. 179

వ. అట్లగుటం జేసి మదీయభక్తులలో నుత్తముండ వింక వరంబుఁగోరుమిచ్చెదనని మెచ్చి పచ్చవిల్కానిమచ్చరిఁ డానతిచ్చినఁ దదీయసన్నిధానవిశేషసుజ్ఞానోదయం బయిన కిరాతుండు వడవడవడంకుచు భక్తివిశ్వాసంబుల విశ్వేశ్వరునకు నమస్కారంబు లనేకంబు లానరించి మోడ్పుకేలు ఫాలంబునం గీలించి యిట్లని స్తుతియించె. 180

సీ. జయజయ కైలాసశైలేంద్రనిజవాస వాసవాదికసురవంద్యమాన
మానసీయ యశోరమాపూర్ణబహుకాండకాండజోద్భవశూలికలితహృదయ
దయనీయ సకలభక్తవ్రాతపూజిత జితమహాసుర శుభస్థితవిహార
హారహీరపటీరచారుతరాకార కారాగృహప్రాపితారివీర
తే. వీరభద్రకుమారాభివృద్ధిసహిత, హితమునీశ్వరరక్షణ వ్రతవిచిత్ర
చిత్రరథముఖ్యగంధర్వసిద్ధదాన, దానవాంతక దృఢూప్యజ్యతరుణచరణ. 181

క. అని ప్రస్తుతించి శబరుఁడు, వినయంబున మిమ్ము వరము వేఁడ విహిత మా
కన కాబ్జముజలమును దెచ్చినహంసము మెచ్చి యిమ్ము చింతితఫలముల్. 182

క. ఆహార మబ్బకుండెన, నాహంసముఁ గూలనేసి తంతే హర సం
దేహంబుగాదు మీ కు, త్సాహంబయి యొప్పనేని ధన్యుఁడనైతిన్. 183

ఆ. ఇట్లు పలుకుచున్న యెఱుకాత్మశుద్ధికి, మెచ్చి శంభుఁ డంచ నిచ్చఁ బిలిచి
తనకరాంబుజమున దాని మేనెల్లను, నిమిరె భూరికరుణ నివ్వటిల్లఁగ. 184

మత్తకోకిల. ఓమరాళమ నీవు వెచ్చపయోజలంబులు నాశిర
స్సీమఁ జేరుటఁజేసి భూరివిశేషవైఖరిఁ బొందితి
న్నేమిగావలెఁ గోరు మిచ్చెద నిష్ట దన్న మహేశనే
వామహత్త్వము సన్నుతించెను వాక్యగుంభన హంసమున్. 185

సీ. గంగోత్తమాంగాయ కరుణాంతరంగాయ వామదేవాయ శివాభవాయ
సోమాయ భీమాయ సోమకోటీరాయ శర్వాయ భర్గాయ శంబరాయ
కలితచిన్ముద్రాయ ఘనయోగనిద్రాయ భద్రాయ రుద్రాయ భవహరాయ
భువనవరేణ్యాయ బుధజనగణ్యాయ మోక్షప్రదాయ ఫాలేక్షణాయ
తే. మహితశీలాయ తుభ్యన్నమశ్శివాయ, మౌనిపాలాయ తుభ్యన్నమశ్శివాయ
మహితయోగాయ తుభ్యన్నమశ్శివాయ, మదనమదనాయ తుభ్యన్నమశ్శివాయ. 186

చ. అనివినుతించి హంసము భయంబున దేవ భవత్కృటాక్షసం
జనితవిభూతిముక్తియు నిషాదున కిష్టము లేదగున్ జలం
బును గమలంబు మీకొఱకుఁ బూనను గూనలఁ బ్రోవ నే ప్రియం
బునఁ గొనిపోవ నియ్యెఱుక పుణ్యముగట్టుకొనె న్మహేశ్వరా. 187

తే. కోఁతియాడ భోగి కోఁచెత్తికొన్నట్లు, లేను మిమ్ము వరము లెట్టు వేఁడి
కొందు నన్న హంసగురుచిత్తమున మెచ్చి, శివుఁడు చిఱుతనవ్వు చెంగలింప. 188

క. ఓయెఱుకురాజ రారా, మీయంచకు నీకుఁ గోర్కె యెయ్యది యిత్తున్
మీయిద్దఱ మెచ్చితి నన, సాయుజ్య మభీష్ట మింకఁ జాలు భవంబుల్. 189

మ. అనివేఁడం గరుణాసుధారసము నేత్రాంతంబులం జింద భో
రన గంధర్వసుపర్వసర్వమును లత్యాశ్చర్యముం జెంద జ
య్యన నయ్యిర్వురఁ జేరఁగాఁ బిలిచి నిత్యానందసంబంధచి
ద్ఘనమార్గంబునఁ గూర్చి మోహలతికల్ ఖండించి సర్వేశుఁడున్. 190

క. అంతర్ధానముఁ జెందెఁ బు, రాంతకుఁడని చెప్ప విని మహాముని మదిలో
సంతోషమందెఁ గనుఁగొని, యంతకుఁ డిట్లనియె మంజులాలాపమునన్. 191

క. ఈపాటిధర్మసూక్ష్మం, బీపాపులయందు లే దొకింతయుఁ గలుగం
దాపసవర నిరయార్తి, ప్రాపితు లగుటెట్లు శంభుపదముం గనరే. 192

వ. అని చెప్పి పరమమునీంద్రులతోడ సానందుం డోడ్కొని వెలుంగుతేనిఁ గొడుకు
ముందఱ కరుగ నచ్చటం గల్గుపంకజాక్షులఁ బ్రేతాధ్యక్షకింకరులం గుశలంబులం
గొంకఱ కోంకంబు లూంచుచు భుజాగ్రమండలాగ్రంబులం గొండలి కండలు

గోయుచుఁ గరపత్రంబులఁ గొందఱి కుచమండలంబులు దరుగుచుఁ గ్రొవ్వాఁడి
వేఁడిబాడిసెలఁ గొందఱిమాంసంబులుచెక్కి పాఱవయుచుచు వంకకత్తులఁ గొందఱ
నాసికాకర్ణదేశంబులు ఛిన్నంబులు గావించుచుఁ బాశంబులఁ గేశబంధంబులు
బంధించి కట్టెలం గొందఱి ఘట్టించియు నకనిశితశలాకలం గొందఱి యుదరప్ర
దేశంబులం జొనిపియుఁ జిఱుతచుఱకత్తులం గొందఱి వాతెఱలు చీలికలు చేసి
గాఱించుచు నడకత్తులం గొందఱిదేహంబు లొత్తుచు రాతిపయిం బెట్టి చిందఱసే
యుచుఁ గల్లుగానుగలం బెట్టి కొందఱి నలినలిసేయుచు శూలంబులఁ గొందఱి మద
నాలయంబులం జొనిపి నిర్మూలంబుగావింపుచు వేఁడికొఱవులం గొందఱ సూఁడుచు
సన్నకుండంబులం గొందఱఁ బడద్రొబ్బుచుఁ దైలఘటంబులం గొందఱ నుడికిం
పుచు భుగభుగ పొగలెగయ మండెడు నుక్కుకంబంబులం గొందఱ నంటఁగట్టుచు
ముంగలంబులం గొందఱ గఱివేఁపాతులఘోంగి వేఁపుచు నంపశూకంబులచేతఁ గొం
దఱ మర్మస్థానంబులం గఱపింపుచు వృశ్చికకూపంబులం గొందఱఁ గూలఁద్రో
యుచు మల మూత్ర క్రిమి కీటక దుర్గంధ మహాంధకారబంధుర నిరయగుహాల
లోఁ బడనూకి కొందఱి హింసింపుచుఁ జండకరకిరణసంతప్తసైకతస్థలంబులం
గొందఱ బిఱబిఱం బొరలింపుచు సీసంబుగాఁచి కొందఱి ముఖగహ్వరంబులం బో
యుచుఁ గ్రూరవిషంబులు ద్రావుమని వాఁడికత్తుల నాడించుచుఁ గొందఱిదంతంబు
లింతింతలుగా రాలమొత్తియుఁ గొందఱి కటిప్రదేశంబులం బడనీడ్చియుఁ గొందఱి
విఱిచికట్టియు ని ట్లనేకభంగుల భంగింప భంగపడి నికృష్టాంగనాజనంబులు
దుఃఖింపుచున్నం గనుంగొని మానిమార్తాండుం డాత్మగతంబున మార్తాండిదయా
విహీనత్వంబునకు రోసి సమవర్తీ నీవు కృపామూర్తివి నారీజనంబులెడ కారుణ్యా
లేశంబు లేమికిం గారణం బేమి యబలకు నిమ్మహాదురవస్థ యేమిటఁ గలిగెం దెలుపు
మని మునిశిఖామణికి వంశుమత్తనయుం డిట్లనియె. 193

క. ఈకాంతల దురితంబు లనేకంబులు గలవుఁ గాన నిరయంబుల నీ
జోకఁ గృశియింతురనుడు వివేకవిచక్షణుఁడు దెల్పవేయని యడుగన్. 194

ఉ. నాథునిఁ దక్కి యన్యుని మనంబునఁ గోరి సుమాయుధక్రియా
మేధఁ జరించె నీమగువ మేదిని నత్తలమామలన్ మహా
సాధుల బంధుకోటుల యశస్వులఁ గన్గొని తూలనాడు స
ద్బోధవిచార దీని గనుఁగొంటె విశిష్టవివేకభూషణా. 195

క. తనపురుషుఁ డన్యవనితా జనగమనుం డగుట యెఱిఁగి సైరింపక యా
తని నప్రియములు వలుకుచుఁ, గను నీకష్టాత్మురాలు కరుణావార్థీ. 196

తే. మగఁడు సంగాల కెదుచున్న నగటుఁజెంది, తాను దాసళ్ళకేడు పతితాత్మురాలు

వరుఁడు గోపించి యొకదెబ్బవైవఁ బూన, నతని మార్కొత్తఁ దివురు నీయజ్ఞురాలు.

ఉ. అన్నముఁ బెట్టుచోట వినయంబు భరింపక పఙ్క్తి వారికిన్
భిన్నము లాచరించు పలుబీజపురాలిది రేఁబగళ్లు మేల్
సన్నలసైగలన్ వగల జాణతనంబునఁ గోడెకాండ్రతోఁ
గ్రొన్ననవింటివాని పలుగోపులమీఱిన దీనిఁ జూచితే. 198

క. కలిమిగలనాఁడు మగనిన్, వలరాయనిగాఁ దలంచి వంచించు తుదిం
గలిమిబలమంత యుడిగినఁ, గలుషాత్మకురాలు దీనిఁ గంటె మునీంద్రా. 199

క. దాసీదాసులపై వ, ట్రాసలు పుట్టించి ధర్మ మారయక నిజా
వాసమునఁ గల్గువస్తువు, లాసాసల పడగ దాఁచు నయ్యింతి మహిన్. 200

క. చెలువుఁడు మారాడిన మెటి, కలు పెట్టిన నిఱిచి తిట్టుఁ గసలుచు నింతిం
తలుగాకుఁడం బొడిచిన, కలహప్రియురాలు దీనిగంటె సుధీంద్రా. 201

సీ. పురుషుఁ డీల్గిన ప్రెడ్డు పోయెఁ బొమ్మని యన్యకాంతుని జేరు నీకష్టురాలు
పతిభుజింపకమున్నె పక్వాన్నరసములు నిరతంబుఁ గుడుచు నీ నీచురాలు
వల్లభునకుఁ గానివారితో సరసంబు లాడఁగా దొడరు నీయజ్ఞురాలు
అధిపుఁడు కోపించునవసరంబునఁ బొరుగిండ్లలో డాఁగు నీ హీనురాలు

తే. నాయకుఁడు మాటిమాటి కేమేయటన్న, నాగ్రహంబున నేమి పొమ్మను బజారి
నాథుఁడత్తనుక్రియామోద నియతఁగడియఁ, దొడరితప్పించుకొను మహాతుచ్ఛురాలు.

తే. కూరగాయలు వండుచోఁ గుటిలహీన, జీవములఁ బాపలేని దుర్భావురాలు
కీటకాకీర్ణదారువుల్ మాటిమాటి, కగ్నిలోఁ బడవేయు నీయజ్ఞురాలు. 203

మత్తకోకిల. ముట్టసీయదు వాఁడు ముట్టిన బొంకులే సహజంబు నీ
కట్టువాయికిఁ బొట్టకొవ్వునఁ గాంతునిం బరుషోక్తులన్
మట్టుపెట్టఁ దలంచుఁ బెద్దల మాటికి న్నిరసించుచుం
గట్టుకొన్న హృదీశుపాలికిఁ గాలమృత్యు విదే సుమీ. 204

తే. కొడుకు నొండైనఁ బడయని గొడ్డురాలు, చావుబిడ్డలఁ గన్న దుర్భావురాలు
గోళకులతల్లి యీహీనగుణ సుబుద్ధి, యంతయును లేని కుటిలాత్మురాలు గంటె. 205

క. అంటుపడి చెప్ప కూరక, యింటం దిరుగాడువెలఁది హృదయేశునకుం
గంటకప్రబలు జెప్పెదు, దంటసుమీ యావధూటి తాపసవర్యా. 206

ఉ. ఒక్కని యింటిలో నునిచి యొక్కని ముంగిట నుండుమంచు వే
ఱొక్కనితోడఁ జెక్కువగ నొక్కట చిక్కనిమాటలాడి యొం
డొక్కని ముద్దు పెట్టికొని యొక్కని కౌఁగిటఁ జేర్చు సొంపు మెం
పెక్క విటావళిం గలయు సీయొలనాఁగ మునీంద్ర వింటివే. 207

మ. సురలేచ్ఛ నృతిసొమ్ము పల్లవుల కిచ్చు న్వంచనోపాయబం
ధురమార్గంబున మీఱి రిత్త శివసత్తుల్ సోదెలు న్రెప్పిమం
త్రరహస్యంబులుఁ జెప్పి యాత్మవిభుమర్మంబు ల్వెలింబుచ్చుచు
న్గరుణావర్జితచిత్తయై మెలఁగు నీకష్టాత్మురా లెల్లెడన్. 208

ఉ. పుత్రుల నెచ్చఁబెట్టుచు విభుం బరితాపముఁ బొందఁజేయుచుం దాఁ
జిత్రవిచిత్రవాక్యములఁ జేసి గొంటుతనంబు వోఁడఁగా
గోత్రమువారిమా ఱుసుర గ్రోలుచు హీనప్రమాంసము దినుం
బాత్రతమాని యిట్లెలఁది పాతకురా లిది యెన్నిభంగులన్. 209

చ. పొరుగిరుగిండ్లవారును విభూతిఁ జెలంగిన నోర్వలేక తా
వరుని బిరాన దూఱు పరివారలు సంపదఁ బొందియుండ నై
కరణిఁ గృశించియుండుఁ గలకాలము కూటికి మోసమాయెఁ గాఁ
పురమికఁ జాలుచాలు నని పోరులు వెట్టినబోటిఁ జూచితే. 210

శా. అమ్మా బిచ్చమటన్న వేయ దొకయింతైన న్సుహృద్బంధుజా
లముల్ గొంపకువచ్చినం గసరు వాలాయమ్ము మార్గస్థులన్
రమ్మంచున్ శయనాదులిచ్చి యతిసన్మానంబుగాఁ జూచుఁ దా
నిమ్మాహాత్మ్యకురాలుగంటె శివయోగీంద్రా మహేంద్రస్తుతా. 211

వ. అని యిట్లు యోషిద్ధర్మంబు లెఱుంగఁజెప్పి వెండియు దండధరుం డమ్మౌనిమార్తాండున కిట్లను నిన్నారకు లింకమీఁదట ననుభవింపందగిన నరకంబు లిరువదెనిమిది కోటులు గల వందు నాకన్న నరకంబు లొకకొన్ని విన్నవించెద వినుం డతిఘోరంబును సుఘోరంబును మహాఘోరంబును ఘోరరూపంబును తరళంబును భయానకంబును గాళరాత్రియు భయోత్కటంబును జండంబును మహాచండంబును జండకోలాహలంబును గరాళంబును విరాళంబును వజ్రంబును ద్రికోణంబును బంచకోణంబును షట్కోణంబును దీర్ఘంబును సప్తభావనంబును నష్టభావనంబును దీప్తంబును మాయయు మహామాయయు రౌరవంబును శీతంబును మహాశీతంబును దమంబును నుష్ణంబును సుతీక్ష్ణంబును బద్మసంజీవనంబును మహాపద్మంబును శతంబును నతిలోకంబును సుభీమంబును దీవ్రంబును మహావేగంబును బ్రకంపనంబును సువిక్రమంబును గాలసూత్రంబును బ్రవృశ్చికంబును సూచీముఖంబును నేమియు ఖాదనంబును సుప్రతీకంబును గుంభీపాకంబును గూపంబును నంగారరాశియుంభవంబును నసృక్పూయహ్రదంబును విష్టాలయంబును దుండశకునియు సంవర్తకంబును మహాసంవర్తకంబును బాకలేపంబును మూత్రవిష్ఠాకూపంబును బూయకూపంబును శాతనంబును శిలాశకటాలింగనంబును ద్విపాదంబును నతిజతంతిమంబును

నలిదుఃఖంబును మహాదుఃఖంబును గళ్మలంబును నానాయంత్రంబును సమ్మోహంబును నలిభంగంబును దప్తకాలంబును హాలాహలంబును నలికూపంబును నేకపాదంబును మలంబును కులపర్వతంబును బ్రపూరణంబును దప్తశిలాతలంబును మొదలు గాఁగల మహానిరయంబులు నిందుఁగలవనినఁ గరుణాసాంద్రుం డాత్మగతంబున.

తే. ప్రణవపంచాక్షరీమంత్రరాజ మిచటి, సకలనారకకర్ణదేశములు సోఁకి
పాపనిర్ముక్తులై శంభుపరమపదవి, కేగెదరుగాక యని నిశ్చయించి యపుడు. 213

చ. తనహృదయాంబుజాతమున దర్పకభంజనుపాదపద్మముల్
ఘనతరభక్తిఁ గీల్కొలిపి కన్గవ యించుక మూసి నారకా
వళి మహిమాఢ్యులట్లును శివా హర శంకర మీయనుగ్రహం
బున మహనీయసౌఖ్యములఁ బొందెద రందఱు నీక్షణంబునన్. 214

వ. అని యిత్తెఱంగునఁ దాపసోత్తముండు తనదివ్యచిత్తంబునఁ జిత్తజాహితుం దలంచి సమస్తకల్యాణాభిరామంబును సప్తకోటి మహామంత్రసార్వభౌమంబును నిఖిల వేదవేదాంత మధ్యనాయకరత్నంబును నిర్వాణసౌఖ్య సామ్రాజ్యరత్నంబును సకలకలుషారణ్య దావపావక వైభవంబును నగు ప్రణవపంచాక్షరీమంత్రరాజంబు మహాబలాహక గంభీరకుంభధ్వానంబుగా షడ్వర్ణంబు లుచ్చరించిన ధర్మప్రసంగాది మహార్షిపుంగవులు నిట్లు మహామంత్రంబు బహువారంబులు ఘోషింప నమ్మహానాదంబు లష్టావింశతికోటి నరకవాసులు కర్ణరంధ్రంబులం దూఱిన తత్క్షణంబున వైవస్వతుండు నివ్వెఱఁగంది చూచుచుండ నిమిషంబున నారకులు సకలపాపనిర్ముక్తులయి రుద్రగణాకారంబులు దాల్చి భద్రవిమానారూఢులయి నిజాంగదీప్తులు పిక్కటిల్ల భసితాంగరాగశోభాసమానులు భస్మరుద్రాక్షభూషణులును జటామండల మండితులును గంగోత్తమాంగులును శూలపినాకధారులును గజాజినవ్యాఘ్రచర్మపరిధానులును లలాటనేత్రులును హాలాహలకంధరులును భుజంగహారకేయూరులును వృషభధ్వజులును నై సర్వజగంబంతయు "శివాత్పరతరంనాస్తి" యనువాక్యంబుగా నేవంకం జెలకింప శంకరాకారంబై యంతరిక్షంబునం దేజరిల్లినఁ బరమానందంబునఁ గందళితహృదయారవిందుం డై సానందమునిపురందరుం డందఱం గైలాసంబున కరుగుఁడెండని యనుగ్రహించి దండధరునిసుఖంబుండుమని దీవించి తానును మానిజనంబులు పూర్వవిమానంబుపై నెక్కి గగనమార్గంబునం జనుచున్నఁ గోటి దశకోటి శతకోటి సంఖ్యలు గదలి దివ్యపుష్పకంబులమీఁదం దనవెంటవచ్చు రుద్రగణంబులంగాంచి సంతసింపుచు దివ్యదుందుభిధ్వానంబులకు సురవరులు గురియు సుమవర్షంబులకు రంభోర్వశీముఖాంగనల నవినోదంబులకు గంధర్వజనబంధుర సంగీతకోలాహలంబులకు సిద్ధవిద్యాధర జేగీయమానశబ్దంబుల

కందండఁ బరమానందం బందుచు సానందుం డమందవేగంబునం జనిచని మహా
కైలాసద్వారప్రదేశంబున విమానంబుడిగ్గి రుద్రగణంబులతోడ రుద్రలోకంబు
సొచ్చిపోవ నెడనెడఁ గలుగు శివయోగులం గని నమస్కరింపుచు భవ్యభవనద్వారం
బుఁజేరి బ్రహ్మేంద్రాది దివిజులును మునిపుంగవులును విప్రవరులును గొల్వ హీరమ
ణిమయపీఠంబున మహాదేవీసమేతుండై మహాదేవుండు కొలువున్న గన్నులారం
గనుంగొని సానందుం డత్యంతసంభ్రమంబున ననేక ప్రణామంబు లాచరించి ఫాల
విన్యస్తహస్తుండయి శూలహస్తు నుద్దేశించి యిట్లనియె. 215

సీ. కనకాద్రికోదండ కల్పితబ్రహ్మాండ మురవైరి ఘనకాండ ముఖరగండ
యార్తజనత్రాణ యఖిలైకకల్యాణ జితపంచబాణ సంభృతకరైణ
కాలకూటాహార గజదైత్యసంహార మోహాంగనాజాతమూలసార
సద్భక్తమందార సకలదిక్పరిధాన రజితాచలస్థాన రాగహీన
తే. యమరమూర్ధన్య యాదిమధ్యాంతశూన్య, దివ్యలక్షణవర్తి సందీప్తమూర్తి
దక్షయజ్ఞవిరామ ఫాలాక్షభీమ, తారకబ్రహ్మనామ సుధాబ్ధిసోమ. 216

శా. దేవా నీవఖిలాధినాథుఁడవు నీదివ్యస్వభావంబులన్
భావింప న్నిగమంబులు న్వెఱచుఁ జెప్పం జిత్రమా? గాన నా
నావర్ణంబులజీవభేదముల పూర్ణబ్రహ్మతేజోమయుం
డై వెల్గొందెద విట్టినన్ను నుతిసేయ న్నేడ నెవ్వారలున్. 217

క. నీకరుణ పెంపు గాదే, శ్రీకంధర వీర లలితవిశేషవిభూతు
ల్సేకొని యిం దరుదెంచుట, లీకైవడిఁ బార్వతీహృదీశ మహేశా. 218

మ. అని కీర్తింపఁ బ్రసన్నుఁడై శివుఁడు నెయ్యంబారఁ జేరంగ న
మ్మునిసానందునిఁ గౌఁగిలించుకొని యాత్మాంకస్థలిం జేర్చి సం
జనితానూనకటాక్షవీక్షణసుధాసారానుభూతిం గను
గొని వత్సా భవదీయభక్తికిని మాకుం బ్రేమ సంధిల్లెడిన్. 219

తే. చెల్లునా యిట్టికార్యంబు సేయ నేరి, కైన నీవంటిధన్యునిఁ గాన మెందు
మాకుమారుఁడ నీవు సమ్మతి వసింపు, మిందఱకు నాదుసామీప్య మిచ్చి తనఘ. 220

మ. అని సర్వేశుఁ డనుగ్రహించుతఱిఁ బ్రేతాధీశ్వరుం డచ్చటం
దనలోకం బటు పాడుచేసి చనియె న్మౌనీంద్రుఁ డిచ్చోట నీ
జనశూన్యం బగురాజ్యభార మిఁక నేజాడన్ విచారింతు నేఁ
జని శంభుం గని దండసాధనము లోజం బెట్టి యొప్పించెదన్. 221

వ. అని నిశ్చయించి కట్టాయితంబయి కాసరరాజం బెక్కి గృధ్రకేతనంబు త్రాల చిత్ర
గుప్తాది మిత్రులును గవ్యవాహన ప్రముఖ పితృదేవగణంబులును వీరసేనప్రభృతి

కింకరవర్గంబును మతంగాది మహర్షి పుంగవులును బలసికొలువఁ దక్షిణంబునం గదలి యుత్తరాభిముఖుండయి యనేకలోకంబు లుత్తరించి యఖిలలోకో త్తరంబగు నిఖిలేశ్వరులోకంబుం గాంచి బహిర్ద్వారంబున లులాయంబు డిగ్గి నందికేశ్వరునకుఁ బ్రణమిల్లి యాతనిచేత ననుజ్ఞాతుండయి చొచ్చి పోవఁ బురోభాగంబున దస్తచామీకర సుందర కుడ్యప్రకాశితంబును బద్మరాగకుట్టిమప్రభావిరాజితంబును దేదీప్యమానకనకాంబరవితానభాసమానంబును మరకతమణికవాటద్వారగేహాళీనిరాఘాట కంచుకితంబును బలభిదుపలకనద్విటంక సంకీర్ణబంధురంబును వైడూర్యవాతాయనాయాతశీతలమారుతపోతసంచారంబును భద్రవిద్రుమస్తంభసంభృత శుంభదలంకారంబును సాంద్రచంద్ర కాంచన సోపానవార విస్తారంబును లంబమాన వితాన సూనదామాభిరామశృంగారంబును సచ్చిదానందమయంబు నగు మహాదేవునిసభామంటపంబునఁ జతుర్ముఖ శతముఖశతమఖావరజ ప్రముఖ నిఖిలబహిర్ముఖులును హేరంబకుమారప్రభృతికుమారులును భైరవవీరభద్రకాలాగ్నిరుద్రాదిరుద్రులును సనక సనందన సనత్కుమార నారద విశ్వామిత్ర వసిష్ఠమార్కండేయ కుంభసంభవముఖ్య సనాతనయోగీంద్రులును భృంగిమహాకాళాది ప్రమథగణంబును పరివేష్టించి కొలువ మాణిక్యసింహాసనంబునం బరమేశ్వరుండు పరమేశ్వరీసమేతంబుగా నిండుకొలువయి యున్నఁ గన్నులపండువుగా దర్శించి దండధరుండు కాల దండ కాలపాశంబులు ముందటం బెట్టి సాష్టాంగదండప్రణామంబు లాచరించి సంభ్రమంబునఁ గరకమలంబులు మోడ్చి యిట్లని స్తుతించె. 222

సీ. శివ పార్వతీనాథ శృంగారగుణయూథ గంగాసనాథ సత్కర్మబోధ
మునిచిత్తసంచార ముక్తిమార్గాధార భవవిదూర సమస్తపాపహార
మస్తకస్థితచంద్ర మహితానుభవసాంద్ర తనుకాంతిజితచంద్ర ధర్మరుంద్ర
కరపద్మసారంగ కరుణాయుతాపాంగ ధాత్రీశతాంగ కందర్పభంగ

తే. భంగభంగీకృతవిరోధిబలతురంగ
రంగదుత్తుంగ వార్ధితరంగ సంగ
సంఘటిత నవత్ప్రియంగ సహజానుషంగ
సంగరాంగణభీమ రాక్షసవిరామ. 223

వ. అని యనేకప్రకారంబులఁ గీర్తించి దీనాననుండయి భానుసూనుం డీశానదేవున కిట్లనియె. 224

శా. ఓశీతాచలకన్యకారమణ నాయుద్యోగ మింకేరిక్కై
నా శిక్షుంబున నిచ్చి పంపు మతి సన్మానుండనై మీకృపా
శ్రీ శృంగారవతీవిలాసమున వార్షింపక మహాదేవ లీ
లాశుంభద్గతిఁ బ్రోవు పాదుపురి యేలం జాల నాలింపవే. 225

సీ. నాపురిజాడ సానందుఁ డేతెంచి సర్వము గాంచి ఘోరదుర్గతుల నున్న
ఘనపాపకర్ములఁ దనమంత్రశక్తిచే విశ్రుతవైభవకళాన్వితులఁ జేసె
దోడ్కొనివచ్చి సిద్ధనిలీలఁ గవలక నీసమ్ముఖమున నెమ్మిఁగ వసించెఁ
జిత్రగుప్తుఁడు లెక్క చేకొనివచ్చి వాఁ డాలకింపుఁడు దుష్కృతౌఘసరణి
తే. యీశ వీరలు ధర్మంబు లేశమైనఁ, జేయఁజాలరు భవదీయచిహ్నములను
దాల్చి రెన్నఁడు నేఁడింకఁ దాళఁగొందుఁ, గటకటా యెంతచేసె నీతాపసుండు. 226

క. మును మార్కండేయునకై, నను దండనచేసినారు వాటంగోలెం
జని పట్టి వెఱతు రస్మజ్జనములు రుద్రాక్షభసితసంయుతఘనులన్. 227

ఉ. ఈగతి రాజ్యభారము మహేశ్వర యేనొనరించుచుండ నీ
భాగునివల్ల మత్పురము పాడుపడెంగద ప్రోవఁజాల నే
లాగున నన్న శంభుఁడు విలాసదరస్మితసుందరాస్యసం
మోగసుధాచులాపముల నూఱడిల న్మనిఁ జూపి యిట్లనెన్. 228

సీ. విను మమ్మహాత్ముఁడు ఘనకృపాంభోరాశి పరబాధఁజూడఁ జొప్పడనివాఁడు
పంచాక్షరీమంత్రపఠనానుభావుండు గావున నిబ్భంగిఁ గలుషమతుల
ముక్తులఁ గావించె ముక్తాఫలములైన జలములు గ్రమ్మఱ జలములగునె
మనుఁ జేసినట్టి ధీమంతులు రారు నీపురికేగి యెప్పటిపూన్కిఁ దనర
తే. నడల కిఁక మీఁదఁ బాపాత్ము లనుదినంబు, గలరు నీప్రోలికి రాజ్యమునకు దొరవు
నీవె కాకున్న నెవ్వారు నిపుణబుద్ధి, చనుమటంచానతిచ్చిన శమనుఁ డరిగె. 229

వ. అని చెప్పి కాలోపేతుండై సూతుండు నమ్మౌనివ్రాతంబున కిట్లనియె. 230

శా. ఆచంద్రాంబుజమిత్రసప్తనగతారాంభోధియై నిల్చుఁ గా
కీచారిత్రము నెవ్వరేని వినిన న్హేలాగతి న్వ్రాసినం
బ్రాచుర్యంబుగ వారికబ్బు ధనలాభక్షేమసౌభాగ్యలీ
లాచంచద్విభవంబు నీశ్వరకృపాలాలిత్య మత్యున్నతిన్. 231

ఆ. ఎవ్వరేమిగోరి యిక్కథ వినినను, గామితంబుఁ బడయఁగలరు దీని
పేరుగొనినమాత్ర భీకరనరకార్తిఁ, జెందఁబోరు ముక్తిఁ బొందువారు. 232

క. సానందచరిత్రం బిది, యానందము మీఱ వినినయంతన కలుగున్
శ్రీనందనమదహారిచి, దానందపురంబు సంతతానందంబై. 233

శా. ఆనందామృతపూరపూర సురదైత్యాహార్య నిర్భేదవా
నూనప్రాభవ వజ్రవజ్రమణి సింధూరస్ఫురత్కీర్తి తే
జోనిస్తుల్యవిహారహారకళికా శుంభత్కళాసాంద్రసాం
దీపాపన్నగరాజరాజధరరా జ్మత్తేభకంఠీరవా. 234

పంచచామరము. హరిత్పటీపటీరహారహారజద్విభాభరా
ధరాధరప్రదీపరత్న ధామచత్వరాంబరా
చరాచరాది సర్వభూత సంభవాకరాకరా
కరాళవిస్ఫులింగ కీలికాదవానలాశిఖా. 235

గద్యము. ఇది శ్రీమత్కాళికాంబా వరప్రసాదలబ్ధ సాహిత్యవైభవ సదాశివస్వరూప సద్గురుచరణారుణ రాజీవ సేవా సమాదితాద్వైతానుభవ కౌశికగోత్రసుధార్ణవ పరిపూర్ణకైరవబాంధవకోటీః బాపనయ్యతనూభవ సవినయగుణవిధేయ శివరామ నామధేయప్రణీతంబైన సానందోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

సానందోపాఖ్యానము సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1952

# పద్యకావ్యములు

| | ప్రతి 1.కి రూ. | అ. |
|---|---|---|
| అధ్యాత్మరామాయణము, పద్యకావ్యము ... | 2 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము.— | | |
| ఆది సభాపర్వములు ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 4 | 0 |
| శాంతిపర్వము ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు ... | 4 | 8 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 11 | 0 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ... | 7 | 8 |
| శాంతిసప్తకము ... | 7 | 8 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిచే, 3 సంపుటములు ... | 15 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు ... | 15 | 0 |
| ఉత్తరరామాయణము, చెక్కనికూర్పు ... | 6 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవి ... | 3 | 8 |
| కుమారసంభవము-నన్నెచోడ ... | 5 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము-మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... | 1 | 12 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన ... | 3 | 0 |
| చిత్రభారతము-తరిగొండ ధర్మన ... | 1 | 8 |
| అనిరుద్ధచరిత్రము ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక ... | 0 | 6 |
| అర్యవాదకోలాహలము, లఘుటీకతో ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 10 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవి | ... | 2 | 0 |
| డిట్టో వేంకటనాథ రాజకవి | ... | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, టీకాతాత్పర్యసహితము | ... | 3 | 0 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | ... | 5 | 0 |
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| బిల్హణీయము | ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 10 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యనిఘంటువు | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, వగైరా టీకతో | ... | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఛందోదర్పణము, (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| నరసభూపాలీయము, సటీక | ... | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నాచికేతోపాఖ్యానము | ... | 1 | 0 |
| ప్రహ్లాదచరిత్ర, ద్విపద | ... | 0 | 8 |
| భోగినీదండకము | ... | 0 | 2 |
| మొల్లరామాయణము | ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నికంటి తెలగనార్య | ... | 2 | 0 |
| డిటో ఆకొండి వ్యాసమూర్తిగారిది | ... | 0 | 3 |
| భక్తిరసశతకసంపుటము I, 20 శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |
| భారతసావిత్రి | ... | 0 | 2 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతిది, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో | ... | 1 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 6 | 0 |
| రాధికాసాంత్వనము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 1 | 8 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 8 |
| వామనపురాణము | ... | 5 | 0 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము | ... | 1 | 8 |
| వేమనపద్యములు | ... | 0 | 8 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| ,, (2723) చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము | ... | 0 | 4 |
| విజయవిలాసము | ... | 1 | 4 |
| డిటో సటీక | ... | అచ్చు | |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 6 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 4 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవి | ... | 1 | 0 |
| శశాంకవిజయము, (తారాశశాంకవిజయము) | ... | 1 | 8 |
| శివలీలావిలాసము | ... | 0 | 8 |